

హైదరాబాదులోని 'సంజీవరెడ్డి నగర్'లో తక్కువ ఆదాయవర్గాలవారి కాలనీకి, గుజరాత్ గవర్నరు నవాబ్ మెహిదీ నవాజ్ జంగ్ బహద్దూర్ 1963 మే 29వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.



డాక్టర్ల నాలుగవ బృందంలోనివారికి హైద్రాబాదులోని సైనిక వైద్యదళాల (దక్షిణ) కేంద్రంలో 1963 జూన్ 10వ తేదీన బాడ్జీలు ఇచ్చారు,

# ఆంధ్రప్రదేశ్

జులై : 1963

## విషయ సూచిక



మిథునం — అజంతా (చూ : వ్యాసం 10 పేజీ)


3 ముఖ్యమంత్రి లేఖ

5 రసాభాసము

— 'ఆత్మారామ్'

7 విశేషాలు — వ్యాఖ్యలు

— పి. వి. నరసింహారావు

10 ప్రాచీన భారతీయ చిత్రకళ

— క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

16 వెలుగు బాటలు

— కె. వి. భాస్కరరావు

17 పరాక్రమించి

— ఆవంత్స సోమసుందర్

19 తెలుపు — నలుపు

— పి. యల్. సంజీవరెడ్డి

21 అభ్యుదయం

24 శ్రీనాథయుగము — అన్యదేశ్యములు

— తుమాటి దోణప్ప

29 మధ్యరంగం ప్రజలు, ప్రాంతాలు

— డాక్టర్ గోపాలాచారి

32 మహాకవి (నాటిక)

— కొడవటిగంటి కుటుంబరావు

39 పారిశ్రామిక విశేషాలు

40 దండోరా

— 'మాల్యశ్రీ'

41 మన చరిత్ర సంస్కృతి

— ఎస్. ఎమ్. వై. శాస్త్రి

— యస్వీ జోగారావు

52 సంగ్రహప్రకటనలు

55 ఆతిథ్యం (అనువాద భారతి)

— ఆంగ్ల మూలం : గెయిరాల్ కర్మె

— అనువాదం : జానకిరామ్ పట్నాయిక్

60 ప్రశ్నలు — సమాధానాలు

62 నిర్బంధ డిపాజిటు పథకం

64 ఏరిన ముత్యాలు

66 పోచంపాడు

67 ప్రగతి పథంలో

69 లలనావనం

— ఆవుల జయప్రదాదేవి,

— డా. వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

73 మామిడికాపులో ఆంధ్ర ప్రదేశ్ దే అగ్రస్థానం

74 బాలానందం

— వాసిరాజు ప్రకాశం

— శివశంకరస్వామి

— వేటూరి ఆనందమూర్తి

77 ముఖ్యవార్తలు

78 గ్రంథ సమీక్ష



సంవత్సర చందా — రు. 3—00.

విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.


ముఖచిత్రం : ఈ సంవత్సరం అరుదైపోయిన మామిడిపండ్లు

మూడవ అట్ట : నల్లగొండ జిల్లా గుడిపల్లె గ్రామంలో పాఠశాల విద్యార్థులు శ్రమదానానికి బయలుదేరుతున్న దృశ్యం.

# అపూర్వ చైతన్యం కలిగిస్తున్న 'ఆంధ్రప్రదేశ్'

మహాశయా !

ఆంధ్రప్రదేశ్ సంచిక అందుకొని అమితంగా ఆనందించాను. ఏదో తీరని లోటు — వెలితిగా తోచినది, నేటికి తీరిపోయినది. పాఠశాల బాలబాలికలకి పత్రిక ఆకర్షణీయముగా లేకుండెడిది. 'బాలానందం' శీర్షికతో పరిపూర్ణమైనది.

మా విద్యార్థుల కిదివరకే ఈ పత్రిక ఎనలేని మేలు చేకూర్చింది. వారిలో విజ్ఞాన దీపికలు వెలిగించి, దేశభక్తిని పెల్లుబుక జేసింది. ఈ పత్రికలోనే చదివి 'బలవంతపు సదువులు' అను గేయ నాటికను ప్రదర్శించి ప్రశంసా పాత్రులయ్యారు. దేశ విపత్కథ విని, బంధువర్గము, తలిదండ్రులు ఇచ్చిన నయాపైసలు ప్రోగుచేసి దేశ రక్షణ నిమిత్తం రూ. 5/- లు బి.డి.ఓ. గారికిచ్చి, ఈ పసివారు గ్రామ పెద్దలకు మార్గదర్శకులయ్యారు. వారి జాగృతికి ఈ పత్రికయే కారణమని, ఈ నూతన శీర్షికలతో అది మరింత పెంపొందుతుందని నేడు గాఢంగా విశ్వశిస్తున్నాను.

ఉపాధ్యాయునిగా నేనీ గ్రామములో 6 సం॥ల నుండి పని చేయుచున్నాను. ఈ అరణ్య ప్రాంతంలో లంబాడి, తదితర



జనులు, నిరక్షరాస్యులు, అజ్ఞానులుగ నుండిరి. ఈ సోదర బీద ప్రజానీకమును అక్షరాస్యుల జేసి, జ్ఞానవంతులుగా మార్చ యత్నిస్తున్నాను. ఈ లక్ష్య సాధనలో నాకీ పత్రిక ఎంతగానో సహకరించినది. 4 సం.ల నుండి ఈ పత్రిక పాఠకునిగ నేనెంతయో విజ్ఞానాన్ని విశేషాల్ని సంగ్రహించి ప్రకటించగలిగాను. తద్వారా గ్రామీణుల భావాలు గ్రామంవరకే పరిమితం కాక దూర దూరాలకు విస్తరిల్లినవి. అనతికాలంలోనే ప్రగతిపథంలో వారి ముందడుగు రవళి వినిపిస్తున్నది.

రేడియోవంటి ఆధునిక ప్రచార సాధనములు లేనట్టి గ్రామమున కిట్టి విశిష్టమైన పత్రిక అవసరము ఎంతగానో ఉంది. పొరుగు రాష్ట్రాల ప్రగతిని కొంత తెలుపుచూ, మరిన్ని నూతనాకర్షణలతో సర్వాంగ సుందరముగ ఈ పత్రిక వెలుగొందుచు, వెలువడాలని కాంక్షిస్తున్నాను. దేశ స్వాతంత్ర్యమునకై ప్రాణాలిచ్చిన అమర వీరుల జీవిత గాధలను 'బాలానందం'లో ఇప్పట్టున ప్రచురింపగలిగిన విద్యార్థి లోకము హర్షించగలదు. మేలు చేకూరగలదు.

ఇట్లు
సి. హెచ్. రాజలింగం
ప్రధానోపాధ్యాయుడు
పాపయ్యాపేట, వరంగల్ జిల్లా.

# రచయితలు

శ్రీ కె. వి. యన్. అప్పారావు, కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లా.
శ్రీ శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవి, అశోకారోడ్, న్యూఢిల్లీ.
శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ, సమాచారశాఖల మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైద్రాబాద్.
శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, హైద్రాబాద్.
శ్రీ ఆవంత్స సోమసుందర్, పిఠాపురం, తూ. గోదావరి జిల్లా.
శ్రీ పి. యల్. సంజీవరెడ్డి, లెక్చరర్ : ఆంధ్రయూనివర్సిటీ - వాల్తేరు.
శ్రీ తూమాటి దొణప్ప, లెక్చరర్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు.
డా॥ గోపాలాచారి,
శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, చందమామ బిల్డింగ్స్-మద్రాసు.
మాల్యశ్రీ, జి. టి. యస్. సెంటర్, సామర్లకోట, తూర్పు గోదావరి జిల్లా.
శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, మారుతినగర్, విజయవాడ-4.
శ్రీ యస్. యం. వై. శాస్త్రి,
శ్రీ యస్వీ జోగారావు, లెక్చరర్, ఆంధ్రయూనివర్శిటీ, వాల్తేరు.
శ్రీ గెయిరాల్ కర్మ్,
శ్రీ కె. జానకిరామ్ పట్నాయక్, ఖర్గ్‌పూర్.
శ్రీమతి ఆవుల జయప్రదాదేవి, హిమాయత్‌నగర్, హైద్రాబాద్.
డా॥ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ, నీలోఫర్ హాస్పిటల్, హైద్రాబాద్.
శ్రీ వాసిరాజుప్రకాశం, చిక్కడపల్లి, హైద్రాబాద్.
శ్రీ శివశంకరస్వామి, ఒంగోలు, గుంటూజిల్లా.
శ్రీ వేటూరి ఆనందమూర్తి.

గ్రంథసమీక్ష :
శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు, తెలుగు రీడర్ ; ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్.

# ముఖ్యమంత్రి సందేశం

ప్రియమైన చదువరీ!

కొత్త విద్యా సంవత్సరం ప్రారంభం కావడంతో పాఠశాలల్లో రద్దీ ఎక్కువైంది. అవసరానికి తగినన్ని ఖాళీలు పాఠశాలల్లో లేవనే విమర్శ అప్పుడప్పుడూ తల ఎత్తుతున్నది. పాఠశాలల్లో ప్రవేశం కోరే విద్యార్థులకు ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రవేశం నిరాకరించబడకూడదని గత సంవత్సరం మేము ప్రకటించివున్నాము. ప్రకటించినవిధంగా చేయగలిగామనికూడా మేము సంతోషంగా చెప్పగలుగుతున్నాము. కొంతమందికి తాము కోరిన పాఠశాలల్లో ప్రవేశం లభించలేదంటే అది సహజమే. కొన్ని పాఠశాలలు మిగిలిన వాటికన్నా ఎక్కువ పేరు ప్రతిష్ఠల్ని సంపాదించుకోవడం వలన, సాధారణంగా ప్రజలు అటువైపే మొగ్గుతూ వుంటారు. అందుచేత తాము కోరుకున్న పాఠశాలలోనే ప్రవేశం లభించడం అనేది సాధ్యంకాని విషయం. కాని మొత్తం యీ విషయాన్నంతటినీ పరిశీలించి చూసినప్పుడు, ప్రవేశాన్ని కోరే ప్రతి ఒక్కరికీ ఆ అవకాశం లభిస్తున్నదని మీకే తెలియగలదు.

ఇక, ఇంగ్లీషు మీడియం పాఠశాలలగురించి: ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో క్రింది తరగతి పూర్తిచేసినవారిని ఆ పై తరగతిలోకి మామూలుగా తీసుకుంటున్నారు. తెలుగులోగాని, లేక మరొక ప్రాంతీయ భాషలోగాని ప్రాథమికవిద్యను పూర్తిచేసిన పిల్లలను ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో ప్రవేశపెట్టడానికి ప్రయత్నించేటప్పటికి కొన్ని సమస్యలు తలయెత్తుతున్నాయి. మధ్యలో బోధనాభాషను మార్చుకొనే విద్యార్థులందరకూ పాఠశాలల్లో ప్రవేశాన్ని కల్పించడం అనేదిసాధ్యంకాని విషయం. అలాంటి పరిస్థితుల్లో కూడా, కష్టపడకుండా సులభంగా ఆయా తరగతులకు సరిపడిన మంచి విద్యార్థులను తీసుకోవలసిందని ఆయాప్రధానోపాధ్యాయులను ఆదేశించడం జరిగింది.

చక్కటి ప్రభుత్వానికి దేనికైనా విద్యా సౌకర్యాలను కలిగించడం ప్రాథమిక కర్తవ్యం. అలాంటి విద్యకు మనము న్యాయంగా చాలా ఎక్కువ ప్రాధాన్యతను యిస్తున్నాము. అందుచేతనే యీ విషయాన్ని గూర్చి యింతగా నేను ప్రస్తావిస్తున్నాను.

ఉపాధ్యాయులను గురించి యిక్కడ ఒక విషయం నేను చెప్పవలసివుంది: పెరుగుతూన్న అవసరాల దృష్ట్యా వివిధ స్థాయిల్లో ఉపాధ్యాయులను చేర్చుకొనవలసిన అవసరం వుంది. అందుచేత శిక్షణపొందని ఉపాధ్యాయులు చాలామంది కూడా ఉద్యోగాల్ని పొందగలరు. కొంతమందిని అత్యవసర సమయాలలో తీసుకుంటున్నారు. కాని వీరిలో చాలామంది, కొంత కాలంపాటు అస్థిర పరిస్థితిని ఎదుర్కోవలసివస్తోంది. వీరికి సంబంధించిన సాధక బాధకాల్ని తరచుగా పత్రికలు ఘోషపెడుతూవుంటాయి. దానికి సంబంధించిన అధికారులవద్దకు రాయబారాలు కూడా వెళ్తూవుంటాయి. ఉదాహరణకు, కొన్నిరకాలకు చెందిన పాఠశాలల్లో విద్యా సంవత్సరం ప్రారంభంలో శిక్షణ పొందని ఉపాధ్యాయులను చేర్చుకుని, ఆ సంవత్సరాంతంలో వారిని తీసివేస్తూ వుంటారు. అందువల్ల వారికి సెలవుకాలానికి జీతం లభ్యంకాదు. ఈ రకపు బాధలను నివారించడానికై అన్నివిధాలా ప్రభుత్వానికి సలహాలు యివ్వబడ్డాయి. కాని తరచుగా అవతలి వ్యక్తుల సాధక బాధకాల్ని ఆలోచించకుండా ఒక వైపునుండే చూచి యిచ్చే సలహాలు యివి.

ఈ ఉపాధ్యాయులకు భద్రతను చేకూర్చడం ద్వారా, పని పరిస్థితులను మెరుగుపరచడం మొదలయిన పనుల ద్వారా ప్రభుత్వం ఉపాధ్యాయుల పరిస్థితులను అభివృద్ధి పరచడానికి ఎంతగానో ఆతృత పడుతున్నది. ఈ పనిని, విద్యాసంస్థల సాధనసంపత్తినీ, ఉపాధ్యాయుల అవసరాలనూ అభిరుచులనూ పూర్తిగా అర్థంచేసుకుని క్రమక్రమంగా చేయవలసి వుంది.

ఇందుకు సంబంధించిన ప్రతి ఒక్కరినీ — ఉపాధ్యాయులను, నిర్వాహకులను–విశాలదృక్పథంతో, జాతీయభావంతో చూసినప్పుడే మన విద్యావిధానం విజయవంతం కాగలదు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం విషయాలను చర్చించేందుకు కమిటీని వేయడంపై కొన్ని ఊహాగానాలు తలయెత్తుతూ వున్నాయి. ఇటీవల కొంతమంది పాత్రికేయులు యీ విషయంపై నన్ను ప్రశ్నించారు కూడా.

ప్రభుత్వం ఎట్టి విచారణకై ఆదేశించలేదు. కాని విశ్వ విద్యాలయాలను గూర్చి ప్రభుత్వానికి కొన్ని

బాధ్యతలు ఉండడంవల్ల, అటువంటి పబ్లిక్ సంస్థల పరిపాలనల్లో అవకతవకలు వున్నట్టు ఆరోపించబడినప్పుడు, ప్రభుత్వం ఆ విషయాలకు సంబంధించిన పరిస్థితులను పూర్తిగా తెలుసుకోవలసివుంటుంది. వాస్తవ పరిస్థితులను తెలుసుకోడానికనే, విశ్వవిద్యాలయం అధికార్లను కలుసుకుని అవసరమైన సమాచారాన్ని సేకరించడానికిగాను యిరువురు అధికార్లను నియమించడం జరిగింది.

ఈ చిన్న సంఘటనకు లేనిపోని ప్రత్యేకతను కల్పించబూనుకోవడం శోచనీయమైన విషయం.

ఈ కమిటీకూడా ఉపసంహరించుకోబడింది. ఆరోపించబడిన అవకతవకలను పరిశీలించడానికిగాను విశ్వ విద్యాలయం సిండికేట్ స్వంతంగా ఒక కమిటీని ఏర్పరచి, రిపోర్టు ప్రతిని ఒక దానిని తనకు పంపమని ప్రభుత్వం సూచించింది.

పోచంపాడు, శ్రీశైలం ప్రాజెక్టులను ఆమోదించవలసిందిగా భారత ప్రభుత్వానికి నేను కొంతకాలంగా విజ్ఞప్తి చేస్తూవున్నాను. కృష్ణానదిపై శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టు నాగార్జున సాగర్ కలిసి ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి అభివృద్ధి చరిత్రలో ఒక నూతన ఘట్టాన్ని ప్రారంభిస్తాయి. రాష్ట్రం మధ్యభాగంలో వున్న ఈ ప్రాజెక్టువల్ల రాయలసీమకు తెలంగాణాకు, కోస్తాజిల్లాలకు తగు విధంగా లాభిస్తుంది. శ్రీశైలం విద్యుత్కేంద్రంలో మొదట ఒక్కొక్కటి 1,10,000 కి.వా. శక్తిగల నాలుగు యూనిట్లను నెలకొల్పుతారు. ఇంతేశక్తిగల మరో మూడు యూనిట్లను ఆ తరువాత నెలకొల్పడానికి అవకాశం కల్పిస్తారు. ఈ ప్రాజెక్టు పని ఆరంభమైంది. దీనికి ఈ సంవత్సరానికి రూ. 1.5 కోట్లు కేటాయించాము. ఈ విధంగా ఇక్కడ ప్రాచీన ఆలయానికి తోడుగా ఒక నూతన మందిరం అవతరిస్తుంది.

కొత్తగూడెం థర్మల్ విద్యుత్కేంద్రం కొరకు సుమారు పది కోట్ల రూపాయిల ఋణం పొందే విషయంలో మనకూ, అంతర్జాతీయ అభివృద్ధి సంఘాని (ఐ.డి.ఏ)కీ మధ్య ఒక ఒప్పందం కుదిరింది. ఇది అత్యంత ప్రాముఖ్యతగల సంతోష వార్త. ఈ పథకాన్ని మన ప్రభుత్వం 1961 వ సంవత్సరంలో మంజూరు చేసింది. మొదట్లో స్వతంత్ర ప్రాజెక్టుగా స్థాపించదలిచిన కిన్నెరసాని డామ్ ప్రాజెక్టు ఇప్పుడు కొత్తగూడెం థర్మల్ కేంద్రంలో భాగంగా రూపొందించబడుతుంది. ఈ ప్రాజెక్టు మొత్తానికి సుమారు రూ. 19 కోట్లు ఖర్చవుతుంది. అంతర్జాతీయ అభివృద్ధి సంఘం ఇచ్చే 20 మిలియన్ డాలర్ల అప్పును అర్ధసంవత్సర వాయిదాలలో తిరిగి చెల్లిస్తారు. మొదటిదఫా చెల్లింపు 1973 డిశంబరులో ఆరంభమవుతుంది. విద్యుత్కేంద్రం తొలిదశ పూర్తయాక 120 మె.వా.ల విద్యుదుత్పాదన జరుగుతుంది. 1965–66 వ సంవత్సరాంతానికి బహుశా ఇది వినియోగంలోకి రావచ్చు. ఋణం తిరిగి చెల్లింపు 1973 వ సంవత్సరంలో ఆరంభమై 2013 వ సంవత్సరం వరకు కొనసాగడం ఆసక్తికరమైన విషయం. మనం పొందే ప్రయోజనాలకు మన తరువాత వచ్చే తరాలవారు కొంత ఖర్చును భరించవలసి రావడానికి ఇదో దృష్టాంతరంగా వుంటుంది. కాగా, భావి తరాలవారి సౌఖ్యానికై కష్టనష్టాలకుఓర్చి పాటుపడేది ఇప్పటి తరమేనని మనం సాధారణంగా గర్వంగా చెప్పుకునే విషయాన్ని ఇది సరికాదని వెల్లడిస్తుంది. ఏమైనప్పటికీ ఇక్కడ ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి మున్ముందు అభివృద్ధి రంగంలో ఎంతో ప్రాముఖ్యత వహిస్తుంది, ఋణం తిరిగి చెల్లింపు జరిగేప్పటికి దీనివల్ల ప్రయోజనాలు చాలావరకు సిద్ధిస్తాయి. కష్టనష్టాలకు ఓర్చి పాటుబడటం లేదా సంతోషపూర్వంగా ఇటువంటి భారం వహించడం ప్రతి తరం యొక్క విధాయకం. తలిదండ్రులు తమ పిల్లలను సాకడం మాత్రమే కాకుండా ఆ పిల్లలు పెరిగి పెద్దయ్యాక వృద్ధులైన తమ తలిదండ్రులను పోషిస్తారుకూడా. ఈవిధంగా సమాజం పరస్పరం పరిపోషితమవుతుంది. ఈవిధంగా పురోగతి సాగుతుంది. కేవలం మనకొరకేగాక, సమాజం మొత్తానికీ, ప్రస్తుత తరానికేగాక భావి తరాల వారికీ ప్రయోజనాలు కలగడానికి ఏదైనా చేయడంలో ఆనందం వుంటుంది. కొత్త ప్రాజెక్టు మంజూరైనా, ఏదైనా ప్రాజెక్టుకు శంకుస్థాపన జరిగినా నాకు ఇలాంటి అనుభూతి కలుగుతూవుంటుంది.

జైహింద్!

భవదీయుడు

నీలం సంజీవరెడ్డి

# రసాభాసము

"ఆత్మారామ్"

అఖిలాచలోత్తుంగమైన హిమాచలం
బెవ్వాని శిరమున నెసఁగు ముకుట
మఖిల సరిత్పూతమైన భాగీరథి
యెవ్వాని గళమున నెసఁగుహార
మఖిల వాఙ్మయ సారమనఁదగు నుపనిష
ద్వాక్యాళి యెవ్వని బాలవాణి
అఖిల ధర్మోత్కృష్టమగు నహింసాధర్మ
మెవ్వాని సహజ ప్రవృత్తిచూడ

నతఁడు వొగడొందు భువికి శోభాకరుండు
సప్తసింధు జలాప్లుత శస్తతనుఁడు
వారినిధివీచికాధౌత పాదతలుఁడు
సకల వినుతుఁడు భరతరాష్ట్ర ప్రవరుఁడు॥

తనకున్న దానితోఁ దనివి చెందుచుఁగాని
పరులసొమ్మున కాశపడుట లేదు
తనకాళ్ళపైఁదాను దగనిల్వనేగాని
పరులపై నాధార పడుటలేదు
తన విధానము స్వతంత్రముగఁ బూనుచుఁగాని
అన్యానుకరణాశయంబులేదు
తన యభివృద్ధికై పని చేయుచుఁగాని
ఒరుల నాశముగోరు నూహలేదు

కనుకనే సర్వదేశాళి ఘనతనిచ్చి
గౌరవించుచు నుండునీ భారతాఖ్యు
ఇతని సఖ్యముకోరి యెంతేని ధనము
నిత్తుమని వత్తురెంతయుఁ బొత్తుమీఱ॥

కాని నిర్లిప్తుఁడాతండు కాంచనమున
కాసపడి యన్యపక్షంబు నాశ్రయింపఁ
డతఁడు కావలెనన్న గృహంబునందె
గురియుఁ గాంచన వర్షంబు గురుతరముగ॥

సర్వదేశాళి విజ్ఞాన శాస్త్రమహిమ
సైన్యశక్తికి జతగూర్చి సర్వనాశ
పథమునన్ బోవ నీతఁడా పథమువీడి
దేశ సౌభాగ్య వృద్ధికే దీక్షపూనె॥

సత్యము, శాంతి, సర్వజన
సౌఖ్యము మున్నగు సద్గుణంబులన్
నిత్యము పూనియుంట గని
నిక్కము పాత్రుఁడటంచు భూమిపున్
స్తుత్యముగాఁ దమంతటనె
తోరపుదానము లీయరాఁగఁదా
నత్యయమైన గూడఁగొన
కప్పుగ మాత్రమె స్వీకరించెడిన్॥

ఈ విధమౌ నుదాత్తత వ
హించుటచేతను సాటివారిలో
పావనుఁడీతఁడన్న ప్రథ
పర్వెఁ గనుంగొని యెల్లవారలున్
భావమునందు సంతసిలి -
బాపురె! యియ్యది శ్రేష్ఠమార్గ మీ
త్రోవనె యేగుటొప్పునని
తోడనె నేతగ గౌరవింపఁగన్॥

ఇరుగుపొరు గిద్దఱకు మాత్ర మిద్ధిహృదయ
శల్యమయ్యెను; బరుల సౌశీల్యముగని
అనుకరింపఁగ సజ్జనులాత్మ గోరఁ
జెఱుప నెంతురుగాదె దుశ్శీలు రెపుడు!॥

భారత ప్రవరస్ఫుట ఫాలసీమ
శ్రీకరంబగు రమ్యకాశ్మీర రేఖ
చెఱిపివేయంగ జతనంబుసేయు నెపుడుఁ
బట్టుదలతోడ వాయవ్య భాగవర్తి॥

శశి కిరీటునివలె హిమశైల శిఖర
మకుటుఁడగు భారతశ్రేష్ఠ మౌళిమకుట
మపహరింపఁగ జతనంబు నెపుడుసేయుఁ
బట్టుదలతోడ నీశాన్య భాగవర్తి ॥

గాంధి ఋషిశిష్యుఁడై దాస్యబంధమూడ్చి
సత్యము నహింసయున్ బ్రహ్మచర్యమాది
యైన నిష్ఠలఁ జరియించు నంట వీని
దీక్ష నిల్చునె మా [1]వరూధినికి నెదుట ॥

ఇట్టి దీక్ష విధిన్ వహియించియున్న
యా త్రివిష్టప[2] వాసుల నశ్రమమున
లోఁగొనిన జాణగద మావరూధిని యిఁక
భారత ప్రవరున్ గెల్వ భారమౌనె ॥

అనుచుఁబంపె వరూధిని నాతఁడదియుఁ
దక్కుచున్ తారుచున్ భారత ప్రవరుని
జేరి కన్గొనె విస్మయస్ఫారమైన
నేత్రములతోడఁ దన్మహనీయమూర్తి ॥

ఆభిజాత్యోన్నతమైన శీర్షముతోడ
రీవి నెప్పుడుఁ బ్రకటించువాని
సుప్రసన్నంబగు చూపుతో నెల్లర
మనముల నమృతంబు నినుచువాని
విశదవాక్కులతోడ విశ్వశాంత్యుపదేశ
మంత్రాతురావృత్తి మఱగువాని
విజ్ఞానశాస్త్రంపు వినియోగ ముత్పత్తి
వృద్ధియందే సమర్పించువాని
అణువినిర్మిత మారణాస్త్రాళి నడుమ
నిర్భయంబుగ నిలిచి తన్నిరసనంబు
సేయు భారత ప్రవరు నజేయమూర్తిఁ
దనువు పులకింప నా వరూధిని గనుగొని ॥

ఈతని లోఁగొనఁగల్గిన
భూతల మందెవ్వరీడు మొనయఁగ నాకున్
నీతియు గీతియు నెంచినఁ
జేతో ముదమెట్టులబ్బుఁ జెనకెద వీనిన్

అనుచు నాతని దరిఁజేరి యతిశయమగు
ప్రీతి నెఱపుచుఁ బలికె నీరీతిగాఁగ

1. వరూధిని = సేన 2. త్రివిష్టపము = టిబెట్టు.

"సుందరాంగ ! నీమీఁద నాడెందమందుఁ
బ్రేమ జనియించె నినుఁగౌగిలింపనిమ్ము ॥

ఒక్క పరినాదు కౌగిట నుంటివేని
ఇంక విడవలెనను కోర్కె యేలకలుగు !
నాకు నీమీద వలపెన్నొ నాళ్ళనుండి
కలదు నేటికి నాయవకాశ మబ్బె"

అంత నా భారతశ్రేష్ఠుఁడనియె నిట్లు
"ఓ వరూధిని ! సంతోష మొదవె నీదు
ప్రేమ మయమైన వాక్కులు వినుటవలనఁ
గాని నను గౌగలించెదు కాంక్షవీడు ॥

ప్రేమకును, కామమునకును భేదమెంచి
ప్రేమ పెంచుము, కామంబు విడువు మెపుడుఁ
బ్రేమ యిచ్చును, కామంబు స్వీకరించు
నిదియె యీ రెంటికిని భేదమెంచిచూడు ॥

సర్వజనులను బ్రేమించ సహజ గుణము
వెన్నతో నేర్చియుండుట నిన్నుఁగూడఁ
బ్రేమతోఁ జూతునంతతోఁ దృప్తినొందు
మనుచితంబగు కోర్కెల నాపుహృదిని"

అనుచు భర్త్సన చేయఁగ నాగకంత
న్యాయమే యెంచ నీమాట లాడతు భువి
మాతృమోహనరేఖ ను మఱల మఱలఁ
జూపి కాదనుటొప్పునే సుందరాంగ !

అనుచునా మాట సందర్భమునఁ బరాకు
చెందియున్నట్టి భారత శ్రేష్ఠుమీదఁ
బడియెఁ జీనావరూధిని ప్రక్కవాటు
గాఁగ నతఁ డుల్కిపాటునఁ గలఁత చెంద ॥

పిదప నతఁ డంతలోనె తెప్పిరిలి దాని
నొక్కత్రోపున వెనుకకు నొక్కివైచె
త్రోపువడి వెన్క కడుగిడి తోరమైన
పరిభవక్లేశమున నది మఱుఁగుచుండె ॥

ఇటు రసాభాసమైనను నింకను నది
కోర్కె వీడక తిర్గి పైకొనఁగఁగోరు
విఫల కామంబు క్రోధాగ్ని వృద్ధిహేతు
వైన ధైర్య జలంబుండ నదటదేల ?






వాలెంటీనా సెగుల్లా తెరిష్కోవా, వలెరీ హాక్ బైకొవిస్కీ అనే యువతీ యువకు లిరువురూ విజయవంతంగా పూర్తి చేసిన అంతరిక్షయానంతో రష్యా యీ రంగంలో మరో రెండు కొత్త ప్రమాణాలను స్థాపించింది.

బైకొవిస్కీ జూన్ 14వ తేదీ మధ్యాహ్నం ప్రారంభించి 82 సార్లు భూమిచుట్టూ ప్రదక్షిణలు చేసి, 4 రోజుల 23 గంటల 54 నిమిషాల తర్వాత క్రిందికి చేరుకున్నాడు. ఈ కాలం, 1962 ఆగస్టులో ఆండ్రీనా నికోలావ్ చేసిన 3 రోజుల 22 గంటల 22 నిమిషాలకు యించుమించు ఒకరోజు అధికంగావుంది. బైకొవిస్కీ దాదాపు 3½ మిలియను కిలోమీటర్ల దూరం ప్రయాణం చేశారు.

ప్రప్రథమ అంతరిక్ష యాత్రికురాలు వాలెంటీనా తెరిష్కోవా అంతరిక్షంలో 22 గంటల 57 నిమిషాలపాటు విహరించి, 49 సార్లు భూమిచుట్టూ ప్రదక్షిణ చేసింది. మొత్తం యీమె ప్రయాణం చేసిన దూరం దాదాపు 2 మిలియను కిలోమీటర్లు వుంటుంది. ఈ అంతరిక్ష యాత్రికజంటకు సన్నిహితంగా వచ్చిన అమెరికా వ్యోమగామి మేజర్ లేరాయ్ గార్డెన్ కూపర్. ఈయన మే లో 22 సార్లు భూప్రదక్షిణ చేశాడు. అంతరిక్షంలో గడిపిన కాలం 34 గంటల 20 నిమిషాలు.

ఏ దేశం దీన్ని సాధించిందీ అన్న ప్రసక్తి లేకుండా యీ విజయానికి మానవాళి అంతా జోహార్లు అర్పిస్తుందనడంలో సందేహంలేదు. ప్రకృతి మాత కేపటలిజానికీ, కమ్యూనిజానికీ అతీతమైనది. నిజమైన తల్లివలె తన రహస్యాల నన్నింటినీ తన సంతానానికి ఒకే తీరున వెల్లడిచేస్తుంది. తన సంతానంవారి విజ్ఞానాన్ని తమస్వంత జాతినే నాశనం చేసుకోవడానికి ఉపయోగించకుండా, తమతమ ప్రతిభల్ని వెల్లడి చేసుకోవాలని ఆ తల్లి ఆశిస్తుంది. ఏసిద్ధాంతమూయుద్ధాన్నీ, నాశనాన్ని కోరదు. ఒకవేళ కోరితే అదినిజంగా ఏ దుఃఖవాదమోతప్ప సిద్ధాంతమనిపించుకోదు. ఈ సాహస కృత్యాలు కేవలం సాహసోపేతమైనవేగాకుండా అభ్యుదయానికి మార్గదర్శకాలుకూడా.

## రాష్ట్రపతి పర్యటన

రాష్ట్రపతి రాధాకృష్ణన్‌కు, యిటీవలి అమెరికా, ఇంగ్లండు పర్యటనల్లో ఎల్లెడలా అపూర్వ స్వాగత సత్కారాలు లభించాయి. ఆయన ప్రెసిడెంటు కెనడీని కలుసుకున్నారు. సంభాషణల అనంతరం యిరువురూ, యిరు దేశాల మధ్య సుహృద్భావ సంబంధ బాంధవ్యాల పెరుగుదలనూ ఆశిస్తూ ఒక సంయుక్త ప్రకటనను చేశారు.

ఇండియాకు భారీ ఎత్తున ఆయుధ సహాయాన్ని యివ్వడం ఉచితమా కాదా అనే విషయంపై అమెరికాలో అక్కడక్కడ తలయెత్తిన సందేహాలను రాష్ట్రపతి పర్యటన నివృత్తి చేసింది. ఆగ్నేయాసియాలో కమ్యూనిస్టు చైనావల్ల శాంతికి వాటిల్లుతున్న ఉపద్రవాన్ని అధికారులు, ప్రజలు చక్కగా గుర్తించారు. అమెరికాలోని పత్రికలు, ప్రజలు రాష్ట్రపతికి అఖండ స్వాగతంయివ్వడం జరిగింది. అసంఖ్యాకమైన గౌరవసత్కారాలు రాష్ట్రపతికిలభించాయి.

ఇంగ్లండు, భారతదేశాల మధ్య చిరకాలంగావుంటూవచ్చిన స్నేహపాశాలను గురించి ప్రస్తావిస్తూ భవిష్యత్తు యిందుకు సాక్షికావాలని తాను ఆశిస్తున్నానని రాష్ట్రపతి తమ ఇంగ్లండు పర్యటనలో వక్కాణించారు. కామన్వెల్తు వ్యవహారాలలోనూ, ప్రపంచ వ్యవహారాలలోనూ భారతదేశం నిర్వహిస్తున్న పాత్రను బ్రిటిష్‌రాణి ప్రశంసించింది. ప్రతిభా దురంధరుల కిచ్చే గౌరవ సభ్యత్వం రాష్ట్రపతికి యివ్వబడింది. ఇంగ్లండులో జోడ్రెల్ బేంకు అబ్జర్వేటరీలాంటి ప్రముఖ పరిశోధనా కేంద్రాలను కూడా రాష్ట్రపతి సందర్శించారు.

సందర్శించిన దేశాలనుండి వెంటనే సహాయంగా అందే మొత్తాన్ని బట్టి యీ పర్యటనలకు విలువ నిచ్చే దృక్పథం కొంత మందిలో వుంది. ఇదే నిజంగా మనం చేయాల్సిన పని. ప్రజా ప్రభుత్వం బాగా పరిణతచెందిన దేశాలనుండి భారీయెత్తున ఆయుధ సహాయాన్ని పొందేప్పుడు మనం అనేక సాధక బాధకాల్ని ఎదుర్కోవలసి వుంటుంది. ఒక్క విషయం—గతాన్ని ఒక్క రాత్రిలో యెప్పుడూ తుడిచివేయ లేము. పాకిస్తాను లాంటి అడ్డుగోడల్ని తీసివేయ డానికి కాలము, ఓపిక అవసరం.

ఏమయినా యిలాంటి సమస్యలు ఎన్ని వున్నప్పటికీ మన రాష్ట్రపతి సంపాదించిన అపారమైన పరపతి, చైనాను ఎదుర్కోవడానికై అవసరమయ్యే ఆయుధ సహాయాన్ని ఆయాదేశాలనుండి పొందడానికి అడ్డుగోడలుగా నిలచిన ప్రతిబంధకాలను కొంతవరకూ తగ్గించ గలిగింది.

## అణ్వస్త్ర పరీక్షల నిషేధం

మాస్కోలో అమెరికా, ఇంగ్లండు, రష్యాల మధ్య అధికారస్థాయిలో చర్చలు జరగగలవని ప్రెసిడెంట్ కెనడీ చేసిన ప్రకటనవల్ల అణ్వస్త్ర పరీక్షల నిషేధంపై తిరిగి ఆశ తలయెత్తుతున్నది. అధికారులు అణ్వస్త్ర నిషేధంపై ఒక ఒడంబడికకు రావడానికి గల అవకాశాలను పరిశీలిస్తారు. ఈ సంప్రదింపులు గాని జయప్రదమైతే ఆపైని పైస్థాయిలో సంప్రదింపులు జరగవచ్చును. అవతలి దేశం అణ్వస్త్ర పరీక్షలను ప్రారంభించే వరకూ తాము ఎట్టి అణ్వస్త్ర పరీక్షలనూ చేయబోమని ప్రెసిడెంటు కెనడీ ప్రకటించారు. (ఇంగ్లండు కూడా ఇలానే ప్రకటించింది). ఆయన తన ప్రజల్ని శీతల యుద్ధాన్ని గురించి ఒకకొత్త దృక్పథాన్ని యేర్పరచుకోవాలని హెచ్చరించారు. మారుతూన్న ప్రపంచంతోపాటు వాళ్ళ దృక్పథాలు కూడా మారకుండా అలానే వుండిపోతే అవి బూజుపట్టి, వారు ఒకకొత్త ప్రపంచ సంగ్రామంలో చిక్కుకుని, దాని భయంకర పరిణామాలకు లోనుకావలసి వస్తుందని తనదేశ ప్రజల్ని ప్రెసిడెంట్ కెన్నడీ హెచ్చరించారు. మాస్కో, లండన్‌లలో కూడా ఇంచుమించు యిటువంటి హెచ్చరికలే చేయబడ్డాయి. ఎవరిల్ హారిమన్ అమెరికాకు, లార్డ్ హైల్‌షమ్ ఇంగ్లండుకు ఈ చర్చలలో ప్రాతినిధ్యం వహిస్తారు.

రష్యా ప్రధాని కృశ్చేవ్, అమెరికా అధ్యక్షుని ప్రకటన సద్భావాన్ని కలిగించిందని, 'అంతర్జాతీయ పరిస్థితుల వాస్తవ రూపాన్ని అంచనా వేయడానికి యిదొక ముందడుగు' అని అభివ్యక్తీకరించి ఆహ్వానించారు. కాని తూర్పు పశ్చిమ దేశాలమధ్య వున్న జర్మనీ, క్యూబా తగాదాలు అణ్వస్త్ర పరీక్ష సమస్యకు సన్నిహిత సంబంధం కలిగి వుండడంచేత, ఆ సమస్యలుకూడా దీనితోపాటుపరిష్కరింపబడాలని కోరారు.

జెనీవాలోని నిరాయుధీకరణ చర్చలలో పాల్గొనే దేశాలన్నీ కూడా యీ ప్రకటనకు హర్షించాయి.

అత్యవసర పరిస్థితులలో నేరుగా రెండుదేశాల అధికారులూ మాట్లాడుకోవడానికి వీలుగా వాషింగ్‌టన్, మాస్కోలమధ్య యేర్పాటు చేయబడే 'వార్తా సంబంధాలు' అణ్వస్త్ర మూలక విధ్వంసకత్వాన్ని తప్పించడానికి చేసే ప్రయత్నాలలో మరో ముందడుగు అని చెప్పవలసివుంది.

పొరపాటునగాని, తప్పుడు అంచనాలవల్లగాని అణ్వస్త్రయుద్ధం యే క్షణంలోనన్నా సంభవించవచ్చుననేది కొంత కాలంగా స్పష్టపడిన సంగతే. గతంలో ఎప్పుడూ జరగనన్నా జరగని యీ పొరపాటే గాని జరగితే "అయ్యో" అనడానికన్నా మిగలకుండా అంతా తుడుచుపెట్టుకపోతారు. పొరపాటువల్ల సర్వం నాశనం కావడాన్ని ప్రపంచం ఎంతమాత్రమూ హర్షించదు. అందువల్ల అణ్వస్త్రాన్ని కలిగిన దేశాల అధినేతలు ఒకరితో ఒకరు సంప్రదించుకుని అణ్వస్త్రాలతో యీ ప్రపంచాన్ని కాల్చేద్దామనే నిర్ణయానికి వస్తేనే తప్ప యీ పొరపాటు జరిగే అవకాశం లేదు. ఈ 'వార్తా సంబంధం' కనీసం అంతమాత్రమైనా ఉపయోగిస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

### ప్రపంచ ఆహారసంస్థ

ప్రపంచ ఆహారసంస్థ గత నెలలో వాషింగ్‌టన్‌లో సమావేశమయింది. ఈ సమావేశంలో యించుమించు 100 దేశాలకు చెందిన ప్రతినిధులు పాల్గొన్నారు. ఆకలి సమస్యను ఎదుర్కోవడానికి వీలయిన మార్గాలను అన్వేషించడం యీ సమావేశం ముఖ్యోద్దేశం. భారత అమెరికా అధ్యక్షులు యిరువురూ మహాసభను ఉద్దేశిస్తూ చేసిన ప్రసంగాలలో యీ సమస్యను వెంటనే పరిష్కరించవలసిన అవసరాల్ని గురించి నొక్కి వక్కాణించారు. ఆహార వ్యవసాయ సంస్థ డైరెక్టరు జనరల్ శ్రీ బి. ఆర్. సేన్ ప్రపంచంలో సగంమంది ఆకలితో బాధ పడుతున్నారని అంచనా వేశారు. పంట ఎక్కువైతే ధరలు పడిపోతాయని ఎక్కువ పంటను పండించకుండా వుండడానికి కొన్ని కొన్ని దేశాలలో రైతులకు ప్రభుత్వాలు సబ్సిడీలను యిస్తుంటాయి. మరికొన్ని దేశాలలో వేలకొలది ఎకరాలు నీటివనరుల సౌకర్యం లేకా, ఆధునిక వ్యవసాయ పద్ధతులు తెలియకా బీడుల్లా వదిలి వేయబడుతున్నాయి. ఒక దేశానికి ఎక్కువయిన ఆహారధాన్యాలను అవసరమయిన మరొక దేశానికి అందజేసే పద్ధతి ఆచరణలోకి రావాలి. దానికితోడు మితిమీరిపెరిగిపోతున్న జనాభాను అరికట్టడానికి ఆధునిక పద్ధతులను ఆలోచించాలి. ఈ విషయంలో ఆహార వ్యవసాయసంస్థ కృషిని భారతదేశం ఆసక్తితో పరిశీలిస్తున్నది.

ఆకలి సమస్య యుద్ధాన్ని నడిపిస్తుందని ఒకప్పుడు ఒక ప్రతీతివుండేది. లుబ్ధత్వంవల్ల తిరుగుబాటు రాగలదని మరికొంతమంది అభిప్రాయం. ఈ నమ్మకాలు ఎంతకాలం వుంటాయో అంతవరకూ ఆకలి, అశుభ్రత పైస్థాయిలోనే వుంటాయి. దీనిపై ప్రజాస్వామ్యం పేరిట, ప్రజానీకం పేరిట మరికొన్ని దోపిడీ విధానాలు అమలు జరుగుతాయి. కాని యీ అభిప్రాయాలు పాతబడి పోయాయి. ఆకలి సమస్యతో ప్రజాస్వామ్యాన్ని గాని, సాంఘిక పరిణామాలనుగాని తేవడం అసాధ్యం. ఆకలిగొన్న వ్యక్తికి తెలిసినదల్లా 'మృత్యు మార్గ'మే. అటువంటి వ్యక్తిని తన 'జీవన విధానా'న్ని ఎన్నుకొమ్మనడం అర్థ రహితం.

### వర్ణ విచక్షణ

'వంద సంవత్సరాల క్రిందట అబ్రహాం లింకన్ బానిసలకు స్వేచ్ఛను ప్రసాదించినా యింతవరకూ, వారి సంతానం విముక్తిని పొందనే లేదు' అని ప్రెసిడెంట్ కెన్నడీ గత నెలలో ప్రకటించారు. నీగ్రోలకు ఒకకొత్త జీవితాన్ని ప్రసాదించేందుకు కాంగ్రెసు చేత చట్టాన్ని చేయించడానికి తన ప్రతిష్ఠను వుపయోగిస్తానని ఆయన అన్నారు. జీవితపు అన్ని మార్గాలలోనూ వారికి సమానత్వాన్ని యివ్వడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తానన్నారు. స్పర్థలను మరిచి పొమ్మని, వాస్తవాన్ని గుర్తించమని ఆయన తన ప్రజలను కోరారు. ఈ ప్రకటనతో

అమెరికాలో జాతి విచక్షణా నిర్మూలనోద్యమంలో ఒక కొత్తదశ అరంభమైంది.

ఇంతవరకూ దేశంలో వివిధ ప్రాంతాలలో తెల్లవారికి మాత్రమే ప్రత్యేకించబడిన 'హోటళ్ళు' సినిమా హాలులు, చిల్లర దుకాణాలు, విద్యాసంస్థవంటి స్థలాలు స్వచ్ఛందంగా నీగ్రోలకుకూడా ప్రవేశానుమతినిస్తున్నాయి. కాని అలబామాగవర్నరు అలబామా విశ్వవిద్యాలయంలో నమోదయిన యిద్దరు నీగ్రో విద్యార్థుల్ని అందులో ప్రవేశించడానికి అనుమతి నిరాకరించి అధ్యక్షుని ఆదేశాన్నికూడా నిర్లక్ష్యం చేయబోయాడుగాని ఆ ప్రయత్నం సాగలేదు. ఇంతలో నీగ్రో సమైక్య నాయకుడు మెడ్గర్ ఎవర్స్‌ను ఎవరో గుర్తుతెలియని ప్రత్యర్థులు మిసిసిపీకి చెందిన జాక్‌సన్‌లో కాల్చి చంపివేశారు.

ఆ వెంటనే శాంతిని ప్రతిష్ఠించేందుకు అమెరికా అధ్యక్షుడు ప్రదర్శించిన ధైర్యానికి అంతా అభినందించారు.

## సిద్ధాంత విభేదాలు

రష్యా కమ్యూనిస్టుపార్టీ జూన్ 21న సమావేశమై రష్యాసిద్ధాంతాలమీద చైనా చేసిన దండయాత్రను 'అర్థంలేని విమర్శగా, దూషణగా' అభివ్యక్తీకరించింది. ఇరువర్గాల సిద్ధాంతవేత్తల సంభాషణలలో రష్యావాదాన్ని సమర్థించడానికి నిశ్చయించుకుంది.

ఈ అంశాలు వెలువడకపూర్వమే యీ సంప్రదింపులు ప్రారంభమై కొంతవరకూ సాగాయి. ఫలితమేమైనప్పటికీ, యీ యిరువురిదృష్టిలోని విభేదాలకు కారణం మూలసూత్రాలకు సంబంధించినదేననిపిస్తుంది. ఆశకు నిరాశకు, బాధ్యతకు సాహసానికి ఎంత అంతరమున్నదో చైనా దృక్పథానికి రష్యా దృక్పథానికి అంత భేదమున్నది.

ఈ విభేదాలు యింతలో సమసిపోయే అవకాశం లేదుగాని, వున్నా యీ యిరుదేశాల దృక్పథాలూ అధికారయుతంగా, స్నేహపూర్వకంగా పరిష్కరించబడితేనేతప్ప లేకపోతే అంతవరకూ యివిభిన్న భిన్న సిద్ధాంతాలుగానే వుండిపోతాయి. ఈ సమస్య ఒక్క కమ్యూనిజానికి మాత్రమే పరిమితమని అనుకోవడానికి వీలులేదు. మొత్తం మానవాళికంతకూ సన్నిహితంగా సంబంధించిన సమస్యయిది. వర్గపోరాటానికి సంబంధించిన సనాతన సిద్ధాంతాలూ, పరిమిత బాధ్యతలేని ప్రయివేటు వ్యాపార సిద్ధాంతాలూ పారిశ్రామిక విప్లవం మార్క్సు కమ్యూనిస్టు మేనిఫెస్టో నాటికీ యిప్పటికీ ఎన్నో మార్పులు చెందాయి. సనాతన సిద్ధాంతాల్ని ఏ మార్పులూ చేయకుండా అలాగే వుంచివేస్తే త్వరలోనే యీ ప్రపంచం కసాయివాటికగా తయారుకాగలదు.

ఈ విషయాన్ని దృష్టిలోవుంచుకుని రష్యా ప్రధాని, అమెరికా అధ్యక్షుడు అణ్వస్త్ర నిషేధం, యితర విషయాలపై సంభాషణలను ప్రారంభించవలసివుంటుంది. కేవలం బూజుపట్టిన సనాతన సిద్ధాంతాలపై ప్రయోగాలు కారణంగా విధ్వంసానికి గురికావలసిన అవసరంలేదని మానవాళికి నమ్మకం కలిగిస్తే మానవకోటి కృతజ్ఞత చూపుకుని నిశ్చింతగా వుండగలదు.

## చైనా బెడద

నిస్సైనిక మండలంలో చైనావారు 26 పౌరగస్తీకేంద్రాలను నెలకొల్పినవిషయాన్ని గతమాసంలో ప్రధానమంత్రి పత్రికా ప్రతినిధుల సమావేశంలో ధ్రువపరిచారు. వీటిలో లఢక్ రంగంలో ఆరుకేంద్రాలు భారత సరిహద్దులోపల వున్నాయనీ, ఇలా పౌరగస్తీ కేంద్రాలను నెలకొల్పడం, పమిషి కేంద్రాలను మాత్రమే స్థాపించడాన్ని నిర్దేశించేకొలంబో రాజ్యాల ప్రతిపాదనలను ఉల్లంఘించడమేనని ఆయన అన్నారు. చైనావారు కొలంబో రాజ్యాల ప్రతిపాదనలను ఏకమొత్తంగా ఆమోదించే పర్యంతం వారితో చర్చలు జరిపే ప్రసక్తేవుండదని ప్రధానమంత్రి పునరుద్ఘాటించారు. చైనీయులు భారతదేశంపై ద్వేషభావం కలిగించే విషప్రచారం సాగిస్తున్నారు. "పరనిందలో చైనా ప్రభుత్వం తాను నెలకొల్పిన ఉన్నత ప్రమాణాన్ని తానే అధిగమిస్తున్నది." దియోలీ శిబిరంలోవున్న నిర్బంధితులు చాలామంది చైనాకు తిరిగి వెళ్ళడానికి నిరాకరించడమే ద్వేషపూరితమైన ప్రచారానికి కారణమనేది సుస్పష్టం.

చైనావారు సరిహద్దులలో భారీ ఎత్తున సైనికదళాలను సమీకరిస్తున్నట్లు రోజూవార్తలు అందుతూనే వున్నాయి. టిబెట్ వాస్తవానికి ఒక సైనిక శిబిరంగా మారిపోయింది. సిక్కిం సరిహద్దులో పెద్దఎత్తున సైనికదళాలను వారు సమీకరిస్తున్నట్లు తెలుస్తున్నది. చైనా ప్రభుత్వం తన ఈ చర్యలను కప్పిపుచ్చుకోవడానికి, భారతదేశం సరిహద్దులను ఉల్లంఘించినదంటూ నిందారోపణలు చేస్తున్నది.

చైనీయులు తమకు స్వాధీనమైన 27 మంది మన అధికార్లను, విడుదల చేయడానికి పూర్వం వీధులలో పరేడు చేయించారు. ఈ అమానుష చర్యలపట్ల అధిక్షేపణ తెలుపుతూ భారతప్రభుత్వం చైనాకు నిరసనపత్రం అందజేసింది. నేటి చైనాపాలకులు అనుసరిస్తున్న మధ్యయుగంనాటి క్రూరవిధానాలకు ఈ దురాచారం మరో తార్కాణం.

ఉత్తర లఢక్‌లో కారాకోరం కనుమకు వెళ్ళే భారతదేశపు సంప్రదాయకమైన మార్గంలో డెస్పాంగ్‌లా సమీపంలో చైనావారు కొత్తగా ఒకస్థావరాన్ని నెలకొల్పారు. ఇది చైనీయులు భారత భూభాగంపై జరిపిన సరికొత్త ఉల్లంఘన. ఈ ప్రాంతంలో పౌర. గస్తీకేంద్రాల పేరుతో ఏడు స్థావరాలను స్థాపించడంద్వారా చైనావారు కొలంబో రాజ్యాల ప్రతిపాదనలను ఎప్పుడో గాలికి వదిలేశారు. ఈ కవ్వింపుచర్యలు తీవ్రపరిణామాలకు దారితీయకపోవచ్చు. కాని ఇవిచైనా తనద్రోహబుద్ధినీ, దౌత్య రంగంలో తనకు కలిగిన పరాజయాలనే ముఖ్యసమస్యలనుంచి ప్రపంచ దృష్టిని మరల్చడానికి

(మిగతా 80వ పేజీలో)

# ప్రాచీన భారతీయ చిత్రకళ

క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

కళ మానవ సృజనాత్మక శక్తికి చిహ్నము. ఒక సాంఘిక అవసరమును సంతృప్తి పరచుటకు జనించినదీ కళ. ఇట్టి కళకు, అందులో చిత్రకళకు భారతదేశములోను, భారతీయుల జీవితములలోను ఒక నిర్దిష్ట స్థానమున్నది. నేటికికూడ అనేక రూపాంతరములు పొందియు, చిత్రకళింకా మన దేశములో అలరారుచుండుటయే దీనికి నిదర్శనము.

ఈ చిత్రకళ మనకు నిన్న మొన్న వచ్చినది కాదు. కష్టించి అనుకరించి నేర్చుకొన్నది కాదు. తరతరాలనుండి మన రక్తములో జీర్ణించిపోయినది. అనేక వేల సంవత్సరములకు పూర్వమే భారతీయుల జీవితములో ఒక విశిష్ట స్థాన మేర్పరుచుకో గలిగినది. అయినను యిటీవలవరకు ప్రాచీన చిత్రకళలలో హిందూదేశము పేరు పేర్కొన బడకపోవటము శోచనీయము. ఇందుకు బాధ్యులు మనమా, ఐరోపియనులా అని వాదించటము వ్యర్థము. ఎవరు బాధ్యులైనప్పటికీ యిటీవలవరకు ప్రాచీన చిత్రకళనిన 'గ్రీక్', 'రోమన్' చిత్రకళనెడి భావము అందరికి వుండెడిది. కానిప్పుడిప్పుడే ఈ చిత్రకళలకంటె కూడ ప్రాచీన చిత్రకళలున్న వని గ్రహింపగలుగుచున్నారు. ఈనాడు వివిధ దేశీయులు భారతీయ చిత్రకళను బహు ప్రాచీన చిత్రకళగా గుర్తించుచున్నారు.

భారతదేశములో చిత్రకళ ఎప్పుడు జన్మించినదో ఎవరూ చెప్పలేకుండ యున్నారు. రాయిగర్, మీర్జాపూర్ గుహల పైనను, మహేదియో పర్వత గుహల పైనను చిత్రింపబడిన చిత్రములు భారతీయ ఆదిమ చిత్రకళకు నిదర్శనములుగా నిలచి యున్నవి. కానివి యే కాలమునకు చెందినవన్న విషయము మాత్రము చరిత్రకారులింకను నిర్ణయించలేకుండ యున్నారు. అయినను క్రీ. పూ. 3 వేల నాటికే మన దేశములో చిత్రకళ అత్యుత్తమ స్థాయి, చేరుకొన్నదని మాత్రము చెప్పగలము. మహేంజిదారో, హరప్పా శిధిలములు దీనికి నిదర్శనములు. ఆనాటికే వారు చంద్రకాంతి, చలువరాళ్ళతోను, పింగాణితోను, బంగారు, వెండి, రాగి, కంచు మొదలగు లోహములతోను పాత్రలు, ప్రతిమలు, నగలు, ముద్రలు మొదలగు కళాత్మక వస్తువులు చేయుటయందు బహు నేర్పు గడించియుండిరి. వారు మృణ్మయ పాత్రలపై కూడ చక్కగా చిత్రించెడివారు. కానిప్పటికిని మనలను సంభ్రమాశ్చర్యముల ముంచునది వారి ప్రతిమలు. అవి గ్రీకు ప్రతిమలకేమాత్రము తీసిపోవు. ఇప్పటికిని నిలచియున్న నగ్న యువక ప్రతిమ దీనికి చక్కటి నిదర్శనము. వాస్తుశిల్పమునందు కూడ వీరు నేర్పులు.

ఐతరేయ, శతపత బ్రాహ్మణములందు యేది కళని పిలవబడుతుందో, దానియొక్క విశిష్టత ఎటువంటిదో వివరింపబడియున్నది. ఈ బ్రాహ్మణములు దేవ శిల్పము, మనుష్య శిల్పము, అసుర శిల్పము అను మూడు రకముల శిల్ప జాతులను పేర్కొనుచున్నవి. ఉపనిషత్తులందును ఆనాటి కుంచెలు ఈ విధముగా పేర్కొనబడి యున్నవి - 'చిత్రకారుని కుంచెనుండి నా'రను విడదీసినట్లు మానవుడు తనలోని ఆత్మను తన శరీరము నుండి దృఢముగ విడదీయవలయును. "దీనినిబట్టి ఆనాడు కుంచెలను నారతో తయారు చేసెడివారని తెలియుచున్నది. ఆ కాలమున చిత్రకళ దైవాంశముగాను, అట్టి చిత్రకళగల మానవులు శుభలక్షణ్వితులుగాను భావింపబడెడివారు.

క్రీ. శ. 3 వ శతాబ్దములో వాత్సాయనుడు తన కామసూత్ర గ్రంథమందు చిత్రకళనుద్దేశించి, షతాంగ మను ఆరు ముఖ్య సూత్రములను పేర్కొనెను. ఆ సూత్రములు వాత్సాయనుడు కూర్చినవి కావట. అంతకు పూర్వమే రచింపబడిన గ్రంథముల నుండి గ్రహించి వ్రాయబడినవట. ఈ షతాంగము లేవన 1. రూపభేదము, 2. ప్రమాణము, 3. భావము, 4. లావణ్య యోజనము, 5. సాదృశ్యము, 6. వార్ణిక భంగము. (చిత్రపటము చిత్రించునప్పుడు యేయే వస్తు సముదాయములు, సాధనములు వుపయోగింపవలయునో, అవి యేవిధమున ప్రయోగింప వలయునో తెలుపునది.)

ఈ షతాంగముల బోలిన సూత్రములు చైనీయుల చిత్రకళందును అవలంబింపబడి యుండుట వలననూ, వారా సూత్రములను

చైత్యం పైకప్పు – అజంతా



క్రీ. శ. 6 వ శతాబ్దము తదుపరియే పేర్కొనుట వలననూ, చైనీయులు ఈ సూత్రములను భారతీయ చిత్రకళ నుంచే గ్రహించినారేమో నని యనుకొనుటకు అవకాశము కలుగుచున్నది.

'చిత్ర లక్షణ' మను మరియొక ప్రాచీన గ్రంథమునందు దేవతా ప్రతిమలు చిత్రించు నప్పుడు అవలంబింపవలసిన విధానము గూర్చి విపులముగా చెప్పబడియున్నది. దేవతా ప్రతిమలు మానవ ప్రతిమలకన్న పెద్దవిగానూ, రాజ ప్రతిమలు సామన్య మానవ ప్రతిమలకన్న పెద్దవిగానూ చిత్రింప వలయునట. దేవతా స్వరూపములు చిత్రించు నప్పుడు ముఖము చతుర్భుజా కారముగా చిత్రింప వలయునట. ముక్కోణముగాగాని, గుండ్రముగాగాని, అండాకృతిగాగాని యుండ రాదట. మరియు ముఖమండలము సుందరముగాను, కాంతివంతముగాను, నిర్మలముగానూ వుండి, స్పష్టముగా గీయబడి వుండవలయునట. ఇవ్విధమున సదా చిత్రించువాడు ధన్యుడట. సామాన్య ప్రజల ప్రతిమలు చిత్రించునప్పుడు వారు గనుక శాంతియుతులైన, వారి ముఖమండలములు పొడుగుగాగాని, గుండ్రముగాగాని, త్రికోణాకారముగాగాని చిత్రించవచ్చునట. దేవతా స్వరూపులకును, పూజ్య మానవులకును, నొక్కునొక్కులుగా నున్న నీలి జుత్తు చిత్రించవలయునట. స్త్రీ స్వరూపములను చిత్రించునప్పుడు వారిని నవయౌవనవతులుగానే చిత్రింప వలయునట. ఈ విధమైన అనేక సూత్రములు ఈ గ్రంథమునందు విపులముగా నున్నవి. దీని నాధారముగ చేసుకొనే కాబోలు యిప్పటికిని నిలచియున్న 'శిల్ప శాస్త్రము' రచింపబడినది.

ఈ 'శిల్పశాస్త్రము'నందు వివిధములైన చిత్రములనుగూర్చియు కలదు. నవ రసములలో నేదోనొక రసభరితమైన చిత్రమును 'రస చిత్ర'మనియు, యేదైన వస్తువునకు యథాతథమైన ప్రతిరూపమును కల్గించు చిత్రమును 'చిత్రభాస'యనియు పిలవవలయునట. ధూలి, పుష్పచిత్రములు కూడా ఆ కాలమున వాడుకలో నుండెడివి. చిత్ర రచనందు అతి ముఖ్యాంశమైన చిత్రకారుని



అప్సరసలు — అజంతా

మనఃప్రవృత్తి గూర్చియు ఈ శాస్త్రమునందు చెప్పబడినది. ఒక చిత్రపటము చిత్రించునప్పుడు ఆ చిత్రకారుని మనఃప్రవృత్తి చాలా ముఖ్యము. యేలనన చిత్రకారుని ప్రమేయము లేకుండానే అతని అప్పటి మనఃప్రవృత్తి చిత్రపటమునందు ప్రతిబింబించును. అందుచే ఈ గ్రంథము. చిత్రకారుడు ఆరోగ్యవంతుడై, స్వస్థచిత్తుడై, నొక శుభప్రదేశమున చేరి, నొక శుభఘడియయందు తను రచింపదలచుకొన్న చిత్రమును యేకాగ్రతతో నాలోచించుకొని 'కిట్టిలేఖిని'తో (ఒక విధమైన దర్భనుంచి తయారు చేయబడినది) చిత్రింపవలయునని నుడువుచున్నది. చిత్రశిల్పి గుఱించి యింకను 'శ్రీ మహావజ్ర భైరవ తంత్ర'మందు ఈ విధముగా చెప్పబడినది — అతడు సత్పురుషుడు, పూజ్యుడు, దయాళువు, పండితోత్తముడునునై క్రోధలోభాది పిశాచములను దరిచేరనీక తన చిత్రించు చిత్తరువునందు యేకాగ్రత కలిగి వుండవలయును. అట్టి చిత్రశిల్పి 'ఖుర వస్త్రము'పై చిత్రించుటకు అర్హుడు. అట్టి అతను తన కార్యమునందు సఫలుడైన అతనిలో ఖురప్రజ్ఞ ప్రవేశించును.' మరియు ఆచిత్రకారుడే ఆఖుర వస్త్రమును చదునుగా పట్టుకొని దానిపై గోప్యముగ చిత్రింప వలయు'నట. 'అతనియందు చిత్రకారుని ప్రక్కన 'సాధకుడు' తప్ప మరియే 'ఐహికలాభపరాయణుడైన పురుషుడు' వుండరాదట.

'విష్ణుధర్మోత్తర' పురాణములోమానవ రూపములను చిత్రించునప్పుడు, వారి వివిధాంగములను సరైన పాళ్ళలో చిత్రించవలయునని చెప్పబడి యున్నది. 'చిత్రసూత్ర' గ్రంథము ఆ రూపములు చిత్రింపబడిన భంగిమలనుబట్టి వాటి వివిధాంగముల పాళ్ళు మారుచుండునని నుడువుచున్నది. ఈ సందర్భములో ఈ గ్రంథము పన్రెండు, భంగిమలను పేర్కొనుచున్నది. 'ఈశ్వర సంహితము' చిత్తరువులందలి ప్రతిమలలో నెప్పుడు సౌందర్యము, లావణ్యము ప్రతిబింబించవలయునవియు, అది చూచువారికి హృదయానందము కలిగించు ననియు చెప్పుచున్నది.

సౌందర్యము చిత్రకళలో ఒక ముఖ్యభాగమే అయినను, సౌందర్యముకన్నను లావణ్యము, భావము ముఖ్య మనికూడ ఈ 'చిత్రసూత్ర' గ్రంథము నుడువుచున్నది. మరియు మానవులను, జంతువులను ప్రకృతిని కూడా సహజముగ చిత్రింపవలయునట. మరణించిన మానవునికి, నిద్రించిన మానవునికి భేదము చూపించలేని, చిత్రకళ చిత్రకళ కాదట. ఈ విషయము 'శిల్పరత్న'ములోని 46 వ అధ్యాయములో కూడ పేర్కొనబడి యున్నది. ఏ ప్రతిమను చిత్రించునప్పుడైనను దాని వివిధ భాగములను సంపూర్ణముగ చిత్రింపవలయు ననికూడ ఈ 'చిత్రసూత్ర' గ్రంథము నుడువుచున్నది. ఇందు మూడు విధములైన శిరోజములు, అయిదు విధములైన నేత్రములు పేర్కొనబడి యున్నవి. ఈ వివిధ నేత్రములు వివిధ స్వభావములను తెలుపునట. కాని ఆనాటివారు, చిత్రకారుడు తన చిత్రమునందు ఈ సూత్రము లన్నియు యధాతథముగా చిత్రింపనవసరము లేదనియు, కేవలము ఈ సూత్రములన్ని మనస్సులో నుంచుకొని సహజముగాను, భావోక్తముగాను చిత్రించిన చాలు ననికూడా నమ్మియుండిరి.

ప్రాచీన భారతీయ చిత్రకలో మరికొన్ని ప్రత్యేకతలు కూడా కలవు. ప్రకృతికి ఈ ప్రాచీన చిత్రకళలో ఒక నిర్దిష్టస్థాన మున్నది. గ్రీకులవలెగాక భారతీయ శిల్ప కళాకారులు తమ మానవప్రతిమల నెప్పుడు పరిసర సహితముగా చిత్రించెడివారు. అంతేగాకుండా ఈ పరిసరములు సహితము ఆ ప్రతిమలలో ప్రతిబింబించే భావమునే వ్యక్త పరుచుచుండెడివి. ఆనాటివారు మానవులను, ప్రకృతిని సమదృష్టితో చూచుటయే దీనికి కారణము. వారు మానవ ప్రతిమలలోని వివిధాంగములను, ముఖ్యముగా స్త్రీ విగ్రహమును ప్రకృతిలోనుండు సుందర స్వరూపములను పోలియుండునట్లు చిత్రించెడివారు.

సాంకేతిక చిత్రీకరణ ప్రాచీన భారతీయ చిత్రకళయొక్క మరియొక లక్షణము. బుద్ధుడు భూలోకమునకు దిగి వచ్చునట్లు చిత్రీకరించుటకు, మెట్లు, వాటిపై పాదపద్మములను మాత్రమే చిత్రించియున్నారు. దుర్గ యొక్క పదిచేతులు ఆమె శక్తిని వ్యక్త పరుచును. వారు వివిధ ముద్రలను ఈ సాంకేతిక చిత్రీకరణకు విరివిగా వుపయోగించెడివారు.

భారతీయ చిత్రకళలో మరియొక విశేషము భావము. భావరహితమైన శిల్పముగాని, చిత్రముగాని రాణింపదని ఆనాటి శిల్ప చరిత్రకారులు గట్టిగా నమ్మియుండిరి. సహజత్వముకన్న కూడా వారు భావమునకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చిరి. అంతేగాని వారికి గ్రీకులవలె మానవ



చైత్యం — అజంతా

ప్రతిమలయొక్క ప్రతి కండరమును సహజముగా చిత్రించుట తెలియకపోవుట మాత్రము కాదు. రాజుల రాజసము, మహాపురుషుల శాంతము, వర్చస్సు, స్త్రీల లాలిత్య మృదుత్వములు, మొదలగు భావము లన్నియు వీరు తమ ప్రతిమలందు చక్కగా వ్యక్తపరచియున్నారు. వారెన్నడు సాధారణముగా స్త్రీ పురుషులను యథాతథంగా (Potraits) చిత్రించెడివారు కాదు. అట్టి చిత్రములు చిత్రించినను, వారా చిత్రించే వారిని ముందుంచుకొని యధాతథముగా కాక, వారి రూపములను తమ మనస్సులందు చిత్రించుకొని, ఆ రూపములకు తగు భావముల నేర్పరిచి చిత్రించెడివారు. వారు తమ చిత్రములలో భావమునే గాక తమ వ్యక్తిత్వమును కూడ వ్యక్తపరచగలిగెడువారు.

ప్రాచీన భారతీయ చిత్రకళలో శిల్ప, చిత్రలేఖనములకు సమానస్థానములే కలవు. ఈ ప్రాచీన చిత్రకళ ఒక దశయందు గ్రీకు ప్రభావమునకు తలొగ్గి నిర్జీవమైనను, అనతి కాలములోనే ఆ ప్రభావమును వైదొలగించుకొని తన ప్రత్యేకతను నిలుపుకోగలిగెను. కాని దురదృష్టవశాత్తు యిట్టి మహోజ్వల చిత్రకళకు నేడు ప్రత్యక్ష నిదర్శనములు బహు స్వల్పముగా నున్నవి. మహమ్మదీయుల దండయాత్రలవలన నేమి, మన దేశ శీతోష్ణకాల పరిస్థితుల వలన నేమి ఆనాటి శిల్పములు. కుడ్య చిత్రములు అన్నియు దాదాపు రూపుమాసియున్నవి. కానిప్పటికిని నిలిచియున్న సార్‌నాథ్, సాంచి, అమరావతి, ఎల్లోరా మహాబలిపురం మొదలగు ప్రదేశములు ఆనాటి శిల్ప కళను వేనోళ్ళ చాటుచున్నవి.

క్రీ. పూ. 1 వ శతాబ్దమునకు చెందిన సాంచీ స్థూపము లందు మానవ, జంతు రూపములు జాతిలో యెంతో సహజముగాను, భావోక్తముగాను మలచబడి యున్నవి. ఈ శిల్పములందు ఆనాటి శిల్పులు వివిధ ముద్రలను విరివిగా వాడియున్నారు. అమరావతి శిల్పములందు సైతము భావము, సహజత్వము ద్యోతకమగును. మదించిన ఏనుగు బుద్ధుని ఢీకొనబోవుచున్నట్లున్న సన్నివేశములో ఏనుగు భీకర స్వరూపమును, బుద్ధ మహాత్ముని శాంత స్వరూపమును, అక్కడే నిలుచునియున్న భయవిహ్వలులైన ప్రజలను చక్కగా చిత్రించియున్నారు. భారతీయ ప్రాచీన చిత్రకళలో ప్రకృతికున్న

విశిష్టస్థానము మనకు గుప్తులనాటి (క్రీ. శ. 4 వ శతాబ్దము) శిల్పములందు బాగుగ విశదమగును. ఆనాటి శిల్పులు మానవ రూపములను మలచునప్పుడు నేత్రములు మీనముల వలెను, మెడ హంస మెడవలెను, తొడలను ఏనుగు తొండమువలెను, చేతులను తామరతూడల వలెను, వ్రేళ్ళను చంపక పుష్పముల వలెను చిత్రించెడివారు. వారు స్త్రీలను వక్షోజ భారముచే వంగిపోయి నట్లు చిత్రించెడివారు. ఇంకను, వారీ శిల్పములందు స్త్రీలు ఎడమప్రక్కకు, పురుషులు కుడి ప్రక్కకు వంగి యున్నట్లు చిత్రించి యున్నారు.

మన ప్రాచీన చిత్రకళలో శిల్పముల వలెనే కుడ్యచిత్రములు కూడ బహు ప్రసిద్ధి చెందియున్నవి. పురాణ గ్రంథమైన రామాయణము కూడ ఆనాడు బహుళ ప్రచారములో నున్న కుడ్య చిత్రములను పేర్కొనుచున్నది. కాని దురదృష్టవశాత్తు ఆనాడు, వారు కఱ్ఱతోను, కాల్చని యిటుకతోను కట్టిన కట్టడములపై సాధారణముగా చిత్రించుటవలనను, ఎక్కువగా వృక్షజాతుల నుండి తయారు చేసిన వర్ణములు వాడుటవలనను, అవి శీతోష్ణ పరిస్థితుల ధాటికి తట్టుకొనలేక నశించినవి. ఆ విధముగా ధ్వంశమైన చిత్రములు పోగా – మిగిలియున్న చిత్రముల పరిస్థితికూడా యేమంత బాగుగ లేదు. జోగిమార గుహాలలోని పాత చిత్రములు (ఇవి బహుశ క్రీ. పూ. 1 వ శతాబ్దమునకు చెందినవై యుండునని అభిప్రాయ పడుచున్నారు) మాసిపోవు చుండుట చూచి వాటిని ఎవరో దిద్దిరి. ఈ దిద్దటము సదుద్దేశముతోనే చేసినప్పటికిని, అది కొంచెము మోటుగాను, చాతుర్య రహితముగాను చేయబడుటవలన ఆ చిత్రముల పూర్వపు రూపు పూర్తిగా మారిపోయినది. కాని యిప్పటికిని రూపు మాయకుండా నిలచియున్న అజంతా చిత్రములు ఆనాటి చిత్రకళా నైపుణ్యమును వేనోళ్ళ చాటుచున్నవి.

ఈ అజంతా చిత్రములన్ని యేక కాలమునగాక అనేక సంవత్సరముల వ్యవధిలో (క్రీ. శ. 1 వ శతాబ్దమునుండి 7 వ శతాబ్దము వరకు) అనేక చిత్రకారులచే కొద్ది మార్పులుగల వివిధ శైలులలో చిత్రింపబడినప్పటికిని ఈ చిత్రశిల్పులందరు వాత్సాయనుని షడంగసూత్రములను మాత్రము తమ చిత్రములందు అవలంభించుట మరువలేదు.

ఈ అజంతా చిత్రముల విశిష్టత వ్రాయుటకు నొక గ్రంథమైన చాలదేమో! ఈ చిత్రములు ఆనాటి కళా సౌందర్యమునేగాక, సాంఘిక, చరిత్రాత్మక, మతవేదాంత విషయములను కూడ ప్రతిబింబించుచున్నవి. అందువలననే కాబోలు "పశ్చిమదేశ చిత్రకారుల వలెగాక, తూర్పుదేశ చిత్రకారులు ప్రప్రథమముగా వేదాంతులు, అటుపిమ్మటే చిత్రశిల్పులు" అన్నాడొక మహానుభావుడు! ఈ అజంతా చిత్రములందలి ముఖ్యాంశమేమన పశ్చిమదేశ చిత్రములవలెగాక యివి కేవలము రేఖల సమూహములతోనే గీయబడినవి భారతీయ చిత్రములన్ని సాధారణముగ రేఖలచేతనే గీయబడినప్పటికినీ, ఆ రేఖలను అజంతా చిత్రములందు వాడినంత నైపుణ్యముగా మరి యెచ్చటనూ వాడియుండలేదు. కేవలము ఈ రేఖల మూలమున నే చదునుగానున్న ఉపరితలమున చిత్రించిన వస్తువు గుండ్రముగాను, ఘనపరిమాణము కలదిగాను మనకు కనపడునట్లు చేయగలిగిరి. రేఖల మందమును హెచ్చించుట, తగ్గించుట వలనను, దృఢముగానో, తేలికగానో గీయుటవలననూ; చిత్రశిల్పి ఆ చిత్రమునందలి వస్తువుకు కేవలం రూపము, ప్రమాణము, ఘనపరిమాణమేగాక, ఆ చిత్రమునందు దానికి గల విలువ, ఆ వస్తువు వ్యక్తపరచవలసిన భావము మొదలగునవి కూడ చిత్రింపగలిగిరి. సంక్షేపముగా చెప్పవలయునన్న, వాత్సాయనుని షడంగముల లోని మొదటి అయిదు సూత్రములు ఈ రేఖలద్వారానే చిత్రమునందు చిత్రశిల్పి వ్యక్తపరచగలిగెను. ఇందులకు చక్కటి ఉదాహరణ ప్రథమ గుహలోగల బోధిసత్వ అవలోకితేశ్వర విగ్రహము. ఇది, యువరాజగు సిద్ధార్థుడు జ్ఞానార్జనకొరకు తన అంతఃపురము వీడి వెడలు ఘట్ట మందలిది. ఇందు బుద్ధభగవానుని ప్రతిమ మానవ పరిమాణముకన్నను పెద్దదిగానుండి, కొంచెము వంగియున్నట్లుండును.

మొదటి సూత్రమైన రూపభేదమును తీసుకొనిన యెడల, మనకు వెంటనే ఆ చిత్రమును లిఖించుటయందు చిత్రకారుడుపయోగించిన రూపజ్ఞానము స్పష్టమగుచున్నది. ఆ చిత్రశిల్పి కేవలము రేఖల ద్వారానే, ఆ ప్రతిమయొక్క భుజములు, బాహువులు చదునైన వుపరితలము మీద గుండ్రముగాను, సజీవముగాను మనకు కానవచ్చునట్లు చేయుటయేగాక, ప్రతిమ మోమున నిండుతనము, మృదుత్వము చిత్రింపగలిగెను. ఆనాటి చిత్రకారులు ఒక మానవ ప్రతిమ చిత్రించుటయందేగాక నగలు, పూవులు, దుస్తులు, జుత్తు మొదలగునవి చిత్రించుటయందు కూడ ఎంతో రూపజ్ఞానము చూపియున్నారు. మెడచుట్టుయున్న నగ మూలమున గొంతుయొక్క గుండ్రనితనమును, అడ్డముగా వ్రేలాడుచున్న హారమువలన ఆ ప్రతిమ పరిగెత్తెడి విధానమును చక్కగా చిత్రింపగలిగిరి.

రెండవ సూత్రమైన ప్రమాణము గూడ ఈ బోధిసత్వ అవలోకితేశ్వరుని చిత్రమునందు స్పష్టముగా గానవచ్చుచున్నది. ఉదాహరణకు అందు అవలోకితేశ్వరుని విగ్రహము కుడి బాహువు వంచి కలువ పుష్పము పట్టుకొని యున్నట్లున్నది. మన కెదురుగా కొంచెము దూరములో నిలుచుని యున్న మనిషి ఆ విధముగా తన బాహువును వంచినప్పుడు, పరీక్షగా చూసిన యెడల, బాహువు మోచేతినుండి హస్తము వరకు నున్న చేతి భాగము, వంచబడని చేతి భాగము కన్నను పొట్టిగా నున్నట్లు కానవచ్చును. ఆ చిత్రశిల్పి దీనిని గ్రహించి ఆ విధముగానే చిత్రించి తనకుగల పరిమాణ జ్ఞానమును చాటుకొన్నాడు.

మూడవ సూత్రమైన భావము ఈ చిత్తరువునందు కొట్టవచ్చినట్లు కానవచ్చుచున్నది. సిద్ధార్ధుని ముఖమునందు గొప్పదనము, శాంతము, కరుణ, దుఃఖము మిళితమై యున్నవి. ఇందు చిత్ర మేమన ఈ భావము లన్నియు రేఖల మూలముననే వ్యక్తపరుపబడి యుండుట. సిద్ధార్ధుడు నిలుచున్న విధానము, అతని హస్తము, ఆ హస్తమునందున్న పుష్పము గూడ భావ ప్రకటనకు బాగుగ నుపయోగపరచబడినవి. నాలుగవ సూత్రమైన లావణ్య యోజనము ఆ చిత్తరువునందు ఎక్కడను లేదని చెప్పగలము. ఆ చిత్రమునందలి ప్రధాన ప్రతిమయైన సిద్ధార్ధునియందే గాక, వెనుకనున్న మిగిలిన ప్రతిమలందును లావణ్యము తొణికిసలాడుచున్నది. అయిదవ సూత్రమైన సాదృశ్యముకూడ యిచ్చట విశదముగానున్నది. ఈ చిత్రమునందు ప్రాముఖ్యత రాణీ ప్రతిమకు లేదుగావున, సిద్ధార్ధుని ప్రతిమకన్నను అది చిన్నదిగా చిత్రించి, మేరలోనుంచి, సిద్ధార్ధుని ప్రతిమ సజీవముగానూ, సచేతనముగానూ చిత్రించి ఈ చిత్తరువునందు రాణి, సిద్ధార్ధుల ప్రతిమలకు ప్రాముఖ్యతలోగల భేదమును స్పష్టపరచి యున్నారు.

ఈ అయిదు సూత్రములు కాక, షడంగములలోని శేషించిన సూత్రము వార్ణికభంగము. అన్నివేల సంవత్సరములకు పూర్వము లిఖింపబడిన ఈ చిత్రములు యింకను రూపుమాయకుండ వుండుట మనలను ఆశ్చర్యచకితులను చేయును. ఆ చిత్రశిల్పులు చిత్రించిన విధానమునందే ఆట్టి శాశ్వత లక్షణము కలదు. ఈ అజంతా చిత్రములకు పూర్వము చిత్రకారులు మిట్టపల్లములగా నున్న ఆ బండరాళ్ళ మీదనే చిత్రించెడివారు. అచ్చటచ్చట సున్నపు నీరు, యిసుక కలిపి చేసిన పదార్థము యొక్క సన్నని పొరతో ముందు బండరాళ్ళ ఎగుడు దిగుడులను కప్పి చిత్రించిన నిదర్శనము లున్నప్పటికిని, వారు వాడిని వర్ణములుగాని, చిత్రించిన విధానముగాని అజంతా చిత్రముల కాలమునాడున్నంత బాగుగలేదు.

ఈ అజంతా చిత్రములందు అవలంబించిన విధానమే బౌద్ధ చిత్రము లన్నిటియందు అవలంబించబడినది. మిట్టపల్లములుగా నున్న ఈ రాతి బండలపై మట్టి, గోమయముతో కొన్ని చూర్ణములు కలిపి ముప్పాతిక అంగుళము కన్నను తక్కువ మందమున పూసెడివారు. కొన్ని సమయములలో దీనియందు బాగుగ తరిగిన గడ్డి, ఊకకూడ కలుపుచుండెడివారు. ఈవిధముగ ఆ బండరాళ్ళపై ఒక పూత పూసిన పిదప, మరల దానిపై అతి సన్నని పొరలో (తెల్లగా) గిలాబ చేయుచుండెడివారు. దీనితో ఆ బండరాళ్ళు ఆలిచిప్పలవలె మెరసెడివి. ఈ విధముగా తయారుచేయబడిన ప్రదేశముపై నీటివర్ణములతో చిత్రించెడివారు. కాని ఈ వర్ణములను గిలాబ చేయబడిన ప్రదేశము మీద ప్రయోగించు విధానమును గూర్చి భేదాభిప్రాయములున్నవి. ఈ అజంతా చిత్రకళ ఆనాడు ఐరోపా దేశమునందు వాడుకలోనున్న 'ఫ్రెస్కో' చిత్రకళను పోలియున్నదా, లేక ఈజిప్టు, మెసపొటేమియాలలో వాడుకలో నున్న 'టెంపరా' చిత్రకళను పోలియున్నదా, యనునది చర్చనీయాంశమైనది. కాని ఈ అజంతా చిత్రములు 'ఫ్రెస్కో' చిత్రములా 'టెంపరా' చిత్రములా అని వాదించుటకు పూర్వము ఫ్రెస్కో చిత్రము లనగా నేమో తెలిసుకొనవలసి యున్నది.

'ఫ్రెస్కో' చిత్రకళ ప్రకారము, చిత్రింపదలచుకొన్న స్థలమని గిలాబచేసి. అది యింకను తడియారక మునుపే దానిమీద వర్ణములు పూయవలయును. కావున ఈ చిత్రములు అతి త్వరితముగా చిత్రింపవలసి వచ్చెడివి. ఒకవేళ చిత్రకారుడే తను గీయదలచుకొన్న, చిత్రమును ఆ నిర్ణీత కాలములో కొంతవరకే పూర్తిచేయగలిగినయెడల, ఆ శేషభాగమున చేయబడిన గచ్చును పగలగొట్టి, అతడు ఆ చిత్రమును పూర్తి చేయుటకు సంసిద్ధుడుగానున్నప్పుడే మరల గిలాబ చేయవలసి వచ్చెడిది. ఇందుచే ఒక చిత్రమునందే అనేక అతుకులు పెట్టవలసివచ్చెడిది. ఇక 'టెంపరా' విధానమెట్టిదన్న, గిలాబ చేయబడిన ప్రదేశము బాగుగ యెండినపిమ్మట, చిత్రింపదలచుకొన్న నాటి ఉదయముగాని, ఆ క్రిందటి రోజు రాత్రిగాని, సున్నపు నీటినిగాని, లోహపదార్థములుగల మంటియొక్క నీటినిగాని కొంచెము తీసుకొని, దానిని మరికొంచము నీటిలో కలిపి ఆ యెండిన గిలాబ చేయబడిన ప్రదేశముపై చల్లి తడి చేయుదురు. ఆ తడిమీదే వర్ణములు పూయుదురు. ఈ వర్ణములు, ఫ్రెస్కో చిత్రములందు వాడు వర్ణములు వేరు కానప్పటికి, ఈ టెంపరా వర్ణములందు సున్నపునీరుగాని, నిమ్మనీరుగాని లోహ పదార్థములు గల మట్టినీటినిగాని కలుపుదురు. ఈ టెంపరా చిత్రకళకును, ఫ్రెస్కో చిత్రకళకును బాహ్యముగా కానవచ్చు భేదమేమన, టెంపరా చిత్రములందు వర్ణములు భారముగనూ, మందముగనూ వుండి కాంతిరహితముగా నుండును. ఫ్రెస్కో చిత్రములందు గిలాబ చేయబడిన ప్రదేశము తడిగా నున్నప్పుడే దానిమీద వర్ణములు పూయబడును గావున, అవి లోపలికి బాగుగ నింకుటకు అవకాశము కలదు. కాని టెంపరా చిత్రములందు ఈ విధము కాదుగావున, వర్ణములు పైపైనే వుండి త్వరగా రూపుమాయుటకు అవకాశము కలదు.

అజంతా చిత్రములందలి విశేషమేమన ఈ చిత్రములు ఫ్రెస్కో చిత్రకళను గానీ, టెంపరా చిత్రకళను గానీ పూర్తిగా పోలియుండలేదు. కొందరు ఈ అజంతా చిత్రములు ఫ్రెస్కో చిత్రములలో కానవచ్చు అతుకులు ఎక్కడను లేవని నిరూపించి యున్నారు. మరియు ఫ్రెస్కో చిత్రములందు గిలాబ చేయబడిన ప్రదేశము తడియారకమునుపే రంగులు వేయవలయును గావున, అది ఎక్కువకాలము చెమ్మగా నుండునట్లు చూడవలయును. ఇది సాధ్యపడుటకు

గిలాబ చేయుటకు వాడు పదార్థములయొక్క పొర మందముగా, అనగా కనీసము అంగుళములో నాలుగవ వంతైన వుండవలయును. మన దేశములలో పొడిగాలులకు యిగిరింపు గుణము కలదు. కావున మన దేశమునందలి ఫ్రెస్కో చిత్రములలో ఈ పొర మందముగా నుండుట మరీ అవసరము. సిగిరియా గుహలందిట్లే యున్నను, అజంతా గుహలందు ఈ పొర చాలా సన్నముగా నున్నది. తొమ్మిదవ గుహలో ఈ పొర అంగుళములో ముప్పదిరెండవ వంతే యున్నది. కావున ఈ అజంతా చిత్రములు ఫ్రెస్కో చిత్రములు కావని వారి వాదన. ఈ చిత్రములందు కొన్నిచోట్ల వాడిన వర్ణములు టెంపరా చిత్రములందువలె కాంతిరహితముగా నుండుటవలనను, మరికొన్ని స్థలములందు వర్ణములు మాయుటవలనను గిలాబ చేయబడిన విధానము బట్టియు, అవి టెంపరా చిత్రములే అని వారు వాదింతురు. మరియొక వర్గమువారు ఈ అజంతా చిత్రశిల్పులు ఫ్రెస్కో చిత్రకళను పూర్తిగా అవలంబించక పోయినప్పటికీ, ఆ విధానమునే కొన్ని మార్పులతో తమ చిత్రములందు వాడిరని వాదింతురు. వారి వాదము లెట్లుండినను, మన కొక్క విషయము మాత్రాము స్పష్టమగుచున్నది. భారతీయ చిత్రకారులు ఆ కాలమునందు పరదేశములో వాడుకలోనున్నయే చిత్రకళను యథాతథముగా అనుకరించక, ఒక ప్రత్యేక విధానమునే అవలంబించి తమ నైపుణ్యమును, ప్రత్యేకతను సర్వ ప్రపంచమునకు చాటుకొన్నారు.

ఈ విధముగా వర్ణములు వేయవలసిన ప్రదేశము సిద్ధపరచుకొన్న పిదప, దానిపై ఎఱ్ఱరంగు రేఖలతో తాము వేయదలుచుకొన్న చిత్రమును గీసెడివారు. ఇది అనుభవశాలి అయిన చిత్రకారుడే చేసినప్పటికిని, చిత్రకళా నిపుణుడు దానిని మరల అచ్చటచ్చట గోధుమ, నీరుకావి వర్ణములతో గాని, నల్లని వర్ణముతోగాని దిద్దిన నిదర్శనము లున్నవి. ఆ పిదప ఆ చిత్రమును మట్టినుండి తయారుచేయబడిన ఒక రకమైన పచ్చని పొరలో కప్పెడివారు. ఆ పొర అతి సన్నముగాను, స్వచ్ఛముగాను వుండుటచే పొర క్రిందనున్న చిత్రము బాగుగ కానవచ్చెడిది. ఈ విధానమునే ఇటలీ దేశస్థులు తమ ఫ్రెస్కో చిత్రములందు అవలంబించెడివారు. ఈ విధముగా చిత్రమంతయు కప్పిన పిదప ఆ చిత్రకారులు ఎరుపు, పసుపు, నీరుకావి, గోధుమ, నలుపు వర్ణములతో దానిపై చిత్రించెడివారు. అటుపిమ్మట రేఖలతో ఆ ఆకారములను దిద్దెడివారు. ఆనాటి చిత్రకారులు వెలుగునీడలను (Light and shade) ఎక్కువగా చిత్రించినప్పటికి, మరీ అవసరమైనచోట చిత్రమంతయు పూర్తి అయిన పిమ్మట కట్టకడకు కొలది ఛాయలను చిత్రించెడివారు.

అజంతా చిత్రములలో ఈ విధముగా షడంగములలోని సూత్రములనే గాక యితర చిత్ర సూత్రములను కూడ పాటించిన నిదర్శనములు కానవచ్చుచున్నవి.

మన ప్రాచీన చిత్రకారులు వాడిన కుంచెల గురించి మన కంతగా తెలియకున్నను, వారు వాడిన వర్ణముల గురించి మాత్రము మనము కొంతవరకు తెలుసుకొన గలుగుచున్నాము. జోగిమార గుహల నాటికే మన దేశమునందు వర్ణములు అభివృద్ధిచెంది యుండెనను నది నిర్వివాదాంశము. అంతకు పూర్వము మాత్రము యినుపత్రుప్పునుండి సంగ్రహింపబడిన ఎఱ్ఱరంగు నొక్కదానినే వాడుచుండిరి. కాని జోగిమార చిత్రములందు కేవలము ఎరుపువర్ణమే గాక, తెలుపు నలుపు వర్ణములు సైతము వాడబడినవి. తెలుపు వర్ణము ఒక రకమైన మట్టినుండియు, నలుపు వర్ణము అద్దకములకు వాడు ఒక రకమైన పండ్లతో మరికొన్ని పదార్థములు కలిపియు తయారు చేసెడివారు. అజంతా చిత్రముల కాలము నాటికి మరికొన్ని వర్ణములు వాడుకలోకొచ్చినవి. ఈ చిత్రములందు ధూమ్ర, చెంగావి, పాటలి, హరితాది వర్ణములుకూడ వాడబడినవి. ఈ వర్ణముల తయారీ గురించి మనకు విపులముగా తెలియకున్నను, వాటిని యేయే వస్తు సముదాయముల నుండి తాయారు చేసెడివారో మనము చూచాయగా తెలుసుకోగలుగుచున్నాము. ఈ చిత్రములందు వాడబడిన వివిధ ఛాయల ఎరుపురంగు, ఇనుము చేరిన పదార్థముల యొక్క త్రుప్పునుండి తయారు చేయబడినది. పచ్చలు సాధారణముగ బాగుగ పొడి చేయబడిన యినుప పదార్థముగల యిసుకనుండి, రాగిచిలుము (Verdigris) నుండి వుత్పత్తి చేయబడుచుండెడివి. కొన్ని పచ్చలు వృక్షజాతుల నుండి సైతము తయారు చేయబడి యుండవచ్చును. నీలి వర్ణము పిండి చేయబడిన వైడూర్యము (Lapis-layuli) నుండి గైకొనబడెడిది. పసుపు వర్ణము తాళకమని అభిప్రాయపడుచున్నారు. అది 'హారటల్' అను 'ఆర్సనిక్ సల్ఫైడ్' నుండి తయారు చేయబడెడిది. తెలుపెక్కువుగా సున్నము నందు గంధక ద్రావకము చేరికవల్లనైన వుప్పునుండి తయారుచేయబడుచుండెడిది. నలుపు దీపపు ప్రమిదల మసినుండి గైకొనబడినది. వెలుగుచున్న దీపపు ప్రమిద మీద వెదురో, రెల్లుగడ్డియో యుంచి ఈ మసిని తయారుచేసెడివారు. ఇక ధూమ్ర పాటలాది వర్ణములు పై వర్ణములలో నొకదానితో నొకటి కలిపి తయారు చేయబడెడివి.

ఈ ప్రాచీన భారతీయ చిత్రకారులు తాళపత్రముల మీద కూడ చక్కగా చిత్రించెడివారు.

ఇట్టి మహోజ్జ్వల చిత్రకళ మన ప్రాచీన భారతీయ చిత్రకళ.

# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

మళ్ళీ విద్యాసంవత్సరం ప్రారంభమైంది. ఎక్కడ చూసినా కోలాహలం. ఈ మధ్య హైస్కూళ్ళు, కళాశాలల నిండా జన సందోహమే. కొన్ని సందర్భాల్లో ఈ జనాన్ని చూస్తే సినిమాహాలు గుర్తుకొచ్చేది. కొత్తగా విడుదలైన సినిమాకోసమా అనట్లు విద్యార్థులు, వారి తల్లిదండ్రులు బారులుతీరి నిలబడేవారు. విద్యార్థుల ప్రవేశానికి రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల ప్రకటించిన నియమాలు కొంత రద్దీ తగ్గించాయి. పూర్వంవలె ఈ సంవత్సరంప్రభుత్వకళాశాలల్లో ఇంటర్వ్యూ పద్ధతిలేదు. అలాగే సెలక్షను కమిటీలు కూడా రద్దుచేయ బడ్డాయి. ఆర్ట్సు కళాశాలల్లోని ఖాళీలలో 16 శాతం షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలవారికి ప్రత్యేకించ బడ్డాయి. 25 శాతం సాంఘికంగాను, విద్యావిషయికంగాను వెనుకబడిన వారికి ఇవ్వబడతాయి. వీరిలో షెడ్యూలుకులాలు, తెగలనుండి క్రైస్తవమతం పుచ్చుకొన్న వారుకూడా వుండవచ్చు. మరో 5 శాతం క్రీడ, తదితర రంగాలలో ప్రావీణ్యం చూపిన వారికి యిచ్చే ఏర్పాటు చేయబడింది. ఈ విధంగా విద్యార్థులను వివిధ తరగతులకు ఎన్నికచేసే విధానంలో కొంత సుళువైన మార్గం చేపట్టబడింది.

సాంఘిక జీవితంలో లౌకిక వ్యవహారాలకు జనవరినుండి కొత్త సంవత్సరాన్ని ప్రారంభిస్తాం. ప్రభుత్వ రంగంలో ఆయవ్యయాలకు ఏప్రిల్ 1 నుండి కొత్త సంవత్సరం ప్రారంభమౌతుంది. దీనినే ఆర్థికసంవత్సర మంటాం. ఇక విద్యార్థులకు కొత్తసంవత్సరం జూన్ — జులై నెలల్లో ఆరంభమౌతుంది. ఈ కాలంలో వారు తీసికొనే నిర్ణయాలు భవిష్యత్తుకు పునాదిగా పనిచేస్తాయి. కళాశాల స్థాయిలో యిట్టినిర్ణయాలు మరింత ప్రాముఖ్యం వహిస్తాయి. జీవితంలో ఏదో ఒక మార్గాన్ని త్రొక్కవలసిన సమయమిదే. విద్యార్థి డాక్టరు చదవాలన్నా, లాయరు కావాలన్నా, ఇంజనీరు డిగ్రీని పొందాలన్నా, అందుకు కావలసిన శక్తి సామర్థ్యాలను ప్రదర్శించ వలసింది ఈ సమయంలోనే. ఈ మధ్య ఒక విద్యార్థి ట్రూ కాపీలకోసం నావద్దకు వచ్చాడు. ఒక్కొక్క సర్టిఫికెట్టుకు 20 కి పైగానకళ్ళు తీయించాడు. ఇన్ని సర్టిఫికెట్లు ఏం చేస్తావని అడిగాను వూరుకోలేక. విద్యార్థి ఆదుర్దాగా చెప్పాడు :— "ఎలాగైనా యం. బి. బి.స్ చదవాలనివుంది. సీటు వస్తుందో రాదో నన్న భయంతో దాదాపు దేశంలోవున్న వైద్య కళాశాలలన్నింటికీ దరఖాస్తు పంపుతున్నాను. దయచేసి విసుగనుకోకుండా సంతకాలు చేసి ఇవ్వండి.'' ఈ చివరి వాక్యం కొద్దిసేపు ఆలోచన కల్గించింది. ఎందువల్లనంటే విద్యార్థిగా ఇలాంటి అనుభవాన్నే పొందాను. ఏదైనా సర్టిఫికెట్టుకు నకళ్ళు కావలసివస్తే దగ్గరబస్తీకి పోవడం, తీరా ఒక ఉద్యోగిదగ్గరికి వెళ్ళేసరికి ఆయన వూళ్ళో లేకపోవటమో, వున్నా నాతో పరిచయం లేదనేసరికి నవనాడులూ క్రుంగిపోయేవి. కొన్ని సందర్భాల్లోపనిపూర్తయ్యేసరికి అప్లికేషను గడువు దాటిపోయేది.

ఈ విద్యాసంవత్సరానికొక ప్రత్యేక ప్రాముఖ్యం వుంది. చైనా దురాక్రమణ జరిగి, దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడ్డాక ప్రారంభమైన తొలి విద్యాసంవత్సరం ఇది. అందువల్ల ఇప్పటినుండి విద్యార్థుల పైగల బాధ్యత మరింత ఇనుమడిస్తుంది. అత్యవసరస్థితిలో మన విద్యా విధానం కేవలం విజ్ఞానానికి, ఉపాధి సౌకర్యాలకే గాక రక్షణావసరాల కనుగుణంగా రూపొందాలి. ఆ దృష్ట్యా ప్రభుత్వం తీసికొన్న చర్యలలో మొదటిది కళాశాలల్లో యన్. సి. సి. ని నిర్బంధంగా అమలు పరచడం, ఇందువల్ల విద్యార్థులలోక్రమశిక్షణ పెంపొందడమేగాక, మాతృదేశరక్షణకు వేగంగా ముందుకు రాగలరు. యన్. సి. సి. తదితర శిక్షణ కార్యక్రమాలు ఇంతవరకు ఐచ్ఛికంగానే వుండేవి. ఇప్పటినుండి వాటిని నిర్బంధం చేయడంవల్ల విద్యార్థుల పాఠ్యక్రమానికి అంతరాయం కలుగగలదన్న సంకోచం కొంతమందికి వుండవచ్చు. దేశ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించవలసిన బాధ్యతను శరీర దారుఢ్యంగల యువతీ, యువకు లంతా పంచుకోవాలి. అందుకు కావలసిన మానవ శక్తి నంతటినీ ఈ నాడు మనం సమీకరించాలి జ్ఞానసముపార్జనతోపాటు, స్వాతంత్ర్య పరిరక్షణకు సమాయత్తమైనపుడే విద్యార్థి పరిపూర్ణమైన పౌరుడుగా రూపొందగలడు.

అత్యయిక పరిస్థితిలో విద్యార్థి బహుముఖంగా తోడ్పడవచ్చు. ఈ నాడు మన రక్షణ కృషికి, అభివృద్ధి కార్యక్రమాలకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఒక విధంగా మన అభివృద్ధి కార్యక్రమాలన్నీ రక్షణ కృషిలో అంతర్భాగాలే. అందువల్ల దేశంలో ఏర్పడిన అత్యవసర పరిస్థితి దృష్ట్యా ప్రణాళికలను రద్దుచేయాలనేవాదన బలంలేనిది. అందువల్ల రక్షణకృషి కుంటుపడుతుంది. అభివృద్ధి, రక్షణ కార్యక్రమాలకు ధనాన్ని చేకూర్చడంతో విద్యార్థులు వహించవలసిన పాత్ర ఎంతైనా వుంది. చిన్నమొత్తాల పొదుపు మొదలైన ఉద్యమాలను వారు జయప్రదంగా నిర్వహించవచ్చు. ప్రతి కుటుంబంలోను ప్రతి వ్యక్తి రోజుకు నయాపైస చొప్పున నిల్వ చేయడంలో విద్యార్థులు జయప్రదమైతే సంవత్సరానికి దేశంలో రూ 160 కోట్లధనం అదనంగా లభిస్తుంది. పొదుపు ప్రాముఖ్యాన్ని గ్రామస్థులకు, తమ తల్లిదండ్రులకు నచ్చచెప్పడంలో విద్యార్థులకు ఎక్కువ అవకాశం వుంది. అలాగే బంగారాన్ని వ్యక్తులు

(మిగతా 80వ పేజీలో)




దక్షిణ ప్రాంతీయమండలి సమావేశం హైదరాబాదులోని 'గ్రీన్‌లాండ్స్'లో 1963 మే 28వ తేదీన జరిగింది.

వికలాంగులకొరకు హైదరాబాదులో ప్రత్యేకంగా ప్రారంభించిన ఉద్యోగ సాధక కేంద్రంలోనివారు, 1963 మే 30వ తేదీన ఆ కేంద్రాన్ని సందర్శించిన కేంద్ర విద్యాశాఖ ఉపమంత్రిణి డాక్టర్ (శ్రీమతి) టి. ఎస్. సౌందరం రామచంద్రన్‌తో ముచ్చటిస్తున్న దృశ్యం.



హైద్రాబాదు జిల్లా, తాండూరు తాలూకా, మంథన్ గౌడ్‌లో రాజేంద్రకాలనీకి ఎక్సైజు, మద్యనిషేధ శాఖల మంత్రి 1963 మే 11వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.



తూర్పు గోదావరి జిల్లా రాజోలు సమీపంలో శివకోడు గ్రామంవద్దగల ఏడుతలల కొబ్బరిచెట్టు. 'కోనసీమ'లో చూడదగిన వింతలలో ఇదొకటి. ఈ ఏడుతలలకూ సమృద్ధిగా కాయలు కాస్తాయి.



పోచంపాడు ప్రాజెక్టు స్థలంలో సాగుతున్న పనులు.



పనివారలు భారీ మౌల్డ్లను తరలిస్తున్న దృశ్యం.



దియోలిలో ఉల్లాసం : దియోలిలో చైనానిర్బంధితులకోసం ఉద్దేశించిన శిబిరంలో ఒక చైనాబాలుడు ఉల్లాసంగా ఉయ్యాల ఊగుతున్న దృశ్యం.

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,05,858 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| 20 వేలు, అంతకుమించిన జనాభాగల పట్టణాలు, నగరాలు | ... | 223 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.78 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 74.90 లక్షలు |
| నికర సాగుభూమి (1959_60) | ... | 10,889,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 327 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1959) | ... | 4083 |
| విద్యుదుత్పాదన (1961) | ... | 1,026.072 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1961_62) | ... | 4084 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1960_61) | ... | 119 |
| ఉన్నత పాఠశాలలు (1960_61) | ... | 1224 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 431 |
| పంచాయతీలు (1959_60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (1_4_1962 నాటికి) | ... | 378 |
| 1960_61 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1007.51 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 90 |

# పరాక్రమించి...

ఆవంత్స సోమసుందర్

గడచిన రాత్రి పీడకలగా,
వడగాడ్పుల ఊర్పు సెయ్యగా,
కుడిచిననాళ్ల జ్ఞప్తి -
సుడిగుండము మున్గిన జీవితాశగా,
విడచిన పాము 'కూస' మయి
వీగిన వేడ్కల కోర్కెరేగగా,
బడలెను ప్రాణముల్, బడుగు వారెను
భాగ్యము తెల్లజాతిలో !
జడివానలలో తడబడి
అడుగులు సారించి, కుంచి, ఆశల మించుల్
విడివడ; వడిగానడచెను,
పిడుగుల పెనువేట కడలి ప్రిదిలిన యెదలై !

ఒక చిరుగాలి పయ్యెరగ
నుద్భవ మంది, క్రమక్రమ ప్రవ
ర్ధక లయఝంఝలై,
భయదరావముపర్వి, దిగంత దీధితీ
నికరములన్ పెకల్చి,
రజనీకర బింబముడుల్చి, నేలలో
సకల దురాగతాంధముల
సాగొనరించె నొకే తుఫానుగా !
విరిసిన కలువల కన్నులు
కరుణారహితముగ పెరికి కకవిక నగుచున్,
చరణాంగుళులను సూదుల
విరళముగా గ్రుచ్చి రెచ్చె భీతావహమై;

అది యొక కాల రాక్షస
భయంకర తాండవకేళి, దారుణా
స్పద మది వహ్నికీల,
విష పాశ మహాఽశనిపాత బంధనం
బది; హృదయోత్సవామల
సుహాసమయూరము కూల్చ వేచుకొ
న్నది, నలు దిక్కులన్ ముసలి
నల్లని చీకటి ధూళి రాల్చుచున్.
క్రుంగి కృశియించి యెదల పంపంగి తోట
ఇటులనే వేగి, దుఃఖాగ్ని పటలిఁగ్రాగి,
క్రొత్త కోర్కెల చివురాకు లెత్తకుండ
ఈ మహాధ్వాంత నైరాశ్య మేల కలిగె !

చీకటి మూకలన్ పెనగి
జీర్ణములైన విశుద్ధ మానసా
నీకము లిట్టులే చివికి
నీరసిలన్ వలెనే ? ప్రభాకరా
స్తోకము సోకదే ? హృదయ
శోకము డుల్లదె ? ఈ వికార బా
ధాకులమై విశీర్ణమయి
ధ్వాంతనిశీథుల దాస్య మార్చదే ?
కలలో నడచెను, జడిసెను,
వలిగాడ్పుల వడికి మనికి వసివాళ్వా యెన్;
కలతలు బానిస జాతికి
బలవంతపు టిరుల బరువు బండల నెత్తెన్;

ఎంతని చెప్పగలాడను ?
పంతము తో - జృంభమాన పైశాచికతన్;
స్వాంతము పెంచిన దౌష్ట్యము
చింతల మొలిపించు టరిదె? చితికిన యెదలన్.

పొగిలెను లేత గుండియలు,
పోడిమి తగ్గెను జవ్వ నాలకున్,
మిగిలెను బొగ్గు ప్రోవులుగ
మేలిమి కోర్కె పసందు పంటలే,
రగిలెను : ఆశలే, కుసుమరాగ
పరాగ మయూఖ రేఖలే;
పొగరు తమస్సులన్ ఎదిరి
పోరగ లేని అనైక్య జాతిలో !

పొగిలి పొగిలి పొగల సెగజిమ్మి హృదయాలు
వగల సెగల సోలి వదరి బెదరి -
బ్రతుకె బరువు కాగ, వెతలనోర్వగలేక
మట్టి రూపుతొడిగి మడసినారు !

అట్టి మట్టి జనుల నట్టిట్టు కదిలించి
మంత్ర జలము చల్లి మానవులుగ
మార్చగలుగు బక్క మానిసి డొకనాడు
పుట్టు నన్న మాట పొసగ కునికి !

రక్కసి మూకలు పెట్రిలి
నిక్కుచు నీల్గుచును నిజము నెరుగని మౌఢ్యం
బెక్కుడు కాగా క్రౌర్యం
బొక్కటి ఆయుధ మనుకొని మోహాంధులునై !

మేదురహాసముల్ బరపి,
మేదిని కేపతులైన రీతిగా
నాదము సల్పుచుండగ -
వినాశన హేతువు తోచె, చేరువన్

మోదుగ చెట్లు పూసినవి
ముద్దియ మోమున రాగ రేఖలై,
పదరహాసమో చదల
నేర్పడె కాట్టుక కన్ను లెత్తుచున్.

అలజడి రేగి జీవిత
విహాయసమున్ వికసించె తారకల్;
వలపుల గోరు వెచ్చని ప్రభాత
మెదో హృదయాంతరాళ మం
దలరెను; పచ్చి కోర్కెలు
సహాసము లేర్చెను; జానిసీళ్లలో
మొలచెను నవ్య చేతనము;
మోసులు వారెను కాంతిపుంజముల్ !

అపుడె నిశాంతమయ్యె,
అరుణారుణ రోచులు తోచె తూర్పులో
అపరిమితాంధ సాంద్ర తిమి
రాగ్రముత్రెళ్ళె, నవాశవిచ్చె, దూ
రపు బయలందు జానిసలె
రౌతులుగా రణరంగ వీరులై
విపుల మనోజవమ్ము
ప్రభవించ గమించిరి మేరు ధీరులై !

నిరాకరించి జీవితాల
నిద్రలోన ముంచగన్ -
పరాకు చెప్పుకొన్న జాతి
పారద్రోల శత్రులన్;
తరించి బాధలన్,
గతాను తాపమున్, పరాంధమున్;
పరాక్రమించి మించినారు -
పాంచజన్య ధారులై !

['చైతన్య భారతి' నుండి]

చైనా, భారతభూభాగాలపై విద్రోహకరంగా జరిపిన దాడుల ఫలితంగా అత్యంత ప్రాముఖ్యతగల అనేక సమస్యలు ఉత్పన్నమయ్యాయి. రాజకీయ, సైద్ధాంతిక విషయకంగా ఈ దురాక్రమణ మన ప్రజాస్వామిక విధానానికి ఒక సవాలుగా, మన జీవన సరళికి ఒక బెదిరింపుగా వుంది. పోతే సాంఘిక విషయకంగా ఇది మన గౌరవప్రదమైన విలువలకూ, సాంఘిక వ్యవస్థకూ ప్రమాద హేతువుగా కూడా వుంది. (అంతర్జాతీయంగా కమ్యూనిజం వ్యాప్తికి "విప్లవాన్ని ఎగుమతి" చేయడాన్ని ఉత్తమ సాధనంగా కమ్యూనిస్టులు విశ్వసిస్తారు కాబట్టి) నీతి బాహ్యుడు, శక్తివంతుడు అయిన పొరుగువాడు కుట్రతో జరిపిన ఈ దురాక్రమణ వల్ల ఆర్థికంగా చాలా తీవ్ర పరిణామాలు కలుగుతాయి. ముఖ్యంగా ప్రజాస్వామిక ప్రణాళికా విధానం ద్వారా మనం సాధిస్తున్న అభివృద్ధికి ఇది తీవ్ర విఘాతం కలిగిస్తుంది.

వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో మనం తలపెట్టిన అభివృద్ధి సాధన భారీ ఎత్తున పెట్టుబడి పెట్టడంపై ఆధారపడి వుంటుంది. కాని చైనా దురాక్రమణ ఫలితంగా ఈ సవాలును ఎదుర్కొనేందుకై దేశ రక్షణ ఉత్పత్తిని పెంపొందించడానికి మన సాధన సంపత్తిలో కొంత భాగాన్ని వినియోగించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఇంతేగాక ఆధునిక సైనిక సాధన సామగ్రి, ఆయుధాలను కూడా దిగుమతి చేసుకోవడం అవసరమవుతుంది. ఇందువల్ల దిగుమతుల నిమిత్తం ఇదివరకే మనం కేటాయించిన కొద్దిపాటి విదేశీ మారకం ఖర్చయిపోతుంది. ఈవిధంగా దేశంలో వెచ్చించే సాధన సంపత్తినే గాకుండా విదేశాలలో ఖర్చు చేయదగిన సాధన సంపత్తిని కూడా పరిగణించ దగినంతగా వినియోగించుకోవడం జరుగుతుంది. కాబట్టి మన అభివృద్ధి ప్రణాళికలు సాగకుండా చేసి ప్రణాళికాబద్ధంగా మనం సాగిస్తున్న అభివృద్ధి కృషికి అడ్డుతగలడానికే చైనా ఈవిధంగా




పి. యల్. సంజీవరెడ్డి

దురాక్రమణకు దిగిందనే విషయాన్ని ఎవ్వరైనా ఊహించగలుగుతారు.

అలీన విధానానికి కట్టుబడివున్న భారతావని వంటి ప్రజాస్వామిక దేశంపై, సామ్యవాద దేశంగా వ్యవహరిస్తున్న ఒక దేశం దాడి జరపడం ఇదే మొదటిసారి. రాజకీయ వ్యవస్థ, ప్రజోత్సాహం, పెట్టుబడి విధానాలపై దీని ప్రభావం ఎలా వుంటుందో శ్రద్ధగా గమనించాలి. ఒక ప్రజాస్వామిక దేశం సమయోచితమైన ధైర్య సాహసాలు ప్రదర్శించి సవాలును ఏవిధంగా ఎదుర్కొనగలిగేదీ, యుద్ధంవల్ల ఉత్పన్నమయ్యే పరిణామాలను ఏవిధంగా తట్టుకోగలిగేదీ తెలుసుకోవాలి.

ఐక్యరాజ్య సమితిలో చైనా హక్కులకై భారతదేశం వాదించినంత గట్టిగా మరే దేశమూ వాదించలేదనే విషయం గమనార్హం. అయితే మరీ ఆశ్చర్యకరమైన విషయమేమంటే భారతదేశం చేసిన ఈ మేలుకు ప్రతిఫలంగా చైనా గొప్ప కీడు తలపెట్టింది.

## చైనీయుల అంతరార్థం

చైనా కమ్యూనిస్టు పాలకులు కేవలం అక్కడి మూల సమస్యలకు, సంస్కృతికి, ప్రజలకు వ్యతిరేకంగా పోరాటం సాగించడమేగాకుండా --స్వేచ్ఛాయుతమైన ఆసియాతోకూడా పోటీ పడ్డారు. 1954 వ సం॥ లో ఆసియా రాజ్యాల (థాయ్‌లాండ్, ఇండియాలోని కొన్ని ఉత్తర రాష్ట్రాలు వగైరా) పై తొలిసారిగా సైనిక చర్యలు గైకొనడం, వాటిపై నేరుగా ఒత్తిడులు తేవడం జరిగింది. ఇతర దేశాలను కూడా కమ్యూనిజం పరిధిలోకి తేవాలన్నదే వారి అభిమతం.

అక్సాయ్ చిన్ ప్రాంతం గుండా సింకియాంగ్, పశ్చిమ టిబెట్టుతో తమకుగల రవాణా మార్గాలను చైనావారు అభివృద్ధి పరుచుకోవడంలో ఒక అంతరార్థమున్నట్లు తెలుస్తున్నది. సింకియాంగ్‌లో పారిశ్రామిక శక్తి సంపద మిక్కుటంగా వుంది. కనుక

చైనా దృష్టిలో ఈ ప్రాంతానికి చాలా విలువ వుంది. చైనాకు చమురు కొరత వుండడం కూడా దీనికి ఒక కారణం. సింకియాంగ్ చమురుకు చాలా ప్రసిద్ధిగాంచింది. అచ్చట ఏటా 1½ మిలియన్ టన్నులకు పైగా చమురు లభిస్తుంది. ఇంతేగాక ముడి ఇనుము, బొగ్గు కూడా పుష్కలంగానే దొరుకుతాయి.

ఆకలిగొనివున్న అసంఖ్యాకమైన తమ జనాభా కొరకు క్రొత్త భూభాగాలను ఆక్రమించుకొని తమ దేశ సరిహద్దులను విస్తృతపరచాలన్నదే చైనావారి ఆకాంక్ష. 1958 లో బృహత్తర అభివృద్ధి ప్రణాళిక విఫలమైంది లగాయతు చైనా ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్థంగా తయారైంది. అత్యవసర వినియోగ వస్తువులకు తీవ్రమైన కొరత ఏర్పడింది. ఈ పరిస్థితి మూలంగా దేశంలో ఆర్థిక, సామాజిక రంగాలలో తీవ్ర అసంతృప్తి పరిస్థితులు ఏర్పడ్డాయి. అసంతృప్తి జెందివున్న ప్రజలను ఏకోన్ముఖంగా గొప్ప త్యాగాలు చేసేందుకై బలవంతపెట్టడానికి బాహ్యంగా ఒక శత్రువును సృష్టించుకోవడమే వారికి శరణ్యమైంది.

1959 వరకూ చైనా దళాలు భారత సరిహద్దులలో కొద్దిఎత్తున దాడులు జరుపుతూ వచ్చాయి. కాని చైనా బూటకపు మ్యాపులను చూపి వితండ వాదానికి దిగిన తరువాతనే సరిహద్దు వివాదం తీవ్రరూపం దాల్చింది.

చైనా యుద్ధ విరమణను ప్రకటించిన ఫలితంగా తాత్కాలికంగాఏర్పడిన స్తబ్దతవల్ల మనం ప్రమాదం లేదనుకోరాదు. ఈ సందర్భంలో మావ్-సె-టుంగ్ సూత్రాన్ని గుర్తుంచుకోవాలి. "శత్రువు పురోగమిస్తే మనం తిరోగమిద్దాం, శత్రువు చుట్టుముట్టినట్లయితే, అతన్ని బాధలుపెడదాం, శత్రువు అలసిపోయినట్లయితే, మనం దాడి చేద్దాం, శత్రువు తిరోగమిస్తున్నట్లయితే మనం అతన్ని వెంటాడుదాం'' అని ఆయన సూత్రీకరించారు. ఇది ఆయన ఆలోచనా విధానాన్ని ప్రతిఫలింప జేస్తున్నది.

చైనా సైనిక శక్తి, కుయుక్తులు, సామ్రాజ్య విస్తరణ కాంక్ష దృష్ట్యా, పాకిస్తాన్‌తో ఇటీవల అపవిత్రమైన ఒప్పందం చేసికొని కీలక ప్రాముఖ్యం గల ప్రాంతం పొందిన దృష్ట్యా దేశం దీర్ఘకాలిక పోరాటానికి సన్నద్ధం కావాలి. భారత చైనా ఆర్థిక స్థితిగతులను పోల్చి చెప్పడానికీ, జనాభా జాతీయాదాయం, వ్యవసాయోత్పత్తులలో జరిగిన పెరుగుదలలనూ, కొన్ని కీలక రంగాలలో జరిగిన ఉత్పత్తి పెరుగుదలలనూ, పోల్చి చూపించడానికి ఈ దేశాల రక్షణ వ్యయాలను వాటి జాతీయాదాయాలను గురించి వివరించడానికీ ఈ వ్యాసంలో ప్రయత్నించడం జరిగింది. ఈ సమస్యల బృహత్పరిమాణాన్నీ, శత్రువు సవాలును సమర్థంగా ఎదుర్కోడానికి మనం చేయవలసిన కృషి తీవ్రతను గురించి సక్రమంగా మదింపు చేయడమే ఈ విషయాలన్నింటినీ వివరించడంలో గల ప్రధానోద్దేశం.

చైనా విస్తీర్ణం 95,61000 కిలోమీటర్లు, కాగా భారతదేశ విస్తీర్ణం 32,6337 కిలోమీటర్లు. 1958 వ సం॥లో చైనా జనాభా 669 మిలియన్లు వుండగా ఇండియా జనాభా 397 మిలియన్లు. అంటే వారు మనకంటే మూడింతలు ఎక్కువ విస్తీర్ణం కలిగివుండి (1958 లో) మనకంటే రెట్టింపు జనాభా కలిగివున్నారన్నమాట. 1956 వ సం॥లో భారతదేశపు మొత్తం జాతీయాదాయం 11300 కోట్లు కాగా చైనా జాతీయాదాయం దాదాపు 18700 కోట్లు. చైనా జాతీయాదాయం 1952 లో 25.8 బిలియన్లు కాగా 1957 నాటికి అది 38.5 బిలియన్లకు పెరిగింది.

సాధారణ ధరలలో 1952 వ సం॥లో జాతీయాదాయం 25.8 బిలియన్లు వుండగా అది 41.5 బిలియన్లకు హెచ్చింది. అంటే దాదాపు 61.2 శాతం పెరుగుదల ఏర్పడిందన్నమాట.

భారతదేశ జాతీయాదాయం 1952 వ సం॥లో 9820 కోట్లు వుండగా 1957 వ సంవత్సరం నాటికి ఇది 15.9 శాతం చొప్పున 11390 కోట్లకు పెరిగింది. (సాధారణ ధరలననుసరించి) ధరలు నిలకడగా వున్నప్పుడు (1948-49) 1952 వ సంవత్సరంలో జాతీయాదాయం 9460 కోట్లు వుండగా 1957 వ సంవత్సరం నాటికి 15.1 శాతం చొప్పున 10890 కోట్లకు పెరిగింది. దీనినిబట్టి చైనా మొత్తం జాతీయ ఉత్పత్తి సంవత్సరానికి 8 శాతం చొప్పున పెరగ్గా ఇండియా మొత్తం జాతీయ ఉత్పత్తి 3 శాతం చొప్పున మాత్రమే పెరిగినట్లు తెలుస్తున్నది.

(తరువాయి వచ్చే సంచికలో)



## విద్యుచ్ఛక్తి

1963 మార్చిలో ఆంధ్ర ప్రాంతంలోని 12 గ్రామాలకు, తెలంగాణా ప్రాంతంలోని 7 గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలను కలుగజేశారు.

తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం క్రింద ఈ నెలలో పురోగతి ఈ విధంగా వుంది :—

(అ) *తాడేపల్లి — హైద్రాబాదు 132 కె. వి. లైను* :—త్రవ్వకాలు 20, స్టబ్‌ల స్థాపన, కాంక్రీటు పని 60, మట్టిపని 20

(ఆ) *నాగార్జున సాగర్ — హైద్రాబాదు 132 కె. వి. లైను* :—విద్యుద్వాహక తంతుల బిగింపు 5.85 మైళ్ళు; ఎర్త్ వైర్‌ల బిగింపు 5.85 మైళ్లు

(ఇ) *రామగుండం బాయిలర్* .— కంపెనీ నుంచి డిజైనులు (సివిల్ ఫౌండేషన్,) అందాయి.

(ఈ) *హుసేన్‌సాగర్ బాయిలర్*:—దేశీ పరికరాలలో 60 శాతం వస్తువులు ప్రాజెక్టు స్థలానికి చేరాయి.

ప్రీఫిల్టరైజేషన్ ప్లాంట్, ముఖ్య బాయిలర్ కేంద్రం సివిల్ పనులు జరుగుతున్నాయి. బాయిలర్ తదనుబంధ యంత్రాలను అమర్చేపనులు కూడా చురుగ్గా జరుగుతున్నాయి.

(ఉ) *రామగుండం వద్ద కూలింగ్ టవర్*:— సివిల్ పనులు దాదాపు పూర్తయ్యాయి. చల్లనీటి గొట్టాలను వేసే పనులను చేపడతారు.

(ఊ) *త్రిమల్‌గిరి డీ సెల్ స్టేషను* : వాడకం అధికంగా జరిగే సమయంలో సహాయకారిగా వుండడానికి దీనిని కొన్ని గంటలపాటు నడుపుతున్నారు.

నెల్లూరు నుంచి హైద్రాబాదుకు 2.5 ఎం డబ్ల్యు. సెట్ల తరలింపు. వి. కె. ఎం. బాయిలర్‌ను విప్పి రవాణా చేయడానికై ప్రాథమిక ఏర్పాట్లు చేస్తున్నారు.

తుంగభద్ర—నెల్లూరు హైడ్రోథర్మల్ పథకం క్రింద ఈ నెలలో దిగువ పని జరిగింది :—

(అ) *హంపి–గుత్తి 132 కె. వి. లైను:* త్రవ్వకాలు 40, స్టబ్‌ల స్థాపన 30, కాంక్రీటుపని 30, సూపర్ స్ట్రక్చర్ల స్థాపన : 51

(ఆ) *గుత్తి–కడప 132 కె. వి. లైను:* త్రవ్వకాలు: 60, స్టబ్‌ల స్థాపన, కాంక్రీటు పని: 40; టవర్ల స్థాపన 40




*ట్రాన్స్‌మిషన్ డిస్ట్రిబ్యూషన్ పథకం:* ఎగువ సీలేరు—నాగార్జునసాగర్ 220 కె. వి. లైను పనులు అమలు జరుగుతున్నాయి. ఎగువ సీలేరు-కొత్తగూడెం రీచ్ సర్వేపని ఆరంభమైంది.

నమూనా టవర్ల డిజైన్లు, డ్రాయింగులను స్థిరీకరించడం పూర్తికావచ్చింది. స్టబ్‌లను తయారుచేసే పనులనుచేపట్టారు.

నాగార్జునసాగర్ 220 కె. వి. సబ్ స్టేషను కొరకు ఆర్డరు చేసిన ట్రాన్స్‌ఫార్మర్లు, స్విచ్ గేర్లకు సంబంధించిన 10 శాతం అడ్వాన్సు చెల్లింపులను స్విస్ పరపతి సౌకర్యం క్రింద విడుదల చేశారు.

ఏడు 15. ఎం. వి. ఏ/25 ఎం. వి. ఏ. 132 కె. వి. ట్రాన్స్‌ఫార్మర్ల—గరివిటి గుణదల, బొమ్మూరు, నిడదవోలు ల కొరకు—కై అందిన టెండర్లు పరిశీలనలో వున్నాయి.

*చిత్తూరు జిల్లా పథకంతో సహా తుంగభద్ర జల విద్యుత్ పథకం*: హంపి, గుత్తి, కడప, నెల్లూరు సబ్‌స్టేషన్లకు బస్‌బార్ ఇన్సులేటర్లు, స్విచ్‌లు, ఎర్త్ కనక్షన్లు, కంట్రోల్ పానల్స్ కొరకు త్వరలో ఆర్డర్లను జారీ చేస్తారు. వీటిని స్థిరీకరించడం జరిగింది

'ఎస్' పరపతి సౌకర్యం క్రింద హంపి, గుత్తి, కడప, నెల్లూరు సబ్‌స్టేషన్ల కొరకు ఆర్డరు చేసిన ట్రాన్స్‌ఫార్మర్ల ఉత్పత్తి జరుగుతున్నది.

పైన పేర్కొన్న పరపతి సౌకర్యంక్రింద కడప సబ్‌స్టేషను నిమిత్తం ఆర్డరు చేసిన 2×2.5 ఎం. వి. ఏ. సింక్రోనస్ కండెన్సర్ల ఉత్పత్తి జరుగుతున్నది.

1963 నవంబరులో వీటిని బహుశా ఓడలో పంపడం జరగవచ్చు.

రేణిగుంటలో రెండవ 3 ఎం. వి. ఏ. సింక్రోనస్ కండెన్సర్ స్థాపన నిర్ణీత కార్యక్రమం ప్రకారం పూర్తయింది.

*కొత్తగూడెం థర్మల్ పథకం : (ట్రాన్స్‌మిషన్ భాగం మాత్రం)* కొత్తగూడెం, వరంగల్, రామగుండం, వరంగల్ 132 కె. వి. డి. సి. లైనుల సాధన సామగ్రి కొరకు సమగ్ర ఎస్. పి. ఓ. సిద్ధం చేయబడుతుంది.

*మాచర్ల సిమెంటు ఫ్యాక్టరీకి, నాగార్జున సాగర్ పనులస్థలానికి సరఫరాల విస్తరణ :* గుండాలవద్ద రెండు 7.5 ఎం.వి.ఏ. సింక్రోనస్ కండెన్సర్ల స్థాపన పూర్తయింది. కంపెనీ తాలూకు ఎరక్టర్ ప్రాజెక్టు స్థలంవద్ద వుంది.

## పది జిల్లాలలో సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అమలు

దేశంలో గత కొన్ని సంవత్సరాల నుంచీ బియ్యం సరఫరా పరిస్థితి ఇబ్బంది కరంగా వుంటున్నది. దేశంలోని బియ్యా మైతేనేమి, దిగుమతి అయిన బియ్యమైతే నేమి ప్రస్తుత అవసరాలకు మాత్రమే సరిపోతాయి. కనుక దేశంలో బియ్యం నిలువలను పెంచే ఉద్దేశంతో వరి ఉత్పత్తిని పెంపొందించడానికి భారత ప్రభుత్వం ప్రత్యేక చర్యలు సూచించింది. దేశం లోని నిర్ణీత జిల్లాలతో తృతీయ ప్రణాళిక మిగిలిన సంవత్సరాలలో 1963 ఖరీఫ్ కాలంనుంచి తీవ్రతరంగా వరి సేద్యానికి ఒక కార్యక్రమాన్ని చేపట్టాలని భారత ప్రభుత్వం కోరింది.

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వరి పండించే రాష్ట్రం కాబట్టి, ఈ కార్య క్రమాన్ని దిగువ పది జిల్లాలో అమలు పరచడానికి రాష్ట్రప్రభుత్వం పూను కున్నది: తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, నిజామాబాదు, వరంగల్, కరీంనగర్, మహబూబ్‌నగర్.

పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్ర వ్యవసాయ కార్యక్రమం సాధించిన సత్ఫలితాలను పురస్కరించుకొని వరితో పాటు జొన్న, రాగులు, చెరకు, వేరు సెనగ, ప్రత్తి, అరటి, కూరగాయలను కూడా ఉత్పత్తులను పెంపొందించే ఉద్దే శంతో ఈ సవరించిన కార్యక్రమంలో చేర్చారు.

పైన పేర్కొన్న పది జిల్లాలలో నిర్ణీత మైన 150 బ్లాకులలో ఈ కార్యక్రమాన్ని అమలు పరుస్తారు.

మొదటి సంవత్సరంలో పైన తెలిపిన ప్రతి పంట విషయంలోనూ 40 శాతం విస్తీర్ణానికి, రెండవ సంవత్సరంలో 70 శాతం విస్తీర్ణానికి, తృతీయ ప్రణాళి కాంతానికి పూర్తి విస్తీర్ణానికి ఈ పథ కాన్ని వర్తింపచేస్తారు.

ఈ పంటల ఉత్పత్తిలో మొత్తం మీద 20 శాతం పెంపుదలను సాధించడాన్ని ఈ పథకం లక్షిస్తున్నది.

నిర్ణీత బ్లాకులలో రైతులకు దిగువ సౌకర్యాలు కలిగిస్తారు :—

*1. మేలు జాతి విత్తనాలు :*

రైతుల వ్యవసాయ క్షేత్రాలలో మేలుజాతి విత్తనాల ఉత్పత్తి జరుగు తుంది. రైతులను ప్రోత్సహించేందుకై వీటిని ఉత్పత్తి చేసినందుకుగాను మణుగు ఒక్కంటికి రూ. 2/- ల చొప్పున సబ్సిడీ ఇస్తారు. ఈ ఖర్చును రాష్ట్రకేంద్ర ప్రభు త్వాలు సమంగా భరిస్తాయి.

*2. క్రిమి సంహారక మందులు :*

తెవుళ్ళను అరికట్టేందుకై రైతులకు రూ. 9 లక్షలు విలువచేసే క్రిమి సంహా రక మందులు ఇవ్వడానికి తలపెట్టారు. వీటిని 50 శాతం సబ్సిడీ రేట్లకు సరఫరా చేస్తారు.

3. క్రిమి సంహారక మందులతో పాటు స్ప్రేయర్లు, డస్టర్లు మొదలైన మొక్కల సంరక్షణ సాధనాలను కూడా 50 శాతం సబ్సిడీ రేట్లపై సరఫరా చేస్తారు. సబ్సిడీకిగాను ప్రతి బ్లాకుకు రూ. 500/- ల చొప్పున మొత్తం రూ. 75,000 లు కేటాయించారు.

*4. ఆధునిక పనిముట్లు :*

మూడు లక్షల రూపాయిల మేరకు ఆధునిక వ్యవసాయ పనిముట్లను పంపిణీ చేయడానికి ప్రతిపాదించారు. వీటిధరలో 25 శాతం మేరకు భారత ప్రభుత్వం సబ్సిడీ ఇస్తుంది.

## రహదార్లు

*కాకినాడలో ఉప్పుటేరుపై వంతెన :*

కత్తిపూడి – నర్సాపురం ఫెర్రీరోడ్డు ఈ జిల్లాలోని ప్రధాన రోడ్లలో ఒకటి. తూర్పుగోదావరి జిల్లాలోని సంపన్నమైన ప్రదేశాలగుండా, రాజోలు, అమలాపురం, కోటిపల్లి, ద్రాక్షారామం, కాకినాడ, పిఠాపురం మొదలైన ప్రధాన పట్టణాల మీదుగా ఇది వెళ్తుంది. అయి దవ జాతీయ రహదారిని కత్తిపూడి వద్ద ఈ రోడ్డు కలుస్తుంది. ఇది కాకినాడ మునిసిపల్ హద్దులలో సంవత్సరం పొడ వునా ప్రవహించే ఏటిని దాటుతుంది. దీనిని స్థానికంగా ఉప్పుటేరు అంటారు. దీనిలోతు 13 అడుగులు (గరిష్ఠ) ఆటుపోటులప్పుడు ఈ లోతులో 6½ అడుగుల వరకు వ్యత్యాసం ఏర్పడు తుంది. పోత ఉక్కు స్తంభాలపైగల పాత ఇనుప బారు దూలపు వంతెన ఉప్పు తిని చెడిపోయినందువల్ల దీనిస్థానే మరో వంతెనను నిర్మించవలసిన అగత్యం కలిగింది.

కేంద్ర రోడ్డు నిధి పథకం క్రింద ఉప్పు టేరు పై సుమారు రూ. 13.2, లక్షల వ్యయంతో కొత్త వంతెన నిర్మించడానికి

మంజూరు చేశారు. ఈ వంతెన పనికి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి 1958 ఏప్రిల్ 3 వ తేదీన శంకుస్థాపన చేశారు.

ఈ వంతెనకు రెండుచివరలా 91 అడుగుల 6 అంగుళాల "స్పాన్" లు రెండు, మధ్యన 122 అడుగుల "స్పాన్" ఒకటి వుంటాయి. స్తంభాలకు 90 అడుగుల లోతుగా పునాదులు త్రవ్వారు. ప్రతి స్తంభానికి అడుగున వలయాకారపు బావులను రెండింటిని నిర్మించారు. బాహ్యంగా వీటి మధ్యరేఖ పొడవు 18 అడుగులు. రెండు బావుల మధ్య ఎడం 8 అడుగులు. ఈ రెండు బావులను కలుపుతూ పైన 4అడుగుల మందాన ఆర్.సి.సి. స్లాబ్ వేశారు. ఈ వంతెన కాకినాడ పట్టణం మధ్యలో వుంది కాబట్టి అందంగా కనిపించేందుకు స్తంభాలను ఓడ ఆకారంలో నిర్మించ్చారు. వంతెన పైన 12 అడుగుల మందాన, అడుగున 4 అడుగుల మందాన, ఆర్. సి. సి. స్తంభాలు వేశారు. అండగోడలు, 13 అడుగులు × 13 అడుగుల వెలుపలి కొలతగల్ల అయిదు "క్రైసన్స్" తో వున్నాయి. ఒక్కొక్క "క్రైసన్" మధ్యదూరం 1. అ. 6 అం. వీటికి ఒక అడుగు మందాన గోడలుకూడా వున్నాయి. ఈ అయిదింటినీ కలుపుతూ పైన 2 అడుగుల మందాన కాంక్రీట్ స్లాబు వేశారు. దూలాల క్రింద, అండగోడలపైన "ఆర్. సి. సి. రాకర్ బేరింగుల"నూ, స్తంభాలపైన ఫిక్సిడ్ బేరింగులను ఉపయోగించారు.

వంతెనపైన 42 అడుగుల వెడల్పున రోడ్డు మార్గం వుంది. రోడ్డుకు ఇరువైపులా 8 అడుగుల కాలిబాటలు వున్నాయి. వీటితో కలుపుకొని రోడ్డు మార్గం మొత్తం వెడల్పు 58 అడుగులు. ఎగువ భాగం కట్టడంలో రెండువైపులా చివరన 91 అడుగుల 6 అంగుళాల 'స్పానులు' రెండు వున్నాయి. వీటికి 15 అడుగుల కాంటిలివర్స్ వున్నాయి. 92 అడుగుల మధ్యస్పానుకు ఇవి ఆధారంగా వుంటాయి. 10 కాంక్రీట్ బారు దూలాల ఆధారంగా రోడ్డు మార్గం నిర్మించారు.

తరువాతి సంవత్సరాలలో నిర్మాణ పరికరాల వ్యయం, కూలీ రేట్లు పెరిగిపోయినందువల్ల వంతెన ఖర్చు రూ. 20.00 లక్షలకు హెచ్చింది. ఈ వంతెన కాకినాడ మునిసిపల్ హద్దులలో వున్నది కాబట్టి దీని అంచనా వ్యయంలో 27½ శాతం మొత్తాన్ని కాకినాడ మునిసిపాలిటీ భరించింది

రాష్ట్రప్రభుత్వ భవనాలు కమ్యూనికేషన్ల శాఖా మంత్రి శ్రీ మీర్ అహ్మద్ అలీఖాన్ 1963 మే 22 వ తేదీన ఈ వంతెనకు ప్రారంభోత్సవంచేశారు. ★

# శ్రీనాథయుగము: అన్యదేశ్యములు

తూమాటి దోణప్ప

(గత సంచిక తరువాయి)

*72.* మసీదు: ముస్లిముల ప్రార్థన మందిరము." కర్తారుఁడుండు తుర్కల మసీదు" (క్రీ.డా. 149) యయాతి చరిత్రా ద్యర్వాచీన కృతులలో ఈపదము విరివిగాఁ బ్రయుక్తము. < పారసి. మస్జిద్ = ప్రార్థన మందిరము; మసాజిద్ = మసీదులు ప్రణిపాతము నందలి సప్తావయవములు. చేతులు, కాళ్ళు, మోకాళ్ళు, నుదురు, సుజూద్ = షోణితలంబు నెన్నుదురు సోఁక మ్రొక్కుట; సజ్జాద్ = ఉపాసకుఁడు; సజ్జాద = పూజా సమయమున ముస్లిములు సాష్టాంగ పడుటకుపకరించు తివాసి లేక చాప; సాజిద్ = పూజ; ఉపాసన; సుజ్జద్ = భక్తులు; సిజ్‌ద = ఉపాసన; అరబ్బీ. మస్‌జిద్ = పూజా స్థలము సుజూద్ = సర్వాంగాలింగిత నమస్కారము.

*73.* మాలిమి: ఓడ నడపు శాస్త్రము నెఱిఁగినవాఁడు. నావికుడు. 'ఏలికయాత్మ బుద్ధిఁదనకించుకదోఁపవి కార్య మాప్తుఁడై చాల వివేకియైన ఘనసన్నిధి నూహ యొనర్పనేర్చినన్ బోలఁగ నెల్లభంగులను బొందగుచుండు విఘాత దూరతన్ మాలిమి చేతవోడ జతనంబుగఁ దీరముచేరుచందమై' (నా. పంచ. సంధివి. 61). "అలర శ్రీ వెంకటేశుఁడవియేటి మాలిమి నలుదిక్కులకు నోడనడపఁగాను మురిగెధర్మార్థకామ మోక్షధనముగడించి పలుమారు జీవుఁడనే మరకాఁడు" (తాళ్ళ. అధ్యాత్మ. ix. 99). "శీలంబు నడపించుమాలిమి సంచలింపని మానసంబది బరువుగాగ...మురారి చరణ రాజీవగౌరవంబను పేరోడ గలిగె నేమి (వరాహ. 5-76) < మరాఠీ. మాలీమ = కర్ణధారుఁడు: నావికుఁడు; గుజరాతీ. మాలమ = కర్ణధారి; తోడి నావికుఁడు పారసి. మల్లాహీ నావికా సంబంధి: మిలాహత్ = నౌకాయానము; ము: అల్లిమీ = బోధకుడు; కర్ణధారిత; ము. అల్లిమ్. కర్ణధారి; అరబ్బీ. ము. అల్లిమ్ = నావికాశాస్త్రము; మల్లాహ్ = నావికుఁడు; మల్లాహి = నౌకాయానము; తమిళము. మాలిమి, మాలుమి = కర్ణధారి; మాలుమి చాస్తిరమ్ = నావికాశాస్త్రము.

ముఖమల్లు: చూ. ముఖమాలు. 'అంతట కింకరులతివేగముసను...ముఖమల్లుగుడ్డలు మునుకొనితెచ్చి పరచి పీఠముమీద బాగైన దిండ్ల - ఉంచిన గనుగొని...' (పల్నాటి. పు. 17).

*74.* ముఖమాలు: రూ. ముఖమల్లు. ఒత్తుగా మెత్తగానుండు ఒక తరహా పట్టు గుడ్డ: దేశాంతర వస్త్రవిశేషము, వెల్వెట్. 'ముఖమాలుపట్టలు మొగములగట్టి-అందెలు పదములనాయత్తపరచి...సకల జాత్యశ్వాళి సవరణచేయ' (పల్నాటి. పు. 29).— కూర్చినగంతలు క్రుదురుగావెమ్మ-పైగప్పి ముఖమాలు పరపులు వేసి...' (పైది. పు. 30) < పారసి. మఖ్‌మల్, మిఖ్‌మల్ = వెల్వెట్; ముఖ్‌మల్ = బొచ్చుదుస్తులు; మఖ్‌మలీ = వెల్వెట్‌తో చేసిన; వెల్వెట్‌వంటి.

*75.* మేకు: గూటము. చీల. '...మేకులు గామెఱయుచు...' (వరాహ. 6-84) < మరాఠీ. మేఖ = గుంజ, గూటము; పారసి మేఖ్ = గూటము; మేకు, దేరాగూటము; సూది; గుల్ మేఖ్ = రోజా పూవునుబోలినబొడిపెగలమేకు; తెలుఁగున 'ఏకై వచ్చి మేకై కూర్చున్నాడు' అనుపలుకు బడి అర్వాచీనము. దేశ్యమని బ్రౌణ్యము. పు. 804 అన్యదేశ్యమని మిశ్రబ్రౌణ్యము. పు. 98.

*76.* మైజారు: ఆఁడుదాని కట్టుఁగొంగు. చీర మొదటికొంగు; పైఁటకొంగు అను నర్థము (సూ. ని. vi, 581) చింత్యము. 'పూజారివారి కోడలు తాజాలుఁగ బిందెజాఱి దబ్బునఁబడియెన్ మైజారుకొంగు దడిసిన బాజారే తిరిగిచూచి పక్కుననవ్వెన్ (శ్రీనా. చాటువు) < పారసి. మి' జర్ = ఇజారు: మొనకుకట్టుకొను వస్త్రము; మై ( = మేను) + జాఱు = ఒడలినుండి జాఱెడునది కాఁబోలను భ్రాంతితో మన నిఘంటుకారులు చేసినవిఋపు. చెప్పిన అర్థము నిరాధారము. ఇట్లే పాదరక్షయను నర్థముకల పారసి 'పైజారు' పదమును పై + జాఱు అని

విడదీయుటయు నిర్మూలకము పైజారు, మైజారు – లను శకటరేఫ ఘటితములుగా పఠించి, వీని ఉత్తర భాగమును 'జాఱు' అను క్రియతో ముడివెట్టుట భ్రాంతి మూలకము.

77. మోజా : ముసిపైపు వంకగల మలఁకచెప్పు, ముచ్చె, 'చరణముల లేఁత చిగురుమోజాలు దొడిగి' (పి. శకుం. 3–41) < పారసి. మూజ=పాదరక్ష; కాలి తొడుగు; మోజహ్=ముచ్చెలు; పహ్లవి(=ప్రాచీన పారసీకము) మౌచక్=పాదరక్ష.

78. మోళము : వెండి, బంగారము లోనగువాని పైపూఁత, మొలామ. 'జముని నాలుకతో నెక సక్కెమాడఁ దమకపడు క్రొత్తపైడి మోళముగటారి భీమనృపుఁడిచ్చె గారాపుఁబెద్ద పెండ్లి కొడుకుఁ గుఱ్ఱకు నైషధ క్షోణిపతికి' (నైష. 6–94); 54 'పసిఁడి మొల్లాము గుబ్బల కవాటములు' (ద్వి. పరమ. తృతీయా. పు. 146) 'చికిడిపైఁడి మొలామ, చిక్కటారి' (సత్యభామా సాంత్వనము ప్రథమా.) అని అర్వాచీన ప్రయోగములు < మరాఠీ. ములామా = ధాతువులపై పూఁత; ములమ్మా = పై పూఁత; పారసి. ములమ్మా = మెలామ; మల్, అమ్ = పూఁత; లమ్మా = ప్రకాశించుట; అరబ్బీ. ములమ్మ అ.

79. రమణా : బర్మాలోని ఇరావతీనదీ ముఖద్వారమునగల ప్రాంతము. 'రమన్యా' యని ప్రాచీన వ్యవహారము – 'తరుణాసీరి తవాయి గోవ రమణాస్థానంబులన్....' (హర. పీఠిక. 28).

80. రావు : నాఁటి వెలమదొరల పట్టపు పేరు; పేరు చివరఁజేర్చు గౌరవ సూచక మగుపదము. నేఁడు సర్వవర్ణములవారి నామముల చివర చేర్పఁబడుచున్నది. 'రావుసింగ మహీపాలు ధీవిశాలు' (శ్రీనా. చాటువు), 'రావుసింగజనపాలునకే' (శ్రీనా. చాటువు), 'రమణమించిన మేదినీ రావు బిరుద...' (శ్రీనా. చాటువు), 'తక్కక రావు సింగ వసుధావరుఁడు...' (శ్రీనా. చాటువు), '...హిందూరావు సురధాణి... తిమ్మారెడ్డింగారు...' (A. R. No-469 of 1915; 3వ పంక్తి; క్రీ. శ. 1496) < మరాఠీ. రాఓ, రావో = ప్రభువు, రాజు; రాహుత్తశబ్ద భవముగా పేర్కొని అశ్వారోహకుఁడను నర్థమిచ్చినది ఆంధ్ర పద పారిజాతము (చూ. పు. 686); ప్రాకృత– రాయ; సంస్కృత. రాజ–

81 రోజు : దినము. 'ఆ మాటమీదట నమ్మరోసీవు – ముట్టడివేసితి మూర్ఖతతోడ– అయిదు రోజులదాక నంతమామామ...' (పల్నాటి. పు. 42): 'పగటిగానంబు దప్పక యుండ దినరోజుమాదిరి నొంటరి జోదు మూఁక' (రాజవా. 5–13), 'అగడతంబడి మునింగి దరిఁజేరి పారి రోఁజు దినరోజు రాహుత్తులును...' (పైది. 5–33) – అని అర్వాచీన ప్రయోగములు < మరాఠీ రోజ; పారసి–రోజ్=దినము; పగలు; సూర్యుఁడు రోజన్ = రోజులు; రోజన = ప్రతిదినము; రోజ్ రోజు = దిన దినము; ప్రాచీన పారసి. రౌచ = ఒకరోజు.

82. లాలు : ఎఱుపు. 'లాలు గంధి' (రత్నపరీక్ష, 11), 'లాలు'(పైది. 12) < మరాఠీ. లాల = ఎఱుపు; పారసి. లాల్ = ఎఱుపు; లాలీ = ఎఱ్ఱఁదనము.

83 లాహిరి : మాదక ద్రవ్యసేవనము వలనఁగలుగుమత్తు మైకము. 'లాహిరి పట్టినభాతి మదంబెక్కినమాడ్కి' (కాశీ. 2–138) < పారసి. లహ్ర్. లహర్ = సారాయి మొదలైన నిషావస్తువులు అమ్మెడి కొట్టు; సానికొంప; లహ్ = ద్రాక్ష సారాయము.

84. లుంగ : వస్త్రభారము; బట్టల మోపు. 'జగొన్న వెలిపట్టు జన్నిదంబుల లుంగ యంటులువాయంగ నఱుతవైచి...' (క్రీడా. 42) < మరాఠీ. లుంగి = మొలను కట్టుకొను వస్త్రము; పారసి. లుంగ, లుంగీ = గళ్ళ గళ్ళ వస్త్రము; లుంగ్ = వస్త్రపుమడత.

85. లూటి + బాధ, ఉపద్రవము 'రమణఁగంసాది యసురులు లూటీసేయఁ గాఁగా – తమిఁగృష్ణావతార మిందరికై తివి' (తాళ్ళ. ఆధ్యాత్మ. vi, 60); దోపిడి. 'మమ్ము లూటి సేయరాకు' (వరాహ. 3–92) < మరాఠీ. లూట్, లూటి = కొల్ల, దోపిడి; లుటణేఁ = కొల్లవెట్టు; దొంగిలించు

86. వలికా : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒకదినుసు విలాతిపడవ. '...కస్తూరికాద్రవ్యముల్ శరధిం గప్పలిజోగు వల్లివలికాసమ్మాన్లఁ దెప్పించునేర్పరియై..' (హర. పీఠిక, 28).

---

54. 'యమేన జిహ్వాప్రహితేవయా నిజా తమాత్మజాం యాచితుమర్థినా భృశమ్ సతాం దదేఽస్మై పరివార శోభినీం కరగ్రహార్హామసి పుత్రికా మపి' —(శ్లో. 21. షోడశస్సర్గః, నైషధ మహాకావ్యమ్, చౌఖంబాప్రతి) అని మూలము 'జముని నాలుకతో నెకసక్కమాడ దమకపడు క్రొత్త మోళము కరారి' (శృం. నై., ఆం. వి. గ్రం. తాళపత్ర ప్రతి నెం. 29672. 79 వఠుకు, మొదటివైపు, మొదటి పంక్తి); 'జముని నాలికెతో నెకసక్కెమాడం దమకపడు క్రొత్త పైండి మొలామ కటారి' (పైది. ఆం. వి. గ్రం. తాళపత్ర ప్రతి నెం. 29800 95 వఠుకు, 2వ వైపు ; 4వ పంక్తి) ; 'పైఁడిమోళము కటారి' యని భువనగిరివారి ముద్రిత ప్రతి ; 'పైఁడిమోడము కటారి' యని కొండపల్లివారి ప్రతి.

*87*. వల్లి : సరకుల రవాణాకు ఉపకరించెండి ఒక దినుసు విలాతి పడవ. '...కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగువల్లిపలికా సమ్మాన్లఁ దెప్పించు నేర్పరియై...' (హర. పీఠిక, 28).

*88*. వహి : లెక్క ; లెక్క వ్రాయు పుస్తకము. 'కడమజీత వహియు' (సకల నీతి సమ్మతము, 299). వహి వారణాసి యనఁగా ...' (ద్వా. 11-97). 'వహి లెక్కఁదెలియు వారలు లేరా...' (తాళ్ళ. అధ్యాత్మ. V, 317); 'కరణము వహి ప్రమాణానం జెల్లి...' (A. R. No. 792 of 1922; 7వ పంక్తి; క్రీ. శ. 1448). 'దినవహి' యనునది 'రోజువారీ లెక్క, వ్రాయు ఉద్యోగము వలన సిద్ధించిన ఇంటిపేరు. వైలెక్క (వై + లెక్క : వై < వయి < వహి) అని జానపద వ్యవహారము < మరాఠీ. వహీ = లెక్క పుస్తకము; హిందీ. బహీ; దేశీయ ప్రాకృతమున 'వహియా' = లెక్క పుస్తకము, Account Book.

*89*. విలాతి : దేశము, సీమ. '... మాఱు విలాతి కేఁగుచున్...' (వే. పంచ. 1-479)[55] < మరాఠీ. విలాయత = పరదేశము ; యూరపుఖండము ; పారసి. విలాయత్ = దేశము ; మండలము, దేశభాగము; అరబ్బీ. విలాయత్ = సీమ ; రాష్ట్రము.

*90*. శాలువు : ఉత్తరీయముగా కప్పుకొను సకలాతి. 'ఉదికిన శాలువు నొనర ధరించి' (నవనా. పు. 260) < మరాఠీ. శాలూ ; పారసి. షాల్ = టిబెట్టుజాతి గొఱ్ఱెల ఉన్నితో తయారయిన మేలిరకము శాలువ; దర్వేషీలు కప్పుకొను ముదుక గొంగడి ; తెల్లని ఉన్నితోనేసిన కంబళి.

*91*. సంగడి : జెట్టిసాధనకు ఉపయోగపడు ఇనుపగుండు. '...సాము చేయుచు దినప్రతి కుమారుఁడు భుజార్గళినెత్తు కెంపు సంగడియనంగ' (పరాహ. 4-145)[56] < మరాఠీ. సంఘాడి.

*92*. సన్నాయి : నాగసరము. 'శంఖ సమూహంబు సన్నాయి జోళ్ళు' (పల్నాటి. పు. 4) < పారసి. షాహ్‌నాయ్ = జయ కాహళ; యుద్ధకాహళ ; షాహ్ నామ్ = ఒకవిధమైన వాద్యము ; సంగీత సాధనము.

*93*. సమ్మాను : చీనాదేశీయుల పద్ధతిలో నిర్మించిన ముక్కొయ్య పడవ. 'తరుణా సీరితవాయి గోవరమణాస్థానంబులన్ జందనా గరు కర్పూర హిమాంబు కుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగు వల్లి వలికా సమ్మాన్లఁ దెప్పించు నేర్పరియై వైశ్యకులోత్తముండ వచి తిప్పండల్పుఁడే యిమ్మహిన్, (హర. పీఠిక, 28) < మలయా. సమ్మన్ = మూఁడు పలకల పడవ : చీనీ. సంపన్ = మూఁడు పలకలతో అమర్చిన పడవ, పెద్ద ఓడను అంటిపెట్టుకొనియుండు చిన్న పడవ; సన్ = మూఁడు ; పన్ = పలక; వూ-పన్ = ఐదుపలకల పడవ ; వూ = ఐదు (Chinese – English Dictionary, Harward University Press, Massachusetts, 1956). 'సంపన్' అనునది సమీకరణమునంది 'సమ్మన్' అయి 'సమ్మాను'గా పరిణమించినది. తమిళమున 'చిన్నపడవ' యను నర్థముగల 'చంపాన్' పదము చీనీ భాషనుండి ఎరవు తెచ్చినదని ఉల్లేఖ్యము (తమిళ లెక్సికన్, పు. 1285). సింటో, బార్బోజా, వర్తెమా మొదలగు విదేశ పర్యటకుల కథనముల 'చయంపన' ను రూపము సంగ్రథితము. (See : Hobson-Jobson, p. 789). '... సమ్మాన్లఁ దెప్పించు...' అను వేటూరివారి పాఠమునకు సుప్రసిద్ధ చరిత్రకారులు మల్లంపల్లివారి ఆమోద ముద్రకలదు (History of the Reddi Kingdoms, p. 406). '... శరధిం గప్పలి జోఁగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించు నేర్పరియై...' అను పాఠము కవ్యభిప్రేతముగాఁ దోఁపదు. '...చందనాగరు కర్పూర హిమాంబు కుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్ శరధింగప్పలి జోఁగు వల్లి వలికా సమ్మాన్లఁ దెప్పించు...'ట యుక్తము. '...విరివిగా సామాన్లు...' అనుట పునరుక్తి. ఒకవేళ '...విరివిగా సామాన్లు దెప్పించు...' పాఠమే కావలెనని పట్టుపట్టినచోఁ సామానుఁ కూడ అన్యదేశ్యము. మరాఠీ. సామాన = పరికరములు, పనిముట్లు < పారసి. సామాన్ = వస్తువు ; సాధనము.

*94*. సరిహద్దు : పరిమితి, మేర ; పొలిమేర, సీమ. 'చక్కగా మిరియాల సరిహద్దు దాటి – ప్రజల మేలిమి చింతపల్లెయుదాటి' (పల్నాటి. పు. 33) < మరాఠీ. సర్‌హద్ద = మేర ; పొలిమేర ; పొసిర. సర్‌హద్ = అవధి, మేర ; సీమ.

*95*. సవా : ఒకటింబావు. 'సవాలక్ష' (= లక్ష పాతికవేలు, అపరిమితము) (ద్వి. హరిశ్చ. పూ. పు. 66) < మరాఠీ. సవా, సవ్వా = ఒకటింబావు ; ప్రాకృత. సవాయ; సంస్కృత. సపాద.

*96*. సహా : చక్రవర్తి, సార్వభౌముఁడు 'హరహరరాయ ఫేరొజసహా సురథాణ గజాధిపాది భూవరులు...' (హర. పీఠిక, 24) < మరాఠీ. శహా = రాజు, సుల్తాను ; పారసి. షహ్, షాహ్ = అధిపతి, ప్రభువు; షాహీ = రాజసంబంధి ; రాజ్యము ; రాచరీవి.

---

55. 'పసుపున కిచ్చెనంత వృషపర్వుఁడు కొన్ని విలాతు లింతికిన్' (యయా. 4-122) ఇట సీమలని అర్థము. 'విలాతి సకలాతి హౌదాల సామజములు' (రంగా. 1-156) ఇట పరదేశమని అర్థము. 56. 'సంగడము' అని మనుచరిత్ర (3-59) ప్రయోగము.

*సాంబ్రాణి* : చూ. సామ్రాణి. 'సాంబ్రాణి తేజీలు' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 283) ; 'పసిఁడిపక్కెర తేజి సాంబ్రాణి నెక్కి' అని రామాభ్యుదయ ప్రయోగము.

*97*. *సామ్రాణి* · రూ. సాంబ్రాణి. ఉత్తమాశ్వము, సామ్రాణిదేశపు గుఱ్ఱము. 'సామ్రాణి తేజులును' (నవనా. పు. 185), 'మదవారణముల సామ్రాణి తేజులును' (పైది. పు. 236), '...తంత్రాధిపు నీ సామ్రాణి యెవరిదనవిని నమ్రుఁడగుచు లీలఁగదలి నకులధ్వజుఁడున్' (జై. 7-146) > మరాఠీ. సమరాణ. తుర్కిస్తాన్‌లోని ఒక నగరము. సమర్‌కండినగరము నేటి ఉజ్‌బెక్‌స్తాన్‌లోనిది ; గుఱ్ఱములకు ప్రసిద్ధి.

*98*. *సుపాణి* : రూ. సుప్పాణి. శుభ్రమయిన నీరు గల ముత్యము. 'సుపాణి ముత్యములు' (నవనా. పు. 56), 'తళుకు సుపాణి ముత్యాల మేల్కట్లు' (పైది. పు. 259), 'అట్టి ముక్తాఫలంబులకు నాణియు, సుతారంబును, సుపాణియు నను గుణంబులు మూఁడు...' (రత్నపరీక్ష, 49), 'తళుకు సుపాణిముత్యాల మించుల...' (శ్రీరంగ మహత్త్వము, 2-46) < మరాఠీ. సుపాణీ = తేజస్వి; వైకృతమని శ. ర; కాని, వైకృతదీపికలో ఈ పదమే లేదు. సుపానీయ శబ్దభవమని పురుషోత్తమ కవీయము, పు. 135.

*సుప్పాణి* : చూ. సుపాణి. 'నెఱయును సుప్పాణి యెపుడు నిర్మలకాంతిన్' (రత్న పరీక్ష, 50).

*సురతాణ* : చూ. సురతాను. 'ధారా సురతాణదర్ప ధరణీధ్రసవీ' (కాశీ, 6-309).

*సురతాణి* : చూ. సురతాను. వై. వి. ఇంద్రుఁడు; ఇంద్రాణి అని శ, ర. (చూ. పు. 1095). 'పండువా సురతాణి పావడంబిచ్చిన భద్రేభములు వీధిఁబాలెముండు' (భీమ. 1-38), 'నీకుఁగల ప్రసిద్ధి ఢిల్లి సురతాణికిని లేదు' (క్రీడా. 185), 'దండిబిరుదుల సురతాణి గుండెదిగుల' (శ్రీనా. చాటువు), 'సురతాణి ముద్రబోలెను' (సకలనీతి సమ్మతము, 19) '...అలావదీను సురతాణి చేతను ఎఱకేశ్వరదేవర ఉపహతి అయితేని...' (7, 8 పంక్తులు, పిల్లలమఱ్ఱి శాసనము; క్రీ. శ. 1357).

*99*. *సురతాను*: రూ. సురతాణ, సురతాణి, సురత్రాణ సురధాణి, సురథాణు, సురడాణి, సురధాణ, సురధాణి, సురధాని. ఈ రూపాంతరములన్నియు వాస్తవముగా నాఁటి వ్యవహారాను గుణములో లేక, లేఖక ముద్రాపక కల్పితములో నిర్ధారించుట దుస్సాధము. పాలకుఁడు, ఏలిక. 'దురములో దక్షిణ సురతాను నెదిరించి' (జై. పీఠిక, 32) < పారసి. సుల్తాన్ = సార్వభౌముఁడు, చక్రవర్తి; సర్వాధికారి; సుల్తాన = చక్రవర్తిని. రాణి; సుల్తానీ = సామ్రాజ్యము; చక్రవర్తికి సంబంధించిన < అరబ్బీ, సుల్‌తాన్; తెలుఁగునందలి 'సులతాని' సురత్రాణ శబ్దభవముగా కవిసంశయ విచ్ఛేదము (చూ. పు. 65) నిరూపించుట ప్రతిలోమ పద్ధతి.

*సురత్రాణ* : చూ. సురతాను. 'ధారాసురత్రాణ ధాటీ సమారంభ గర్వపాథోరాశి కలశజులకు' (భీమ. 1-29), 'దాని చన్నుదోయి ధారాసురత్రాణ కటకకుంభి కుంభ కలహకారి' (క్రీడా. 243), 'ప్రబలధారా సురత్రాణ భద్రజాతి కరిఘటా సైన్య...' (కాశీ. పీఠిక, 58), 'ధారాసురత్రాణుఁ బోర నిర్జితుఁజేసి'(కొమ్మనశివలీలావిలాసపీఠిక), 'మధురా సురత్రాణు మడియించి పరపక్షిసాళువబిరుదంబు జగతినెరపె'(జై, పీఠిక, 32). ధారానగరము రాజధానిగా మాల్వాను పాలించిన హూషంగ్ సుల్తాన్ (క్రీ. శ. 1405-1435) ఇందలి ధారాసుత్రాణుఁడు. చిత్రభారతకృతికర్తయగుచరికొండధర్మన్న శతఘంట సురత్రాణ బిరుద విభ్రాజితుఁడు.

*సురధాణి* : చూ. సురతాను, '..హిందూరావు సురధాణి....తిమ్మారెడ్డింగారు....' (A. R. No. 469 of 1915; 3 వ పంక్తి క్రీ. శ. 1496).

*సురథాణు* : చూ. సురతాను. 'ప్రయాగ ఉపాధ్యాయుల కొడుకు కళింగవ్యాపారి లద్దె సురథాణు తమ్ముండు' (శ్రీకూర్మశాసనము, A. R: No. 299 of 1896; 4,5 పంక్తులు; క్రీ. శ. 1402).-

*సురదాణి* : చూ సురతాను. 'భావజ సురదాణి' (నవనా. పు. 10).

*సురధాణ* : చూ. సురతాను. 'హరిహరరాయ ఫేరోజసహా సురధాణ గజాధిపాది భూవరులు...' (హర. పీఠిక, 24)-ఇందలి హరిహరరాయలు విజయనగర చక్రవర్తియగు రెండవ హరిహరరాయలు (క్రీ. శ. 1377-1404), ఫేరోజసహా - బహమనీ సుల్తానులలో అతి ప్రసిద్ధుఁడును, బహుభాషా వేత్తయును, కావ్యగీతి ప్రియుఁడును అగు సుల్తాన్ తాజ్-ఉద్-దీన్ ఫిరూజ్ షా (క్రీ. శ. 1397-1422); 'ధారాపట్టణ సార్వభౌమ సురధాణర్వాపహారక్రియా ధౌరంధర్య...' (కాశీ. 5-337).

*సురధాణి* : చూ.సురతాను.'ఖుసిమీఱన్[57] సురధాణి నిండుకొలువై కూర్చున్నచో...' (హర. పీఠిక, 22), 'గజపతి సురధాణి గడిదుర్గములకెల్ల నేరాజు వజ్రంపు బోరు తల్పు' (ప్రబోధ. 1-96)

*సురధాని* : చూ. సురతాను. 'పండువా సురధాని[58] పావడంబంపిన భద్రేభములు వీటఁబాళెముండు' (కాశీ. 1-35).

*100*. *సేబాసు* : మెచ్చికోలును తెలుపు మాట. '...సంగ్రామాంచల ముననిదె నను మెచ్చించెదవేనపుడు నిన్ను సేబాసందున్' (హర. 7-64),[59] (విక్ర. 8-66). > మరాఠీ. శాబాస=ప్రశంసార్థకపదము; పారసి. **షహ్-బాష్**=స్తుతి; మేలుమేలని ఎలుగెత్తికొనియాడుట.

---

57. 'ఖుసిమీఁదన్...' అని వేటూరివారి పాఠము. 58. 'పండువాసురతాని'అని ఆం వి. బొబ్బిలి తాళపత్రప్రతి, 7వఆకు, 2 వ వైపు 4వ పంక్తి
59. మెచ్చించెదమేనమ్మ గోలనేసిన పిదపన్' అని వేటూరివారు పరిష్కరించిన ప్రతి యందలి అధోజ్ఞాపికలోని పాఠాంతరము.

సొక్కశాలు: చూ. సొగటాలు. సొక్కటాలు నిన్న నాడిసోలి సత్యభామకు మ్రొక్కితివి నేఁడు నాకు మ్రొక్కవలెఁగా (తాళ్ళ. శృంగార సంకీర్తనలు, iv.163).

*101.* సొగటాలు: చూ. సొక్కటాలు పగడసాలాట. 'సరిలేనియయంబి సొగటాలరు దగుజూదంబు...' (భోజరా. 5_76). 'తిగుటన్ సొగటాల నేనతి ప్రౌఢుండన్' (ద్వా. 10_91): జూదమాడెడు పాచెలు. 'గచ్చకాయలు కొన్నికలిగినయట్టి. తిత్తులు చిరుతిలు తీరైనగొడెలు_ జూద మాడుట కయి సొగటాలుకొన్ని...ఆటలసాధనాలవి వెంటరాగ' (పల్నాటి. పు. 45) < మరాఠీ సొగడీ. సొగటా=శకట సంబంధమయిన.

*102.* సోఁణాదొప్పి: ద్యూత్యవిశేషము. 'సోఁణాదొప్పియు నెత్తమున్ మొదలుగా జూదంబునీవాడు నావేళంగాదని బాంధవుల్ శకుని దుర్వృత్తం బెఱింగింపరే" (జై. 3_42) దీనికి "సోషాదొప్పి"యనురూపాంతరమున్నట్లు దాచేపల్లివారి శబ్దార్థదీపిక (చూ. పు. 1390) ఏ మండలమునందైన వ్యవహారముకలదేమో? < ? మరాఠీ. సోళా= పదునాఱు; పదునాఱవు; థోపా= దెబ్బ, కిత్తి; హిం. సోలహ్. సోరహ్.

*103.* హజారము: ఆస్థానము; మొగసాల. "...పొడుపుఁగొండపయిన్ రవియొప్పెఁజూడఁగా సమధికలీలనింద్రుని హజారపుమేడకు బైఁడికుండయైఁ (కాశీ 1_125). తనరు ముంగిసలు దరి హజారముల" (ద్వి. హరిశ్చ. ఉ. పు. 320), "నిరాఘాటమగు హజారంబు కడకు" (వరాహ. 2_4), 'ఈరీతివెడలి వజ్రహజారంబుననిలిచి (పైది. 3_39) "హజారంబు డాయంబోయి'' (పైది. 6_90), "వాఁడును హజారంబు వాకిటనిలిచి"(పైది. 11_57) < పారసి. హాజిరాన్= సభాస్తారులు; హాజిర్=సన్నిధినుండు; సేవకు సిద్ధముగానుండు; హాజిరీ=సభ్యులు; ఓలగమువారు; హుజ్రా=కొలువుకూటము, సభాస్థానము; హాజారము, అజారము అని తెలుఁగున అర్వాచీన ప్రయోగములు. శకట రేఫ ఘటితముగా కొందఱు దీనిని పరించుట ప్రమాదము. సామజాగారము (= ఏనుగులసాల) సజ్జాగారము, హజ్జారము, హజారము అనునిట్టి క్రమపరిణామములనుపొంది హజారముగా, రూపొందినదని కొందఱు వ్రాయుట అశాస్త్రీయము.

*104.* హద్దు: అవధి. మేర. చక్కగా మిరియాల సరిహద్దుదాటి' (పల్నాటి పు. 33); 'తూరుపుదిక్కుకు తుది మేరసుమ్మ దక్షిణ దిశహద్దు తగ వివరింతు' (పైది. పు. 87), 'పడమటికిని హద్దుబాలచంద్రుండ కొదమగుండ్లయనెడి గురి గ్రామమొకటి' (పైది. పు. 87). ఉభయపక్షంబులఁడప్పైన బలము నివసించియున్నది నిశ్చల మతిని హద్దులుచెప్పెదనవి చిత్తగింపు, (పైది. పు. 87) < మరాఠీ, హద్ద=అవధి, మేర; పారసి. హద్=మేర. పొలిమేర; అవధి; అంచు; వేర్పాటు; అరబ్బీ హద్= మితి మేర.

*105.* హుమాయి: వాహనము. 'కాయజారాతిగిబ్బ హుమాయినెక్కి' (పరతత్త్వ రసాయనము, 1_111) < మరాఠీ హుమా=గరుడపక్షి; పారసి. హుమా= గరుడపక్షి; స్వర్గలోకపు పక్షి; ఇది యెవని తలమీఁద నెగురునో వాఁడు చక్రవర్తి యగునని ఇరానీల నమ్మకము. దేశ్యముల తుది దీర్ఘమునకు హ్రస్వము లేదనుటకు కవిజనాంజన కర్తపాదశా, నవలా, హుమాలను ఉదాహరించినాడు (చూ. విశాఖపట్టణము, పరవస్తువారి గ్రంథాలయమునందని కవిజనాంజన తాళపత్ర ప్రతి, 80వ ఆకు. రెండవవైపు)

*106.* హురుముంజి: పారసీక జలసంధి చేరువ తీరమునఁగల పెద్ద రేవు పట్టణము. క్రీస్తుపూర్వము నాలుగవు శతాబ్దినుండియు ముత్యముల, గుఱ్ఱముల ఎగుమతికి ప్రసిద్ధి. క్రిందటిదినములలోపల వాణిజ్యవిషయముగా ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచములకుకూడలి. 'చీని సింహళ తవాయి హురుముంజి చోణంగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు ధన కనక వస్తు వాహన మాణిక్య గాణిక్యంబులు తెప్పించుయు...' (హర. పీఠిక, 7), 'సింహళంబున గంధ సింధురంబులుదెచ్చె హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' (పైది. పీఠిక, 26)' 'ముక్కున హురిముంజి ముత్యాలముంగర' (శ్రీనా. చాటువు), 'గురుతైనహురుముంజి గొప్పముత్తెపునత్తుమోవిపైనొకవింతముద్దుగుల్క" (శ్రీనా. చాటువు) < పారసి. హుర్ముజ్= ఒక రేవుపట్టణము. 'అహుర్+మజ్‌తా' అని జెంద్ అవెస్తా భాష; ఉర్మజ్=ప్రతిపద్దివసాధిష్ఠానదేవత; బృహస్పతిగ్రహము.

[సమాప్తం]

# మధ్యరంగం ప్రజలు, ప్రాంతాలు

డాక్టర్ గోపాలాచారి

ఉత్తర ప్రదేశ్, పంజాబ్, హిమాచల్ ప్రదేశ్‌లకు టిబెటు ప్రాంతంలోని అరి లేదా న్గ్రి ఖోర్సుం జిల్లాతో వున్న సరిహద్దులే మధ్యరంగంలో ఇండో-చైనా సరిహద్దులు. ఈ సరిహద్దు దాదాపు 350 మైళ్ల పొడవు వుంది. అవిచ్ఛిన్నమైన ప్రధాన నదీ పరీవాహక ప్రాంతం పొడవునా ఈ సరిహద్దు వుంది. విదేశాంగ మంత్రిత్వశాఖ చారిత్రక విభాగంలో పనిచేస్తున్న డాక్టర్ గోపాలాచారి రేడియో ప్రసంగంలోని, ఈ మధ్యరంగంలో నివసించే ప్రజలను గురించి, ఆ ప్రదేశాలను గురించిన విషయాలు దిగువ పొందుపరచబడినాయి.

పంజాబులో విదేశ సరిహద్దు కాంగ్రా జిల్లాలోని కూలూ సబ్‌డివిజనుకు చెందిన స్పిటీ వజరీతో వుంది. స్పిటీ విస్తీర్ణం సుమారు 2,500 చదరపు మైళ్లు. దీనికి అన్నివైపులా ఉన్నత పర్వతశ్రేణులున్నాయి ఇవిసగటున 18,000 అడుగుల ఎత్తున వున్నాయి. అవి ఋతుపవనాలు వీయకుండా అడ్డుగా వుండడంచేత అక్కడ వర్షపాతం చాలా తక్కువ. శీతాకాలంలో అధికంగా మంచు కురుస్తుంది. తీక్షణమైన గాలులువీస్తాయి. ఈ పరిస్థితివల్ల అక్కడి ప్రజలు బయటికి రాకుండా ఇండ్లలోనే వుండిపోతారు. ఇతర ఋతువులలో మంచునుంచి బయలుదేరే ప్రవాహాలు నీటిని కొనితెస్తాయి. ఈ ప్రవాహాలవల్ల స్పిటీనదికీ దాని ఉపనదులకు కూడా నీరు లభిస్తుంది. లోయ ప్రాంతం చాలా ఎత్తున వుండటంవల్లా, వర్షపాతం చాలా తక్కువ కావడంవల్లా ఈ ప్రాంతంలో చెట్లు బొత్తిగా ఎదగవు.

స్పిటీ జనాభా దాదాపు 6,000 మాత్రమే. ఇక్కడి ప్రజలు 'గెలుక్పా' తెగకు చెందిన లామా బౌద్ధమతస్థులు. ఈ ప్రాంతంలో అనేక బౌద్ధ విహారాలున్నాయి. కుటుంబంలోని చిన్న కుమారులు చాలామంది లామాలవుతుంటారు.

ప్రాచీన కాలంలో స్పిటీ ప్రాంతాన్ని ఒక హిందూ రాజవంశం పాలించింది. ఆ రాజులు తమ పేర్ల చివరన 'సేన' అని కలిపేవారు. క్రీ.శ. 9 వ శతాబ్దంలో స్పిటీలోయ లధక్‌లో భాగంగా వున్నట్లు లధక్ రికార్డులు వెల్లడిస్తాయి. పదవ శతాబ్దంలో ఇది ప్రత్యేక రాష్ట్రంగా రూపొందింది. మళ్ళీ 17 వ శతాబ్దిలో ఇది లధక్‌లో భాగంగా ఏర్పడింది 1846 వ సంవత్సరంలో బ్రిటిష్ వారు కాశ్మీర్‌లోని లధక్ ప్రాంతంనుంచి లహుల్, స్పిటీలను హస్తగతం చేసుకొని పంజాబులో విలీనం చేశారు.

## కొండకనుమలు

హిమాచల్ ప్రదేశ్‌లో విదేశ సరిహద్దు బషార్ రాష్ట్రంతో వుంది. దీని విస్తీర్ణం 3,820 చదరపు మైళ్ళు. స్పిటీ కంటే ఇది తక్కువ ఎత్తులోవుంది. ఇక్కడ నిట్రమైన రాతి కనుమలు పరంపరలుగా వున్నాయి.

బషార్ జనాభా 1,00,000 కు పైగా వుంటుంది ఇక్కడ పాలకవర్గం వారు రాజపుత్ర సంతతివారికి చెందినవారు కాగా జనసామాన్యం 'కనెట్లు'. ఇక్కడ హిందూమతం ప్రధానమైనది. చాలా దేవాలయాలు ఈప్రాంతంలోవున్నాయి.

బషార్ ఉత్తర జిల్లాకు 'కునవర్' అనే పేరు కిన్నెరదేశం అనే నామం నుంచి వచ్చింది. కిన్నెరుల తెగనుగురించి మహాభారతంలో ప్రస్తావించ బడింది. గూర్ఖాలు 1803 వ సంవత్సరంలో ఈ రాష్ట్రాన్ని స్వాధీనపరుచుకున్నారు. కాని 1815 వ సం॥లో ఆంగ్లేయులు తెహ్రీగఢ్వాల్, గఢ్వాల్, ఆల్మోరా

లతో పాటు ఈ రాష్ట్రాన్ని కూడా హస్తగతం చేసుకున్నారు.

ఉత్తరప్రదేశ్‌లో కుమాన్ డివిజనుతో విదేశ సరిహద్దు వుంది. ఈ డివిజనులో ఉత్తరకాశీ (పూర్వ తెహ్రీరాష్ట్రం), గర్హ్వాల్, ఆల్మోరా జిల్లాలున్నాయి. తెహ్రీ గర్హ్వాల్ కూడా పూర్తిగా హిమాలయ పర్వతప్రాంతంలోనిదే. ఈ ప్రదేశాలలో పర్వతశ్రేణులు అపారంగా వుంటాయి. ప్రధానమైన పర్వతపంక్తులు సాధారణంగా ఈశాన్య దిశనుండి నైరుతి దిశకు వుంటాయి. వీటి ఎత్తు 18,000 అడుగులు మొదలు 20,000 అడుగుల వరకు వుంటుంది. నదీ పరీవాహక హద్దునుంచి ఇవివ్యాప్తిచెంది వుంటాయి. గర్హ్వాల్ లో వలెనే ఇచ్చట మంచు ప్రవాహాలు అధికం. గంగా, యమునానదులు రెండూ ఈ రాష్ట్రం నుంచి బయలుదేరుతాయి. ఖైరంఘటి, గంగోత్రి హిందువుల పుణ్యక్షేత్రాలు.

ఈ రాష్ట్రంలో చిన్న కొండలపై ఎదిగే చెట్లు చేమలు మొదలు ఉత్తరం లోని ప్రశస్తమైన అల్పైన్ చెట్లు చేమల వరకు పలురకాల వృక్షాలు ఎదుగుతాయి. తెహ్రీలోకూడా విస్తృతంగా అడవులున్నాయి. కొండతీరాలలోని సమతల ప్రదేశాలలో, నదీప్రవాహ ప్రదేశాలలో మాత్రమే సేద్యం జరుగుతుంది. పులి, నల్ల ఎలుగుబంటు, మచ్చల జింక, అడవి గొర్రెలు ఈ ప్రాంతములో వుంటాయి.

## పర్వత శ్రేణులు

తెహ్రీ–గర్హ్వాల్ వలెనే గర్హ్వాల్ లేదా బ్రిటిష్ గర్హ్వాల్ కూడా నిట్రమైన పర్వతశ్రేణులతో కూడుకొని వుంటుంది. ఇవి ఒకదానినుంచి ఒకటి లోతైన, ఇరుకైన లోయలచే విభజించబడి వుంటాయి.

ప్రధాన పర్వతశ్రేణులను, నందాదేవి, బద్రీనాధ్ పర్వతపంక్తులనే రెండు వర్గాలక్రింద విభజించవచ్చు. ఇవి తూర్పు, పశ్చిమాలలో 25 మైళ్ళ పొడవున మంచు తెరలుగా వుంటాయి. నందాదేవి పర్వత శ్రేణి పార్శ్వాలలో నందకోట్ త్రిశూల్ శిఖరాలూ, బద్రీనాధ్ శ్రేణిలో బద్రీనాధ్, కేదార్‌నాధ్, శిఖరాల శాఖలూ వున్నాయి నదీ పరీవాహకప్రదేశంనుంచి మరో పెద్ద పర్వతశ్రేణి ధౌలిగంగ, విష్ణుగంగ నదీగర్భాలను విభజిస్తూ వెళ్తుంది ఈ శ్రేణిలోని ప్రధాన శిఖరమైన కమెట్ ఎత్తు 25,447 అడుగులు. ఇది నదీపరీవాహక ప్రదేశానికి దగ్గరగా వుంటుంది. ఈ ప్రాంతంలో అలక్‌నందనుంచి నీరు అందుతుంది. కాగా ధౌలిగంగ, విష్ణుగంగ దీని ఉపనదులైన పింగర్, మందాకినిల ద్వారా ఇది రూపొందింది

ఆల్మోరా జిల్లాలోకూడా మంచుతో కప్పిన పర్వతాలు అధికంగా వుంటాయి. వీటిలో భౌగోళికప్రాముఖ్యతదృష్ట్యానూ, ప్రకృతి శోభ దృష్ట్యానూ ప్రధానమైనవి నందాదేవి శిఖరానికిచెందిన పర్వత శ్రేణులు. నందాదేవి దాని సహపర్వత శ్రేణుల తూర్పున పంచశూలిశ్రేణివుంది. ఈ శ్రేణిలోని వున్నతశిఖరంఎత్తు 22,661 అడుగులు. ఈ జిల్లాలో చాలావరకు కాళీ అనే నదిద్వారా పశ్చిమ ఉపనదులద్వారా నీరు లభిస్తుంది. ఆల్మోరాజిల్లా, నేపాల్‌లకు మధ్య సరిహద్దుగా కాళీనది వుంది. గర్హ్వాల్, ఆల్మోరాలనుంచి టిబెటుకు వెళ్లే అనేకమైన కనుమలలో ఎనిమిది ప్రధానమైనవి.

## హిందూ సంప్రదాయాలు

తెహ్రీ-గర్హ్వాల్‌లో 2,600 గ్రామాలున్నాయి. జనాభా 4,50,000 గర్హ్వాల్ 4,600 గ్రామాలతో, 6,50,000 జనాభాతో ఉంది ఆల్మోరాలోజనాభా 7,90,000 లకుపైగావుంది. గ్రామాలసంఖ్య 5,300. *స్కంద పురాణంలో కేదార క్షేత్రంగా* పేర్కొనబడిన ఈ మూడు జిల్లాలు హిందువులకు పవిత్ర ప్రాంతాలు

పూర్వం కూర్మాచలమైన ఇప్పటి కుమాన్, విష్ణుమూర్తి రెండవ అవతారాన్ని గుర్తుచేస్తుంది. ఇచ్చట దేవతలుముని సత్తములతో సంభాషించినట్లు హిందువుల ప్రాచీనగ్రంధాలలో వుంది. ఇచ్చటనే పాండవ సోదరులు మోక్షం పొందినట్లు చెప్పుకుంటారు. వీరి గాధలను ఈ ప్రాంతపు గిరిజనులు సంగీత నృత్యాల ద్వారా ఇప్పటికీ చెప్పుకుంటూ వుంటారు. ఈనాటికీ వేలకొద్దీ హిందువులు మోక్షప్రాప్తికై గర్హ్వాల్‌లోని కేదార్‌నాధ్, బద్రీనాధ్ క్షేత్రాలకు యాత్రకు వెళ్తూవుంటారు ఇచ్చట విష్ణు మందిరాలకంటే శివాలయాలు అధికం.

తెహ్రీరాష్ట్రంలో రాజపుత్రులు, దోమ్‌లు; గర్హ్వాల్, ఆల్మోరాలలో బిత్తులు, దోమ్‌లు అధికం. భోటియాతెగ వారు కూడా ఈ ప్రాంతాలలో కొన్ని వందల సంఖ్యలో నివసిస్తారు. వీరు దృఢకాయులు. వ్యాపారంలో సిద్ధహస్తులు. వేసవికాలంలో వీరు సరిహద్దు ప్రాంతాలకు వెళ్తూవుంటారు. శీతాకాలంలో భారతదేశంలోని దిగువ ప్రాంతాలకు దక్షిణాభిముఖంగావెనక్కు వస్తారు. వీరు హిందువులు. వీరు ఒకటిపై ఒకటి చాలా వస్త్రాలు ధరి

స్తారు. అన్నిటికిపైన కంబళి వస్త్రం లేదా జనుపనారకోట్లు వేసుకుంటారు. ఇలాంటివే లాగులు తొడుక్కుంటారు.

## టిబెటుతో వర్తకం

సరిహద్దు జిల్లాలకు టిబెటుతో వర్తక సంబంధం వుండటం సంప్రదాయంగా వస్తున్నది. 7,000 లకు పైగా ఖటియాలు ఈ వర్తకం సాగిస్తారు. ఆహార ధాన్యాలు, రాగి, ఇనుము, పొగాకు, చక్కెర, వెండివస్తువులను ప్రధానంగా ఎగుమతి చేస్తారు. ఉప్పు, బొరాక్స్, ఉన్ని, గుర్రపు పిల్లలు, గొర్రెలు, మేకలను దిగుమతి చేసుకుంటారు.

టిబెటులోని సంప్రదాయకమైన వర్తక కేంద్రాలలో వర్తకం సాగించిన ఆయా ప్రాంతాలలోని ప్రతి వర్తకుల బృందమూ కొన్ని సంప్రదాయకమైన మార్గాలగుండా టిబెటు వెళ్లాయి. ప్రతి సంతలో ఒకరికొకరు వస్తువులను అమ్ముకునే సంప్రదాయంకూడావుంది. ఒషాహిరేలకు పాతకాలపు ఒప్పందం ప్రకారం డంగ్ర్రా, షాంగ్ట్సె, గర్టక్ లలో వర్తకంపన్నులు వుండవు. స్పిటి, లాహుల్ ప్రజలు ప్రధానంగా నునుపైన ఉన్ని వర్తకం చేశారు. వీరు సాధారణంగా రుడక్, టాషిగంగ్ లకు వెళ్లేవారు. తెహ్రీ గర్వాల్ వర్తకులు పోలింగ్, టోలింగ్ నబ్రాలకు వెళ్లారు. గర్వాలీలు డాబా, గానిమా లలో, ఆల్మోరా వర్తకులు డక్లకోట్ లో వర్తకంచేశారు. వర్తక పన్నులు వివిధ స్థలాలలో వేరువేరుగా వుంటాయి. సంప్రదాయసిద్ధమైన ఈ వర్తకాన్ని 1954వ సంవత్సరంలో జరిగిన ఒడంబడికలో ఆమోదించడంకూడా జరిగింది. ఈ ఒడంబడికలో భారతదేశానికి చెందిన సంప్రదాయకమైన వర్తకులు ఏయే దారులగుండా వెళ్లాలో నిర్దేశించబడింది. వర్తక కేంద్రాలనుకూడా ఈ ఒప్పందంలో ఉదహరించడం జరిగింది.

---

# బంగారం కంట్రోలు నిబంధనల సవరణ

బంగారం కంట్రోలు నిబంధనల అమలు రీత్యా గడించిన అనుభవం దృష్ట్యా, ఎదుర్కొంటున్నటువంటి కొన్ని యిబ్బందులను తొలగించడానికి నిబంధనలకు కొన్ని సవరణలు 1963 జూన్ 24 నుంచీ, అమలులోకి వస్తాయని, భారత ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాలశాఖ ప్రకటించింది.

బంగారం శుద్ధిచేసే కేంద్రాలు సౌకర్యాలు ప్రస్తుతం లేని ప్రాంతాలలో విద్యుచ్ఛక్తితో పనిచేయనటువంటి కేంద్రాలు కొన్ని ఏర్పాటు చేయడానికి లైసెన్సులు యివ్వడానికి యీ సవరణలో అవకాశం కల్పించబడింది. ప్రస్తుతం పనిచేస్తున్న అన్ని బంగారం శుద్ధిచేసే కేంద్రాలూ, (విద్యుచ్ఛక్తితో పనిచేసే వాటితోసహా) ముందుముందు లైసెన్సు యిస్తే నెలకొల్పబడేవీ, ఉత్పత్తిచేసే బంగారం 14 వన్నెలకుమించి ఏ సందర్భంలోనూ వుండరాదు. 14 వన్నెలు మించిన బంగారాన్ని తయారుచేస్తే అది చట్టవిరుద్ధం కాగలదు. అయితే కొన్ని ప్రత్యేక పరిస్థితులలో స్వచ్ఛమైన బంగారం వాడుకచేయవలసిన అవసరంవుంది. బంగారం వ్యవహారాలబోర్డు అనుమతి పొందిన సందర్భాలకు మినహాగా పై నిబంధన యితర సందర్భాలన్నింటికీ వర్తిస్తుంది. బంగారం శుద్ధిచేసే కేంద్రాలలోనూ, బంగారం వ్యాపారులవద్ద ప్రస్తుతం గల బంగారం నిలవలు, ఉత్తరోత్తరా వారు సేకరించే బంగారం ఏడు రోజులలోగా 14 వన్నెలకు మించని బంగారం క్రింద మార్చివేయాలి.

బంగారం శుద్ధిచేసే కేంద్రాలలో తయారయ్యే బంగారంపైన అధికార ముద్రలు వేస్తారు. అధికార ముద్రల తాలూకు వివరాలు సాధ్యమైనంత త్వరలో ప్రకటిస్తారు. ఆభరణాలు తయారుచేయడానికీ, అత్యవసర పారిశ్రామిక అవసరాలకూ వుపయోగించే బంగారం సప్లయిల క్రమబద్ధం, ప్రమాణీకరణలకు పై ఏర్పాట్లు చేయడంతో, బంగారం కంట్రోలు నిబంధనలకులోబడి ఆభరణాలను వుత్పత్తిచేయడానికీ, అత్యవసర పారిశ్రామిక్ష అవసరాలకు వాడుకచేయడం సుగమంకాగలదు. ఆభరణాలకు మినహాగా లేదా మూలబంగారం తయారీకి మినహాగా యితర వాటికి బంగారం వాడుకచేయవలసివస్తే, బంగారం వ్యవహారాలబోర్డు అనుమతి పొందాలి.

బంగారం వ్యాపారులు, వడ్డీ వ్యాపారులు తాకట్టు వ్యాపారులు వ్యాపార లావాదేవీలు కంట్రోలు విషయంలో ప్రస్తుతంవున్న నిబంధనలకు వివరణలు యివ్వబడ్డాయి. ఆభరణాల తయారీ, అమ్మకం, బంగారు వస్తువులను తాకట్టుపెట్టుకుని అప్పులివ్వడం వేర్వేరుచోట్ల జరగాలి. తాకట్టుపెట్టిన వస్తువులను వాపసు యివ్వడంతో ఎగవేతలు లేకుండా కంట్రోలు నిబంధనలు వుల్లంఘించకుండాఅదుపు వుంచబడుతుంది.

బంగారంకోసం సోదాలు, బంగారం స్వాధీనంచేసుకోవడం, నిబంధనలు వుల్లంఘించిన సందర్భాల తాలూకు పత్రాలు, అనుమానస్పదమైన రికార్డులకు, సంబంధించిన నేరాల విషయంలో అవసరమైన వివరణలు యివ్వడం జరిగింది. ★




కొడవటిగంటి కుటుంబరావు

పాత్రలు :

[ భటుడు, గాత్రసేవకుడు, నిర్వాహకుడు, భద్రుడు, హాలుడు, ప్రాదేశికుడు, పుష్యగుప్తుడు, సుశ్రుడు, లాతువు, మహాకవి, సేవకుడు, అతిథులు, మిలిగినవి స్పష్టం. ]

(నాటక ప్రదర్శనం జరుగుతోంది)

భటు : (గట్టిగా) గాత్ర సేవకా ? గాత్ర సేవకా ... (తనలో) ఓరి వీడి కడుపు మాడా ... తప్పతాగి, చింతనిప్పులల్లే కళ్ళు వాడూ—వొస్తున్నాడు.

గాత్ర : (మైకంతోపాడుతూ)

- తాగినవోడే ధన్యుడురా పద
తాగినవోడే ధన్యుడురా—తప్ప
తాగినవోడే ధన్యుడురా—

ఆఁ ఎవరా కేకవేసేదీ ? గాత్తర సేవకుడితో పనేంటీ అంట. ఆడితో ఓరికి పనొచ్చిందీ ?

భటు : నీ కడుపుమాడా. నీకోసం అంతటా యెతికినానే. సినరాణి వాసవదత్తమ్మగోరు స్నానానికి బయల్దేరాలని తొందర పడతా వుండిరి. ఆ మెగారి యేనిగె బద్దరవతి అవుపించదాయె. నిన్నుజూడ బోతే యీడ తాగి తందినాలేస్తావుంటివి.

గాత్ర : అంతే అంతే. అది తాగింది. దాని మొగుడు తాగడు. నే తాగాను. నువు తాగావు. అందరూ తాగారు.

భటు: అందరిమాటా దేనికిలే? నువ్వు యిక్కడెందుకు తందానాలాడుతున్నావ్ ? ఏనిగె నెందుకు తేలేదు ?

గా : నే నిక్కడే తందానాలాడుతున్నా. ఇక్కడే తాగుతున్నా.

భ : చాలించు నీ వాగుడు. వెంటనే బద్దరవతిని తీసుకురా.

గా : రమ్మనూ. ఏయ్ బద్దరవతీ. రా, వచ్చెయ్ ... అంకుశంతాకట్టు పెట్టేసినాను, ఏంజేతును ?

(ప్రేక్షకులు గొల్లున నవ్వుతారు)

భ : అంకుశంతో పనేమిటి ? బద్దరవతి బొహుసాదువు. వెళ్ళివెంటనే తీసుకురా.

గా : రమ్మనూ. ఏయ్ బద్దరవతీ, రా, వచ్చెయ్...దాని చంద్రమాల తాకట్టు పెట్టేసినాను. ఏంజేతును ?

(ప్రేక్షకుల నవ్వులు)

భ : దానికేంలే ? మెళ్లో దానికో పూలమాల వేద్దాం. నువు వెంటనే వెళ్ళి దాన్ని తీసుకురా.

గా : రమ్మనూ. ఏయ్. బద్దరవతీ, రా, వచ్చెయ్...దాని గంటకూడా తాకట్టు పెట్టేసినాను. ఏంజేతును ?

భ : జలకమాడబోయే ఏనిగెకి గంటెందుకురా, దాన్ని వెంటనే తీసుకురా.

గా : రమ్మనూ. ఏయ్. బద్దరవతీ, రా రా... దాని చెరణాకోలకూడా కుదవ పెట్టేసినాను.

భ : బద్దరవతికి చెరణాకోల దేనికిరా. దాన్ని వెంటనే తీసుకురారా.

గా : ఓ, తెస్తా. ఏయ్ బద్దరవతీ, రా... అరెరే...

భ : అరెరే యేంది ?

గా : అరెరే నేను –

భ : నువ్వేంది ?

గా : అరెరే బద్దరవతి –

భ : బద్దరవతికేంది ? ··

గా : బద్దరవతినికూడా కుదవెట్టేసినాను.

(ప్రేక్షకుల నవ్వులు)

భ : నిన్నేమని ఏంలాభంలే. రాజవాహనం తాకట్టు పెట్టుకుని నీకుకల్లుపోసిన దానిదే అసలు తప్పు.

గా : అసలుకుమోసం రాకుండా చూసుకోమని నేను చెప్పనే చెప్పా.

భ : (ఉలిక్కిపడి) ఏంటా చప్పుడు ?

గా : తెల్సు. తెల్సు. బద్దరవతి కల్లుదుకాణంనుంచి తప్పించుకు పారిపోతోంది.

భ : ఏమన్నావ్ !

గా : వత్సరాజు వాసవదత్తతో సహా పారిపోయాడు.

భ : శుభం ఇంక నువు నీ యిష్టం వొచ్చినట్టు తాగి తందనాలాడొచ్చు.

గాత్ర: (పద్ధతిమార్చి) ఏయ్, ఎవరుతాగింది? ఆనందం దేనికనుకున్నావ్? మేమందరమూ యౌగంధరాయణులవారి చారులం. మమ్మల్ని వారు ఆయా స్థానాలలో ఉండమన్నారు. నేనిక్కడ వుండి నా అనుచరులకు సంకేతాలిస్తున్నాను. చూడు, కుబుసాలు విడిచిన కోడె తాచుల్లా వాళ్ళంతా ఎలా అటూ ఇటూ పరిగెత్తుతున్నారో.

(యుద్ధకోలాహలం)

(గొంతెత్తి) మిత్రులారా, ప్రభువుల ఉప్పుతిని వారికొరకు యుద్ధంలో ప్రాణాలు వదలనివారు నీచపు చావు చచ్చి నరకానికి పోతారు. (తనలో) ఆహా, అదుగో యౌగంధరాయణులవారు. పిచ్చివానివేషం విసర్జించి, ఒకచేత ఖడ్గమూ, రెండవచేత బంగారుడాలూ ధరించి, వత్సరాజును వెన్నంట యత్నించే సైనికులను నిలవేసి, చించి చెండాడుతున్నారు, ఆహా. ఏమి ఆయన పరాక్రమం. ఆయన ఖడ్గానికి ఎన్ని ఏనుగులు బలి అవుతున్నాయి. ఎందరు సైనికులు, ఎందరు అశ్వికులు... అయ్యో, హతవిధీ, యౌగంధరాయణులవారు చిక్కిపోయారు. ఆయనఖడ్గాన్ని విజయసుందరమనే ఏనుగు విరిచేసింది. ఆయనకు బదులు నేను వెళతాను.

(ప్రేక్షకుల హర్షధ్వానాలు)

(మర్నాడు ఒక సత్రంలో)

నిర్వా: ఒసేగౌతమీ, మల్లికా ... భద్రా, అంతా ఎక్కడ చచ్చారర్రా? రాత్రికి రాత్రే, ఆడా మగా అంతా కలిసి, యవనులమీదికి యుద్ధానికి వెళ్ళారా ఏం? (పళ్ళు బిగబట్టి) అడుగో వొస్తున్నాడు భద్రుడు—(అవులిస్తూ.) నీ నోరు బడ ... ఇంత పొద్దెక్కి ఇప్పుడు నిద్ర లేస్తున్నావర్రా?

భద్రు: ప్రదోషాన పచ్చి అబద్ధాలాడకండి. నేను కొంచెం ఆలస్యంగా లేచినమాట నిజమేగాని ఇంకా సూర్యోదయమే కాలేదు. అదీగాక రాత్రి నాటకానికి వెళ్ళాను.

నిర్వా: అఘోరించలేకపోయావు. నీ వాలకం చూస్తే, నాటకం చూడటమేకాదు. అందులో వేషంకూడా కట్టినట్టుంది. అదీగాక. పద, యాత్రికులు వచ్చేవేళ అయింది. నీ పని చూసుకో. ఇంకో ఘడియలో అతిథులులేచి అది కావాలి, యిదికావాలని అడుగుతారు. అడగరూ మరి? అడిగినదంతా అమర్చే ధర్మప్రభువు రాజసింహుడుండెగా.

1. అతి: శుభోదయం, శుభోదయం. అప్పుడే మీకు నిత్యకృత్యం ఆరంభమయినట్టున్నదే.

నిర్వా: కృత్యందాకారాలేదు, బాబూ. ఇంకా కృత్యాద్యవస్థలోనే వున్నాను.

1. అతి: రాత్రిచూసిన ఆ నాటకంలో కృత్యాద్యవస్థ అన్నది కనిపించనేలేదు. ఆ యౌగంధరాయణుడు సాలకుణ్ణిపిలిచినది మొదలు నాటకం విడిచిన బాణంలా వెళ్ళిందంటే నమ్మండి. మహాకవి, నాటకాలను గురించి వినటమేగాని, చూచింది లేదు. నిన్న మొదటిసారిగా చూశాను. జన్మ తరించింది. నభూతోనభవిష్యతి.

నిర్వా: నా దగ్గిర చెప్పకండి. యీనాటకాలు వచ్చి సాంకర్యం తెచ్చాయి. నాటకాలు చూసి వచ్చిన వాళ్ళకి పిన్నంతరం పెద్దంతరం లేకుండా పోయింది. వాడెవడో ఘటోత్కచుడువేశాట్ట అదేదో నాటకంలో. వాడికి బ్రహ్మరథం పట్టి నంతపని చేశారు. అల్పులమాట అటుంచండి. గొప్పవాళ్లుకూడా వాణ్ణి నెత్తి నెక్కిచ్చుకునిలాలనచెయ్యటమా? ఛీ,ఛీ.

1. అతి: అదే నాటకంలో, బాబుగారూ? దూతఘటోత్కచం అని ఒక నాటకం ఆడారుట—

నిర్వా: మధ్యమ అని యింకో నాటకం ఆడారు. నేరక, బుద్ధి గడ్డితిని, ఆ నాటకం చూశా. రామరామ, అంతా అభూత కల్పన. భారతంలో ఆ కథ ఎక్కడాలేదు.

1. అతి. దూతఘటోత్కచం కూడా కల్పనే. కల్పన అయితేనేమండీ?

నిర్వా: ఈ కల్పనలు చూశాక భారత రామాయణాది పవిత్ర గ్రంథాలపట్ల ప్రజలకు భక్తి తాత్పర్యాలేమైనా మిగులుతాయా?

2. అతి: (వస్తూ) అలా ఒక్కనాటికి అనకండి. మధ్యమ అన్నది మహారసవత్తరమైన హాస్యనాటిక.

నిర్వా: ఆ నాటకంలో మీకు హాస్యం కనిపించింది కాబోలు, నాకు జుగుప్సతప్ప వేరేమీ కలగలేదు.

2. అతి: మీకు హాస్యం తెలియదన్నమాట. నరభక్షకుడు ఆర్యధర్మాలు పాటించటంలో హాస్యంలేదుటండీ? ఆ బ్రాహ్మణ కుటుంబీకుడు మృత్యుభయంమధ్యా జీవితాశ మీదా ఊగిసలాడటంలో హాస్యంలేదూ? హిడింబకు భర్తమీద మనసుపోయి భోజనంవంకపెట్టి కొడుకును పంపటంలో హాస్యంలేదూ? అసలు ఏకాదశీ ఉపోషం వున్న మనిషి నరమాంసం పారణ కోరటంలోనే చచ్చేటంత హాస్యం ఉంది కాదుటండీ?

నిర్వా: (వెటకారంగా) అయ్యో, స్వర్ణకారుడు వచ్చి శ్రోత్రియ బ్రాహ్మణపాత్ర ధరించ

టంలో కూడా తమకు హాస్యం కని పించిందా ?

2. అతి : కేశవదాసుపాత్ర ధరించింది స్వర్ణ కారుడటండీ ? ఎంత నిర్దుష్టమైన నటన. ఎంత గొప్పనటుడు, నిజం బ్రాహ్మడే అనుకున్నాను సుమండీ.

నిర్వా : అయ్యా, మీరు మహాకవి అన్న పెద్ద మనిషి మ్లేచ్ఛులను సయితం మహర్షిని చేస్తాడు. అందుకేగదా, నాటకాల్లొచ్చి సాంకర్యం పెరుగుతోందని నా ఆఘో రింపు.

3. అతి : ఏ వి ధ మై న సాం క ర్యం, ప్రభువులూ ?

1. అతి : నాటకాలను గురించి మాట్లాడు తున్నారు.

3. అతి : తూర్పు తెల్లవారకముందే నాట కాలనుగురించి మాట్లాడటం దే ని కి, ప్రభువులూ ?

1. అతి : రాత్రి నాటకం జరిగింది.

3. అతి : అలాగా. నాకు తె లీ దు, ప్రభు వులూ. రాత్రి నేనువచ్చి చేరేసరికి చాలా పొద్దోయింది. ఇంతకీ ఏం నాటకం, ప్రభువులూ ?

1. అతి : ప్రతిజ్ఞా యౌగంధరాయణం.

3. అతి : అదేంకథో ?

1. అతి : వత్సరాజయినటువంటి ఉ ద య నుడు అవంతిరాజైన ప్రద్యోత మహా సేనుడి కుమార్తెను, వా స వ ద త్త ను పెళ్లాడే కథ.

3. అతి : అదా ? తెలుసులెండి, బృహత్కథ లోది కాదూ ?

1. అతి : దానికీ దీ ని కీ కొన్ని మార్పు లున్నాయిలెండి.

3. అతి : అయితే వత్సరాజు పాత్రా, వాసవ దత్తపాత్రా ఎవరు వేశారో తమకు తెలుసా, ప్రభువులూ ?

2. అతి : వత్సరాజూ, వా స వ ద త్తా నా ? ఆ పాత్రలు నాటకంలో లేవు, బాబూ.

3. అతి : (నమ్మలేకుండా) వత్సరాజు లేక వాసవదత్తా లేక వారిపెళ్ళి కథ నాటకం ఎలాగయింది, ప్ర భు వు లూ ? మీరు చూసింది మరో నాటకమేమో.

1. అతి : కాదులేవయ్యా, ఆ నా ట క మే నాయికా నాయకులు లేకుండా నాటకం రాయటం మహాకవికే చెల్లింది.

3. అతి : ఈ నాటకం కథ కా స్త చెవిని వేస్తారా, ప్రభువులూ ? వింటేగాని నమ్మ శక్యం కాకుండా వుంది.

2. అతి : జరిగింది జరిగినట్లు క్లు ప్తం గా చెప్పనా ?

నిర్వా : నే వెళ్ళాలి, కబుర్లువింటూ కూచో టానికి నాకు తీరదు. బోలెడంత పని... నిద్రమత్తు వదిలిందిట్రా, భద్రకా ? అతిధులకు ఏంకావాలో కనుక్కో.

భద్రు : చి త్తం, చి త్తం. అయ్యలూ, ఏమిటి సెలవు ?

3. అతి : మేం చాలా ముఖ్యమైన విషయం ముచ్చటించుకుంటున్నాం, మాకు అడ్డు రాకు.

భద్రు : తమకు నే నెందుకడ్డొస్తా నయ్యలూ? తమగోష్ఠి కానీండి. అనికనే తమపన్లు సూస్తాను.

3. అతి : తమరు నాటక కథ సెలవిచ్చారు కాదు.

2. అతి : అందుకే నేనూ వేచివున్నా. కథ వినండి. వత్సరాజు తన వీణతోసహా వింధ్యాటవిలో ఏనుగులవేటకు వెళ్ళాడు.

3. అతి : అడ్డొస్తున్నందుకు క్ష మిం చా లి. యీ నాటకంలో వత్సరాజు పాత్రే లేద న్నారు ?

2. అతి : మీ సందేహం సమంజసమైనదే. అయితే యీ నాటకంలో వచ్చిన చిక్కే మిటంటే ... వత్సరాజు పాత్ర రంగ స్థలంమీదికి రాకపోయినప్పటికీ ప్రేక్ష కులు అతన్నిగురించి ఆలోచించకుండా ఉండలేరు. మరి కథ వినండి. వత్సరాజు వింధ్యాటవికి వెళ్ళాడన్నానుకాదూ ! ఆ వింధ్యాటవిలోని ఒక వనంలో —

1. అతి : నాగవనంలెండి. అక్కడ ఏను గులు జాస్తి.

2. అతి : అవును, నాగవనంలో ప్రద్యోత మహాసేనుడు ఒక మాయఏనుగును పెట్టాడు. దానికోసం వత్సరాజు వస్తే బందీగా పట్టుకోవాలని మహాసేనుడి ఎత్తు. ఈ సంగతి యౌగంధరాయణుడికి తెలిసి సాలకుడనేవాణ్ణి పిలిచి —

భద్రు : ఆ సాలకుడి యేషం కట్టినవాడు నా స్నేహితుడే, అయ్యలూ.

2. అతి : అలాగట్రా ?

1. అతి : నిజంగానా. వాడుకూడా చక్కగా అభినయించాడుసుమా.

నిర్వా : (వస్తూ) అప్రాచ్యుడా, బోలెడంత పనిపెట్టుకుని పెద్దలతో మంతనాలాడ తావుట్రా ? అయ్యలారా, తమరు పని కుర్రాళ్లని పాడుకానివ్వకండి, తమకు పుణ్యం' ఉంటుంది.

1. అతి : వాణ్ణి మేం పాడుచెయ్యటమేమిటి? వాడే మమ్మల్ని పాడుచేస్తున్నాడు. నిన్నటి ప్రదర్శనంలో పాత్రధారులను కూడా వాడెరుగునట. కాస్తవివరాలు కనుక్కుందాం, తమరు వాణ్ణి తొందర చెయ్యకండి.

నిర్వా : ఈ మహానగరంలో యీ భద్రకుడికి తెలియని సంగతేలేదు. మీరు పరదేశీ యులు కావటంచేత మిమ్మల్ని వాడు యిట్టె

మోసగించ గలిగాడు. కౌటిల్యులవారు నిన్న ఏమేమి శాకపాకాలు అరగించారో అడిగి చూడండి, వాడు తడువుకోకుండా చెప్పేస్తాడు... నువ్వింకా యిక్కడే వున్నావేమిరా ?

భద్రు : నన్నెక్కడికి వెళ్ళమన్నారు ? ఈ అయ్యలు పని ఏమన్నా చెబితే చేద్దామనే నేనూ చూస్తున్నా. ఏంపని చెబితే అది చేస్తా. నాటకం గురించి చెప్పరా బద్దరకా అంటే చెబుతా మరి. ఏం జేసేది ? పనన్నాక చెయ్యాలి సిందేగా :

(అతిధులు నవ్వుతారు)

1. అతి : మహాకవి నిన్నుచూస్తే నీకోసం ఒక నాటకమే రాసునేమోరా,

భద్రు : ( నిట్టూర్చి ) నాకంత అదురుష్టమే ఉంటే యిక్కడ అంటగిన్నెలు తోముతానా అయ్యలూ ?

2. అతి : ఎవరు చూశార్రా ? నీవుకూడా గొప్పవాడివై పోతావేమో.

నిర్వా : వృషలులు చక్రవర్తులయే కాలం. నాకు సెలవిప్పించండి, మళ్ళీ తమ దర్శనంచేస్తా.

1. అతి : (ఆర్చర్యంతో) ఔరా, యీ పెద్ద మనిషిరాజద్రోహికింద ఎప్పుడోపట్టుబడి పోతాడు.

భద్రు : (రహస్యంగా) మళ్ళీ ఎక్కడా అనకండి. ఈ పెద్దమనిషి ఒకప్పుడు యవనులతో చెవులు కొరికినవాడే. బ్రాహ్మడని వదిలేశారు. ఆ నందుల కాలంలో అయితేనా, కొరత వేసి ఉండేవారు.

3. అతి : అంతమాత్రాన ఆ రోజులు మంచి వనుకునేవు. నందులు ప్రజాపీడకులు. వారితో పీడ విరగడై పోయింది. దేశం శాంతిసౌభాగ్యాలతో తులతూగుతున్నది: విదేశీ శత్రువులు చెల్లాచెదరై పోయారు. అంతా ఆ బ్రాహ్మణోత్తముడి చలవ. ఆ మౌర్యమహారాజు చలవ.

1. అతి : అన్నట్టు, యౌగంధరాయణుడి పాత్ర చాలావరకు చాణక్యులవారే. గమనించారా ?

2. అతి : (ఆశ్చర్యంతో) నాకు తట్టలేదు సుమా, అయితే వత్సరాజంటే——

1. అతి : మీకు సందేహందేనికీ ? చంద్రగుప్తమహారాజే.

2. అతి : భేష్, భేష్.

3. అతి : మనకథ సాగనేలేదు. అంతా పాతకథే నందురూ ?

1. అతి : కొద్ది తేడాలున్నాయి. ఉదాహరణకు చెబుతా ... యౌగంధరాయణుడు మంత్రాలూ, తంత్రాలూ చెయ్యడు. వసంతకుడి రూపం మార్చటమూ అదీ ఏమీలేదు. రుమణ్వంతుడుకూడా ఉజ్జయినికి యౌగంధరాయణుడి వెంటనే వెళతాడు. వాసవదత్తను ఎత్తుకుపోయే ఆలోచన యౌగంధరాయణుడిదికాదు. వత్సరాజుది. అయ్యో, ఇలాటి మార్పులు చాలా ఉన్నాయి.

భద్రు : అయ్యలూ, గాత్తర సేవకుడి ఆస్యం మాట చెప్పారుకారు.

1. అతి : భద్రవతి మావటివాడి మాటేనా నువు చెప్పేది. వాడు గట్టి హాస్యగాడు సుమా.

భద్రు : కవిగారి నాటకాలన్నిట్లోనూ వాడు యేషం కడతాడు, అయ్యలూ.

3. అతి : నాటకం చూడకపోతే పోయాను. అలా నగరం తిరిగి మహాకవి దర్శనమైనా చేసుకుందామా ఏం ?

2. అతి : దివ్యమైన ఆలోచన చెప్పారు. స్నానాదికాలు కానిద్దాం, లేవండి.

* * *

పుష్య : రాగల బ్రహ్మ సమాజం నాటికి మంచి ఉత్సవం ఏర్పాటు చేయాలని మహామంత్రుల వారికి మనవి.

ప్రాదే : పుష్యగుప్తులవారు తలుచుకుంటే సమాజం వైభవంగా జరుగుతుంది.

పురో : శత్రుభయం లేదుసరిగదా, అలాటి భయం ఏర్పడుతుందనే భయంకూడా లేని కారణంచేత ప్రకృతులు మహోత్సాహులై వున్నారు.

హాలు : నిన్నటి ప్రదర్శనం చూస్తుండగా నాకూ అదే అనిపించింది. భరతవాక్యానంతరం లేచివస్తుండగా ప్రజలు చెప్పుకునే మాటలు విన్నాను. యౌగంధరాయణుడు చాణక్యులవారేనని ఒకరన్నారు. కాకమరేవిటి ? ఇదంబ్రాహ్మ్యమిదం క్షాత్రం అన్న మాట ఆయనకే వర్తిస్తుంది...అన్నారు మరొకరు.

సుశ్రు : అసలు మహాకవి ఏ నాటకంరాసినా అందులో వర్తమాన చరిత్ర ఉట్టిపడుతుంది. ప్రేక్షకులు అది గ్రహించి ప్రదర్శనాన్ని చూచి మరింతగా ఆనందిస్తారు.

ప్రాదే : ఆ శత్రుసేనాపతి దగ్గరికి సాహసంతో వెళ్ళి బెదిరించివచ్చిన ఖిల్లుడి వృత్తాంతం మహాకవికి నేనే చెప్పాను. మరుసటి పుత్సవమప్పుడు చూద్దునుగదా దూతఘటోత్కచం తయారయింది. ఆ నాటకాన్ని ఆయన ఘడియన్నరకాలంలో రచించినట్టు వినికిడి. నిజానికి వ్యవధి కూడా లేదులెండి.

లాతు : మహాకవిగారి నాటకాలన్నీ నేను చూశాను. ఆనందించాను. అయితే

ఆయన మూలకథలను పూర్తిగా మార్చేస్తున్నారని ఒక ఆక్షేపణ వచ్చింది

సుబ్రు : కర్ణభారం, ఊరుభంగం, బాలచరిత మొదలైన వాటిని గురించేనా మీరనేది?

లాతు: అవి కొంతలోకొంతనయం. మధ్యమ తీసుకోండి — పూర్తిగా కల్పన. పంచరాత్రం తీసుకోండి — ఇంకా అన్యాయం. గోగ్రహణం పూర్తిగానే దుర్యోధనుడు పాండవులకి అర్థరాజ్యం యిచ్చేసి సఖ్యం చేసుకుంటాడు.

ప్రాదే : (నవ్వి) పంచరాత్రం చూసేవారికి నిజంగా పాండవులకథ పట్టిందంటారా? చంద్రగుప్త మహారాజు నందవంశజురాలైన దుర్ధరను పెండ్లాడటంతో శత్రు వంశాలైన నంద, మౌర్య వంశాలు ఏకమయాయి. అదే పంచరాత్రంలో మహాకవి సూచించారు. ఆ నాటకం చివరచెప్పిన భరతవాక్యం ద్రోణుడిదా మహామంత్రి అయిన చాణిక్యుల వారిదా చెప్పండి చూస్తాం.

సుబ్రు : చక్కగా సెలవిచ్చారు. నిన్నటి ప్రదర్శనంలో నాకు వర్తమాన చరిత్ర తప్ప వేరేమీ కనిపించలేదంటే నమ్మండి.

హాలు : పిచ్చివాడి వేషంలో యౌగంధరాయణుడు...చంద్రుణ్ణి రాహువు పట్టాడు, చంద్రగుప్తమహారాజు జ్ఞాపకంరాలేదూ? రాహువు ఎవరైఉంటారా అన్నది అంత స్పష్టంగా లేదు. ధననందుడి మంత్రి రాక్షసుడు కావచ్చునేమో.

సుబ్రు : అలా అదీ, యిదీ అని ఎంచకండి. నాటకమంతా చరిత్ర స్ఫురణలే. యౌగంధరాయణ ప్రతిజ్ఞ వింటుంటే చాణిక్యులవారి ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చింది. ఆనాడు వారు పాటలీపుత్రాన్ని పట్టుకోటానికి వస్తూ నందవంశ నిర్మూలనం చేయిస్తానని చేసిన ప్రతిజ్ఞమాట చెబుతున్నాను ... అలాగే వత్సరాజు ఏనుగు గురించి వింటుంటే ప్రసిద్ధమైన పౌరవుడి ఏనుగు స్ఫురించింది. అతనూ శత్రువునుభంజించిన మహావీరుడేగద... మహా మాత్రులేదో అనబోతున్నారు.

మహా : మీరంతాచెప్పేది పరమసత్యం. చాణుక్యులవారు మహాకవిని కలుసుకున్నప్పుడల్లా ఎందుకు పాదస్పర్శ చేయయత్నిస్తారని మీ ఉద్దేశం? రెండు సందర్భాలలో వారిద్దరూ సోదరభావాలు కలవారయారు. నందుల క్షుద్ర పరిపాలనను చాణుక్యులవారు తెలుసుకోక పూర్వమే మహాకవి ఎరుగును. ప్రజాపీడకులైన ఆ నందులను ఆయన తీవ్రంగా ద్వేషించారు. తిరిగి, దేశాంతరాలనుంచి విజయకాంక్షతో వచ్చిన శత్రువును మహాకవి మనసారా ద్వేషించారు. శత్రువుయొక్క అపజయం కోరటంలో ఆయన మహారాజుకూ, మహామంత్రికీ ఏమాత్రమూ తీసిపోరు.

లాతు : వర్తమాన ప్రయోజనాలు మహాకవి రచనలలో పుష్కలంగానే వున్నాయి. ఎవరు కాదనగలరు? కాని భవిష్యత్తు విషయం ఆలోచిస్తున్నాను. వేదాలు ఎంతకాలం నిలుస్తాయో వ్యాస వాల్మీకి రచనలు అంతకాలం నిలుస్తాయిగద. వారి రచనలను తారుమారుచేసి, తాత్కాలిక ప్రయోజనాల నిమిత్తం రచించబడిన యీ నాటకాలు ఎంతకాలం నిలుస్తాయని నా సందేహం.

సుబ్రు : (ఉద్రేకంగా) వ్యాసుడికీ మహాకవికీ పరీక్షపెట్టండి. ఇద్దరి రచనలనూ అగ్నిలోవెయ్యండి. వ్యాసరచన బూడిద అవుతుంది. మహాకవి రచన నిలబడుతుంది.

లాతు : (నవ్వి) మీ విశ్వాసానికి ఆధారమేమిటి?

సుబ్రు : అడిగారుగనుక చెబుతున్నాను. పాండవకథ తీసుకోండి. భారతయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో సమస్తమూ తుడిచిపెట్టుకు పోయింది. ప్రపంచంలో ఉండిన దృఢకాయులందరూ చచ్చారు. అల్పులూ, అర్భకులూ మిగిలారు. మానవచరిత్రలో ఇంతకంటె హీన పరిస్థితి ఉండబోదు. ఇది ఎందుకు నివారించబడలేదూ అని మీ రెన్నడైనా ప్రశ్నించుకున్నారా? దుర్యోధనాదులు నందులకన్న హీనులా? భీష్మ ద్రోణ విదుర సంజయాదులు ప్రాజ్ఞులుకారా? వారికి మానవజాతిపట్ల ఎలాటి ధర్మమూ లేదా? వారా ధర్మాన్ని ఎలా నిర్వర్తించారు? ఒక్క, ఒక్క బ్రాహ్మణుడు — యిల్లూ వాకిలీ లేనివాడు — అంగబలమూ, అర్థబలమూ సమకూర్చుకుని, నందవంశ నిర్మూలనంచేసి, సుఖప్రదమైన జీవితం భూమండలమంతా ఏర్పాటు చేశాడే, ఇందులో శతాంశం చేయగల పాత్రను వ్యాసుడు సృష్టించగలిగాడా?

(అందరూ చప్పట్లు కొడతారు)

మహాకవిది అతిసుకుమారమైన మనసు. ఆయన చిన్న చిన్న అన్యాయాలనుకూడా సహించలేడు — చరిత్రలో కానివ్వండి, సారస్వతంలో కానివ్వండి. అందుకే ఊరుభంగ నాటకం. ఆయన ప్రతిమా నాటకం రాశారు. చదవగా విన్నాను. నాటక కథ బయట పెట్టను. ప్రాచీన సారస్వతంలో దుష్టురాలుగా చిత్రించబడిన ఒక పాత్రను ఆయన

ఎలా సమర్థించారో తలుచుకుంటే - ఇదుగో చూడండి - నా రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. కవిఅంటే ఆయనే కవి. సృష్టి అంటే ఆయనదే సృష్టి.

ప్రాదే : మరొక గొప్ప విషయం కూడా చెప్పుకోవాలి. జైన బౌద్ధ కవులలాగా ఆయన తన మతతత్వాన్ని రచనలలోకి ఎక్కించలేదు. ఆయన నాటకాలలో సంఘధర్మమూ, పౌరధర్మమూ, మానవధర్మమూ ఉంటాయిగాని, మతధర్మాలు లేవు. ఆయన వైష్ణవుడు, వేదశాస్త్రాభిమాని. చంద్రగుప్త మహారాజేగాక మౌర్యులే వేదవిహిత ధర్మాలకు ఏనాడో దూరమయారు. మహారాజుకు మహావీరమతాభిమానం వున్నట్టు వినికిడి. ఈ వ్యత్యాసాలేవీ మహాకవిని కించత్తయినా బాధించవు.

సేవకు : అయ్యా...

మహా : ఏమిరా ?

సేవ : మహామంత్రివారి సేవకుడు వచ్చాడయ్యా. నటులచేత నాటకం చదివించబోతున్నారట. సపరివారంగా తమరిని రమ్మని చెప్పమన్నారంటయ్యా.

మహా: అంతకంటేనా?తామంతావస్తున్నారా?

అంతా : వస్తున్నాం.... ఆమాటఅడగాలా.. ఎంతగొప్ప అవకాశం....

* * *

(నటులచే ప్రతిమానాటిక పఠనం)

తాపసి : నందిలకా ? నందిలకా ...

నందిల ; అయ్యా, వచ్చా.

తాప : త్రైలోక్యవిద్రావణుడైన రావణుణ్ణి సంహరించి, రాక్షసులలో తప్ప పుట్టిన విభీషణుడికి రాజ్యాభిషేకంచేసి, విమల చరిత్ర ఆయిన సీతాదేవివి,వెంటబెట్టుకుని రాక్షస వానర ముఖ్యులలో శరచ్చంద్రాభి రాముడైన రాముడు వస్తున్నాడుగదా, వారందరి ఆతిథ్యానికి ఏర్పాట్లు పూర్తి చేయమని కులపతిగారంటున్నారు.

నంది: అన్ని ఏర్పాట్లూ అయాయి కానీండీ—

తాప : అయితే ఏమిటిమరి ?

నంది : విభీషణ బంధువులు రాక్షసులు. వారి భోజనంవిషయం కులపతిగారేమంటారో

తాప : ఏం ?

నంది : వారేం తింటామంటారో.

తాప : భయంలేదు. వారంతా విభీషణ విధేయులే.

నంది : సజ్జనులైన రాక్షసులకొక్క నమస్కారం.

(అంతా నవ్వుతారు)

తాప : అదుగో వచ్చాడు రామచంద్రప్రభువు.

రాము : బలవీరసంపన్నుడైన రావణాసురుణ్ణి సంహరించాను. విశుద్ధవర్తన గల సీతను తిరిగి పొందాను. గురువుల ఆజ్ఞ నెరవేర్చాను. ఈ ఆశ్రమంలో మళ్లీ అడుగుపెట్టాను.

తాప : అమ్మా, సీతా, నీవు తపస్వినులమధ్య ఏకాకిగా ఉంటే చూడలేకుండా ఉన్నాను. నీ భర్తచెంతకు వెళ్లు తల్లీ.

సీతా : ఇప్పటికింకా ఇదంతా కలలాగేఉంది. ఆర్యపుత్రులకు జయం.

రాము : మైథిలీ, యీ జనస్థానంలో ఒకప్పుడు మనం నాటిన యీ వృక్షాలను గుర్తించావా ?

సీత : గుర్తించాను. కాని ఆ నాడు నిలబడి చూస్తే వాటిమీది ప్రతి ఆకూ కనబడేది. ఇప్పుడు తలఎత్తి చూడవలసి వస్తోంది.

రాము : అలాగే జరుగుతుంది, కాలం ఎన్నో ఎగుడు దిగుళ్లు కల్గిస్తుంది. భరతుడు వచ్చినప్పుడు బెదిరిన లేళ్ల గుంపు జ్ఞాపకం ఉన్నదా ? మనవెంట తాబేలుండేది. బంగారులేడి కనిపించినప్పుడు మనం యిక్కడే కూచుని మాట్లాడుకున్నాం గదూ ?

సీత: (భయంగా)అదంతాజ్ఞాపకంచెయ్యవద్దు.

రాము : భయపడకు,అదంతా గతం...ఏమిటీ ధ్వానాలు ? ఒక్కసారిగా ఆశ్రమం నగరంలా అయిపోయిందే.

లక్ష్మ : ఆర్యపుత్రులకు జయం. పెద్ద సేనతోనూ, తల్లులతోనూ, భరతుడు మీ దర్శనానికి వస్తున్నాడు.

రాము : మైథిలీ, భరతుణ్ణీ, తల్లులనూ కళ్లు చారెడుచేసుకుని మరీ చూడు.

సీత : భరతుడు మంచిసమయానికే వచ్చాడు.

భరతు : అన్నా, కష్టాలనుంచి విముక్తుడవైన నిన్ను చూస్తే నాకు చాలా ఆనందంగా వుంది. ఇప్పుడు నీవు మబ్బులచాటునుంచి బయటికి వచ్చిన చంద్రుడిలాగున్నావు.

సుశ్రు : (రహస్యంగా) మహాకవి చంద్రగుప్తకాదు, కాదు చంద్రుణ్ణి ఒక్కక్షణం మరిచిపోరు, మనని మరిచిపోనివ్వరు,

రాము : తల్లులకు అభివాదం.

తల్లులు : చిరంజీవ. మీరందరూ కుశలంగా ఉన్నందుకు చాలా సంతోషం.

రాము : ధన్యుణ్ణి.

లక్ష్మ : తల్లులకు అభివాదం.

తల్లులు : చిరంజీవ.

లక్ష్మ : ధన్యుణ్ణి.

సీత : ఆర్యలకు నమస్కారం.

తల్లి : బిడ్డా, చిరమంగలాభవ.

సీత : ధన్యురాలిని.

భరతు : అమ్మా, నేను భరతుణ్ణి,నమస్కారం.

సీత : చిరసందారభవ.

భరతు : ధన్యుణ్ణి. అన్నా, రాజ్యం స్వీకరించు,

రాము : ఏం నాయనా ?

కైకేయి : నా చిరకాలవాంఛ తీరటానికి, తండ్రీ.

శత్రు : సీతారామ లక్ష్మణులకు అభివాదం.

రాము : ఆయుష్మాన్ భవ.

సీత : చిరంజీవ.

లక్ష్మ : ఆయుష్మాన్ భవ.

శత్రు : ధన్యుణ్ణి. అన్నా, వశిష్ఠదేవాదులు ప్రకృతులను వెంటబెట్టుకుని అభిషేక జలంతో నీ దర్శనార్థం వచ్చి వున్నారు. వారంతా నీ రాజ్యాభిషేకం చూడాలని తొందరపడుతున్నారు.

కైకేయి : వెళ్ళు నాయనా. అభిషేకం చేయించుకో.

రాము : తల్లిగారి ఆజ్ఞ.

భర : అమ్మా,రామపట్టాభిషేకానికి ఇంతగా ఆత్రపడేదానివి రాముణ్ణి అడవికెందుకు పంపావు ?

కైకే: ప్రారబ్ధం నాయనా, మీ తండ్రిగారికి ఆ మునిపెట్టినశాపం ఇంత చేసింది. పుత్ర శోకంతో మీ తండ్రి చావవలసి ఉంది గనకనే రామవనవాసం అన్నమాట నా నోటవచ్చింది. రాజ్యకాంక్షతో నేను నీకు రాజ్యం కోరాననుకున్నావా ?

భర: అయితేమటుకు రాముడికి పధ్నాలుగేళ్ళ వనవాసమా, అమ్మా ? ఎంత ఘోరం.

కైకే: (నిట్టూర్చి) పధ్నాలుగు రోజులు అన బోతే నోటివెంట పధ్నాలుగేళ్ళని వచ్చింది. నాయనా.

(ప్రేక్షకులలో హాహాకారాలు)

భర: అడుగో రాముడు,కిరీటఛత్రాలు ధరించి శుక్లపక్ష చంద్రుడివలె వెలుగుతున్నాడు.

శత్రు: చంద్రోదయం కాగానే చీకట్లు నశించి ప్రశాంతం కలిగినట్టుగా ఇక్ష్వాకు వంశం తన మాలిన్యాన్ని పోగొట్టుకొని వెలుగొందుతున్నది.

రాము:అదిగో పుష్పకం వచ్చింది. అందరూ ఎక్కండి. అయోధ్యకు పోదాం.

లక్ష్మ : ఇవాళ అయోధ్యావాసులు నిన్ను చుక్కలమధ్య చంద్రుడులాగా చూసి పరమానంద భరితులవుతారు.

మహా : యధారామశ్చ జానక్యా—బంధుభిశ్చ సమాగతహః
తథాలక్ష్మసమాయుక్తో — రాజాభూమిం ప్రశాస్తు నః.

(హర్ష ధ్వానాలు)

[ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రంవారి సౌజన్యంతో]

---

# పారిశ్రామిక విశేషాలు

## సింగరేణి కాలరీస్ కంపెనీ

సింగరేణి కాలరీస్ కంపెనీకి చెందిన గనులనుంచి 1963 మార్చిలో 2,72,225.9 టన్నుల బొగ్గు ఉత్పత్తిఅయింది. కాగా క్రిందటి సంవత్సరం ఇదే కాలంలో 2,28,403 టన్నుల బొగ్గు ఉత్పత్తి అయింది.

1963 మార్చి నెలాఖరువరకు 8,18,801.8 టన్నుల బొగ్గు ఉత్పత్తి అయింది. గత సంవత్సరం ఇదే కాలంలో 7,07,146.8 టన్నుల ఉత్పత్తి జరిగింది.

1962-63 వ సంవత్సరములో అంటే 1962 ఏప్రిల్ నుంచి 1963 మార్చి వరకు 32,32,186.6 టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది. కాగా ఈ కాలానికి పెట్టుకున్న లక్ష్యం 32 లక్షల టన్నులు. అంటే లక్ష్యాన్ని మించి 32,186.6 టన్నుల బొగ్గు ఉత్పత్తి అధికంగా జరిగింది.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

ఈ నెలలో 60631 మె. ట. ల చెరకును పిండారు. 57190 బస్తాల చక్కెరను ఉత్పత్తిచేశారు.

1962-63 ఋతువులో ఈ ఫ్యాక్టరీకి స్వంత క్షేత్రాలనుంచీ, రైతుల నుంచీ దిగువ విధంగా చెరకు అందింది :—

| | | |
|---|---|---|
| 1. సెంట్రల్ రైల్వే | 1,01,826 | మె. ట. |
| 2. ఎల్.టి. రైల్వే | 2,67,903 | ,, |
| 3. రోడ్డు | 2,09,310 | ,, |
| మొత్తం | 5,79,039 | ,, |

నెలకు రూ. 500/-లకు పైగా పొందుతున్న ఉద్యోగులకు 1962 అక్టోబరు మొదటి తేదీనుంచి గ్రాట్యుటీ చెల్లింపును నిజాం చక్కెర ఫ్యాక్టరీ (లిమిటెడ్) మేనేజిమెంటు ఆమోదించింది. లోగడ ఈ సౌకర్యం నెలకు రూ. 500/- లవరకు పొందుతున్న ఉద్యోగులకు మాత్రమే వర్తింపజేయబడింది. పై సౌకర్యాన్ని దాదాపు 3,000 మంది ఉద్యోగులు పొందుతారు.

కాన్పూరులోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ షుగర్ టెక్నాలజీకి చెందిన విస్తరణ బృందంవారు 1963 ఏప్రెల్ 11 వతేదీ నుంచి 18 వతేదీ వరకు నిజాం చక్కెర ఫ్యాక్టరీ రసాయనిక సాంకేతిక సర్వే జరిపారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాంతీయ కార్మికశాఖ కమీషనరు, డిప్యూటీ కమీషనరు 1963 ఏప్రెల్ 24 వ తేదీన ఫ్యాక్టరీని సందర్శించారు.

ఉద్యోగ విషయాలకు సంబంధించిన ప్రాంతీయ సలహా సంఘం 1963 ఏప్రిల్ 5 వ తేదీన షక్కర్ నగర్‌లో సమావేశమైంది.

## ప్రభుత్వ వస్తువిక్రయశాల, హైద్రాబాద్

అమెరికా రాయబారి కార్యాలయానికి చెందిన వాణిజ్య వ్యవహారాల కాన్సెలర్ శ్రీ కార్నిగ్రాహమ్, ఆయన సతీమణి 1963 జనవరి 25 వ తేదీన, మన చేతి పరిశ్రమ ఉత్పత్తుల ఎగుమతిని పెంపొందించే సందర్భంగా వస్తువిక్రయశాలను సందర్శించారు. కాన్సెలర్ చేతిపరిశ్రమ ఉత్పత్తులను ప్రశంసిస్తూ, అమెరికాకు జపాను, చైనా, పర్షియా మొదలైన ఇతర దేశాలనుంచి దిగుమతిఅయ్యే ఇలాంటి ఉత్పత్తులలో పోటీకి నిలువడానికై ఈ వస్తువుల ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించుకోవాలని సూచించారు. అమెరికాలో స్థలాభావం ఎక్కువ అనీ కనుక ఎగుమతి చేసే వస్తువులు అమెరికా గృహంలో అలంకరణకు పెద్దదిగా కన్పించేంతటి భారీ సైజులో వుండకూడదని కూడా ఆయన చెప్పారు. హిమ్రూ, కలంకారీ పక్కబట్టలకు వాటి ప్రాచ్యనమూనాలు, సంప్రదాయ సిద్ధమైన నమూనాల మూలంగా అమెరికాలో మంచి గిరాకీ వుంటుందని శ్రీమతి గ్రాహంలస్లీఅన్నారు. అమెరికాలో అలంకరణలో ప్రత్యేక నిపుణత పొందినవారినీ, అలంకరణ వస్తువులను తయారుచేసేవారినీ సంప్రదించడం భావ్యంగా వుంటుందని చెబుతూ న్యూయార్కులోని ఇంటీరియర్ డెకొరేటర్స్ అసోసియేషన్ను సంప్రదించవచ్చని సూచించారు. తక్షణమే మనకు ప్రయోజనకారులుగా వుండగల దిగువ పేర్కొన్న వారి చిరునామాలను కూడా ఆమె పేర్కొన్నారు

*వస్త్రాలు :*

1. వాల్‌పోల్ బ్రదర్స్, వాషింగ్టన్ డి. సి.
2. జూలియస్ గార్‌ఫింకిలె, వాషింగ్టన్, డి. సి.

*చేతిపరిశ్రమ వస్తువులు :*

1. లార్డ్ టెయిలర్, న్యూయార్క్
2. నీమన్ మార్కస్, డల్లస్, టెక్సాస్
3. ఉడ్‌వర్డ్, లూథియఫ్, వాషింగ్టన్, డి. సి.



# దండోరా

"మాల్యశ్రీ"

పరవాడు మనమీద
కన్ను వేశాడురా!
దండుతో పొలిమేర
తిష్ట వేశాడురా!
మనధాత్రి కబళింప
కలలు కంటున్నాడు;
కూహ కమ్ములు పన్ని
పొంచుకొనియున్నాడు.

పంచశీలనె పటా
పంచలము చేశాడు;
మిత్రద్రోహము చేసి
సిగ్గుపడకున్నాడు;
గరళ కంఠముతోడ
శాంతి ప్రవచిస్తాడు;
కుటిల హృదయముతోడ
రాజీకి వస్తాడు.

కాల సర్పమునింక
నమ్మంగ వలదురా!
కనిపెట్టి ఎప్పుడో
కాటు వేస్తుందిరా!
గోముఖవ్యాఘ్రమని
తెలిసికొంటిమి కదా?
మన శిరమ్మున దాని
నుంచుకొను టెట్లురా?

మనపూజ్య జనయిత్రి
కోటీర రత్నమ్ము;
విశ్వభారత గౌర
వోత్కర్ష చిహ్నమ్ము;
మన కాళిదాసు
తమి వర్ణించు కొన్నట్టి
హిమ ధరాధరమునే
రిపుల పాల్చేతుమా?

స్వాతంత్ర్యమే ఎపుడు
మన జన్మహక్కురా;
అతుల విక్రమ స్ఫూర్తి
మన జీవితమ్మురా;
పగవాని పాలనము
నంగీకరింతుమా?
పరదాస్య బంధాల
నొదిగి జీవింతుమా?

స్వేచ్ఛమన జీవమ్ము;
సత్యమే జీవితము—
మన మహోదర్శాల
బలిపెట్టి మనలేము;
బొందిలో ప్రాణమ్ము
లున్నంత కాలమ్ము
ప్రతిఘటింతము
ప్రధనమందు ప్రత్యర్థులను.

ప్రళయాగ్ని పర్వతాలై
ప్రబద్ధులై రండి!
క్రుద్ధవ్యాఘ్రమ్ములై
గాండ్రించి దూరండి!
వీరాభిమన్యులై
విక్రమము చూపండి!
విలయ రుద్రులవోలె
తాండవము సల్పండి!

భరత యువకుల్లార!
వీర భద్రుల్లార!
వజ్ర సంకల్పాన
లంఘించి లేవండి!
వీర వనితల్లార!
చండకాళికలార!
దుర్వార శక్తితో
పగతురను చెండండి!

మరఫిరంగులకైన
యెదురొడ్డి నిలవాలి!
మనధాత్రికోసమై
రక్తమర్పించాలి!
భారతీయుల శౌర్య
పటిమ చాటించాలి!
స్వాతంత్ర్య గౌరవము
శోభింపచేయాలి!

ప్రాంతీయ భేదాలు
వర్గవైషమ్యాలు
విడనాడి విశ్వభారత
మహాజనమంత
ఒక త్రాట - ఒక బాట —
ఒక్కటే శక్తిగా
కదలాలి ! కదలాలి !
పరుల నదలించాలి !!

వీరమాతల్లార !
సుతుల దీవించండి !
వీరపత్నుల్లార ;
వీరహారతు లిచ్చి
పతుల సమరావనికి
వేగ పంపించండి !
శత్రువుల చెండాడి
జయము గొనివస్తారు !

పడుచు కన్నియలార !
కనుల ననలము రేగ
జడదేక వీరులై
కీతిని వెల్గొందాలి;
ఉగ్గుబాలతో వీర
రసము త్రావించండి ;
లాలిపాటలు క్రాంతి
గీతాలు పాడండి !

పాలు త్రాగెడి పాప
లల్లదే పిడికిళ్లు
బిగియించి పొలికేక
లేసి గర్జించారు !
చూలాంధ్ర గర్భాల,
చూడరా యీనాడు,
పౌరుషమ్ములు
పండుతున్నాయి దండిగా !

పడగెత్తి బుసకొట్టు
కాలసర్పము కోర
లను పిండి విషము
క్రక్కించాలి రారండి !
మన శిరస్సున చేరి
మన శాంతి బలిగొన్న
చైనీయ శనినింక
పారద్రోలగ లెండి !

ధవళ నిర్మల రమ్య
హిమగిరీంద్రము మీద
అంధకారమువోలె
అలముకొను మేఘాల
తొలగించి వెండి
వెన్నెల వెలుగు వెల్లువలు
దేదీప్యమానముగ
దీపింపజేయాలి !

మిత్ర దేశాలన్ని
సాయపడుతున్నాయి;
సత్యమ్ము, ధర్మమ్ము
మనవైపు నున్నాయి;
గుండె గుండెకు
ప్రతీకారాగ్ని జ్వాలికల
మండించి లేవండి;
మనదిరా విజయమ్ము !



# తెలుగు నాటకం

ఎస్. ఎమ్. వై. శాస్త్రి

గత శతాబ్దంలో ఎనభయ్యో సంవత్సరం వరకూ తెలుగు సాహిత్యం సర్వతో ముఖంగా వికాసం చెందక పోవడానికి కారణం నాటకాన్ని నిర్లక్ష్యం చేయడమే. వెయ్యి సంవత్సరాలకు పైగా తెలుగు సాహిత్యం, సంస్కృత సాహిత్య ప్రభావం కారణంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. సంస్కృత సాహిత్య సాంప్రదాయమే తెలుగు సాహిత్య వికాసానికి ప్రబలమైన ఆలంబనం. కాని సంస్కృత సాహిత్యంలో మాత్రమే నాటకం పరాకాష్ఠ నందుకోవడం చాలా విచిత్రమైన విషయం. సంస్కృతంతో పాటు తెలుగు కూడా అన్ని సాహిత్య శాఖల్లోనూ అభివృద్ధి చెందినా నాటక రంగంలో మాత్రం నిర్లక్ష్యం ప్రదర్శించ బడింది. తెలుగు కవులు సంస్కృత నాటకాల నుండే యితివృత్తాలను ఏరుకుని రచనలు చేసినప్పటికీ అవి కేవలం కావ్యాలే అయ్యాయిగాని నాటకాలు కాలేదు. దీనికి తగిన కారణాలు చెప్పుకోవడం కష్టమే. కాని తెలుగు సాహిత్యం అభివృద్ధి చెందుతూ వున్న రోజుల్లో సంస్కృత నాటకాలను ప్రదర్శించే సాంప్రదాయం క్రమంగా మృగ్యమైపోయి వుండవచ్చు. అందుచేత దృశ్య, కావ్యాలు కేవలం కావ్యాలుగా మాత్రమే తెలుగు సాహితీవేత్తలకు మిగిలి పోయాయి. అందుచేత వారికి పద్యమూ, దాని నిర్మాణము తప్ప సంస్కృత నాటకాన్ని గూర్చిన దృష్టే లేదు. తమ భావాలను వ్యక్తం చేసేందుకై సాధారణంగా తమకు పరిచయమైన సాహిత్య ప్రక్రియలనే ఎన్నుకుని దానిలోనే సుందర సురూప కల్పనలు చేసి, భాషపై అధికారాన్ని సంపాదించడానికై ప్రయత్నిస్తుంటారు.

అంతమాత్రంచేత ఆంధ్రదేశంలో నాటక వినోద ప్రదర్శనలే లేవనుకోవలసిన పని లేదు. అవి వున్నాయి. కాని అవి సంస్కృత నాటకాలకు పూర్తిగా విభిన్నమైనవీ, విరుద్ధమైనవీనూ. వీధి నాటకాలూ భాగవతాలు అనబడే యక్షగానాలు మొదలయిన దేశీయాలు ఆ కోవలోనివి. ఇవి సంస్కృత సాహిత్య సంప్రదాయానికి విరుద్ధమైనవి. ఇవి ప్రత్యేకించి నృత్య నాటకాలుకాని వట్టి నాటకాలు కావు. వీటిల్లో పాత్రలు తమను తామే పరిచయం చేసుకుంటాయి. విదూషకుడు అనబడే సూత్రధారి నాటకం చివర వరకూ వుండి దేవతలూ, దెయ్యాలు, మనుష్య పాత్రలతో ఒకేవిధంగా పరిహాసక సంభాషణ లాడుతూ, సంఘటనలను సూచన ప్రాయంగా తెలియజేస్తూ, అవసరం వచ్చినప్పుడు అవకాశం లభించినప్పుడు ఆయా విషయాలను విశేషాలను నాటకానికి అన్వయిస్తూ తెలియజేస్తూ వుంటాడు. యీ దేశీయ నాటకాలు విశేష ప్రతిష్ఠలను సంపాదించినప్పటికీ మధుర, తంజావూరు పరిపాలకులయిన నాయక రాజుల కాలంలో సాహితీ వేత్తలు సంస్కృత నాటకాలను గౌరవించినట్టుగా యీ రకపు ప్రదర్శనలను గౌరవించలేక పోయారు. అంతేగాక యివి ఏవిధంగానూ సంస్కృత నాటకాలకు సరిపోవని నిర్ణయించారు. ఆపైని కూచిపూడి ప్రదర్శకులు ప్రదర్శించే భాగవతం, భామా కలాపం విశేషంగా కొనియాడబడినప్పటికిన్నీ అవి కేవలం నృత్య, సంగీతాల సమ్మేళనమే తప్ప నిజమైన నాటకం కాలేదు. అధునాతన తెలుగు నాటకాలకు యీ దేశీయ నాటకాలు ఏమాత్రమూ కారణభూతాలు కావు.

ఆంగ్లేయుల సాహచర్యం కారణంగా తెలుగు సాహిత్యం పునరుద్ధరింపబడిన అనంతరం గత శతాబ్ది అరవయ్యో సంవత్సరంలో తెలుగులో నాటకాన్ని ప్రవేశపెట్టాలనే కోరిక కవులలో, భాషాకోవిదులలో ప్రబలం కాజొచ్చింది. ఇటీవలి పరిశోధనల ఫలితంగా శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి 'మంజరి మధుకరీయం' అనే తొలి తెలుగు నాటకాన్ని 1860 ప్రాంతంలో వ్రాశారని తెలుస్తోంది. వారు మచిలీపట్టణంలో నోబుల్ స్కూలులో తెలుగు అధ్యాపకులుగా పని చేస్తూ వుండేవారు. భట్టనారాయణ విరచితమైన 'వేణీ సంహారా'న్ని కూడా ఆయన,

అనువదించారు. ధర్మభట్టుని 'నరకాసుర విజయ వ్యాయోగా'న్ని శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులు (మద్రాసు) 1872 లో అనువదించి ప్రచురించారు. రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి నందకరాజ్యం అనే నాటకాన్ని వ్రాశారు. అచ్చుయిన తొలి తెలుగు నాటకం అదే (1880). కాని యివి తెలుగు నాటక వికాసానికి అంతగా వుపయోగకరములు కాలేదుకాని తెలుగు నాటకాల ఆవశ్యకతను గుర్తింపజేశాయి.

సరిగ్గా యిదేసమయంలో అంటే 1878-81 మహారాష్ట్ర, పార్సీ నాటక సమాజాలు ఆంధ్రదేశంలో తిరిగి ఉరుదూలోనూ, హిందీలోనూ నాటకాలను ప్రదర్శించడం ప్రారంభించాయి. ఈ ప్రదర్శనలు విశేషంగా జనాన్ని ఆకర్షించాయి. రంగురంగుల తెరల వల్లా, నటకులు పాత్రలకు న్యాయం చేకూర్చడంవల్లా, పతాక సన్నివేశాల్లోని వేగంవల్లా, ఉద్రేకపూరితమైన నటన వల్లా ప్రేక్షకులు విపరీతంగా ఆకర్షింపబడుతుండేవారు. దేశీయ నటకులకుకూడా అటువంటి నాటకాలను ప్రదర్శించవలసిన అవసరం కలిగింది. అవకాశాలు లభించాయి.

పార్సీ సమాజాలు రాయలసీమలో పర్యటన చేసిన అనంతరం ఎన్నో స్థానిక సమాజాలు తలయెత్తాయి. అటువంటి సమాజాల్లో బళ్ళారి సరస వినోదినీ సభ ఒకటి. ధర్మవరం కృష్ణమాచారిగారు ఆ సమాజంలోని నటకులే. స్వయంగా ఆయన పండితుడు. తెలుగులో ప్రదర్శించడానికి అనువుగా నాటకాల్ని వ్రాయాలనే కోరిక ఆయనలో తలయెత్తింది. 1886 లో చిత్రనళీయం అనే నాటకాన్ని వ్రాశారు. తాను తొలుదొల్త తెలుగులో కావ్యాన్ని వ్రాయాలనుకున్నాననీ, కాని వినోదినీసభ వారి సాహచర్యం కారణంగా ఆ అభిప్రాయాన్ని మార్చుకుని నాటకాన్ని వ్రాశానని ఈ పుస్తక పీఠికలో తెలియజేశారు. ఒక నటకుడుగా తను వ్రాసిన నాటకాన్ని సభవారు ప్రదర్శించాలనే కోరికతో మొట్టమొదట కన్నడంలో నాటకాన్ని వ్రాశారు. తెలుగులో ఒక నాటకాన్ని వ్రాయదలంచినప్పుడు, ఆయన స్నేహితులు, పేరు సంపాదించగల నాటకం వ్రాయడానికి తెలుగు అనువైన భాషకాదని అభిప్రాయపడ్డారు. కాని ఆ అభిప్రాయం సరియైనదికాదని, మంచి నాటకాలను తెలుగులో కూడా వ్రాయవచ్చు నని తెలియజెప్పేందుకై ఆయన చిత్రనళీయాన్ని వ్రాశారు. అది సాహిత్యపరంగానూ, ప్రదర్శనా పరంగానూ ఉన్నత ప్రమాణాలను అందుకుంది. ఆంధ్రదేశంలో వ్యాపార నాటక సమాజాలు తలయెత్తే తొలి రోజుల్లో యీ నాటకం తరచుగా ప్రదర్శించబడడమే గాక విశేష జనాన్ని ఆకట్టుకొనేది. బళ్ళారి ఆవిధంగా తెలుగు నాటకానికి పుట్టిల్లయ్యింది. చిత్రనళీయం ఆంధ్ర రంగస్థలానికి తొలి తెలుగు నాటకం. ఈ నాటకంతో ప్రారంభించిన ధర్మవరం కృష్ణమాచారిగారు ఆపైని సుమారు ముప్ఫై పైచిలుకు నాటకాలను వ్రాశారు. ఇవన్నీ సాహిత్యపరంగా ఉత్కృష్టమైనవే గాక వీటిల్లో చాలా నాటకాలు రంగస్థలంమీద రక్తి కట్టాయి తన నాటకాలకు యితివృత్తాలను ఎన్నుకోవడంలో విశాల దృష్టిని ప్రదర్శించారు. పౌరాణిక కథలనుండి గాని, చారిత్రక సంఘటనలనుండి గాని వేటినుండి యితివృత్తాలను ఎన్నుకున్నా ఒకేతీరున విజయాన్ని సాధించగలిగారు. అంతేగాదు, వీరు విషాదాంత నాటకాలను వ్రాసి కొత్త పుంత తొక్కారు. వీరి బహుముఖ పరిజ్ఞానానికి, సాహిత్య, నాటక్ష రంగాలలో ప్రావీణ్యానికి వీరికి 'ఆంధ్ర నాటక పితామహుడు' అనే బిరుదు నిచ్చి గౌరవించారు.

ఆ సమయంలోనే బళ్ళారినుండి కోలాచలం శ్రీనివాసరావు అనే మరో నాటక రచయిత సుమనోరమ సభ అనే నాటక సమాజానికి నాటకాల్ని వ్రాస్తుండేవారు. ఆయన వ్రాసిన నాటకాలలో రామరాజు, చాంద్ బీబీ, శిలాదిత్య, కాళిదాసు అనేవి చెప్పుకోదగినవి. వీరికి చరిత్రాత్మక నాటకాలమీద మక్కువ మెండు. విజయనగర సామ్రాజ్యపు అంతిమ దినాలకు సంబంధించిన రామరాజు అనే వీరి నాటకం మహమ్మదీయులను కించపరచేదిగా వున్నదన్న కారణంచేత కొంతకాలంపాటు నిషేధించబడింది. డి. గోపాలాచార్యులు అనే నాటక రచయిత కూడా యీ ప్రాంతం వారే. వీరి భక్త రామదాసు రంగస్థలంమీద రక్తికట్టి ప్రశంసల్ని అందుకుంది.

ఉత్తర సర్కారులనబడే కోస్తా ప్రాంతంలోకూడా యించుమించు యీ విధమైన అభివృద్ధే సాధించబడింది. ఈ ప్రాంతంలో జరిగిన కృషికి మెరుగులు దిద్దిన ఆసక్తికరమైన చిన్న సంఘటన ఒకటి వుంది. ఆ రోజుల్లో సర్కారు ప్రాంతాల్లో పర్యటించే మరాఠీ నాటక సమాజాల్లో 'ధార్వాడ' కంపెనీ ఒకటి. ఆ కంపెనీ మేనేజరు వామనభట్ అనే ఆయన కంపెనీ యజమానులతో పోట్లాడి, విడిపోయి 'ఏలూరు కంపెనీ' అనే సొంత కంపెనీని స్థాపించి హిందీ నాటకాల్ని ప్రదర్శించడం ప్రారంభించాడు. అందుకై ఉత్సాహవంతులైన యువకుల్ని చేరదీశాడు. వీరిలో కొద్దిమంది మాత్రమే హిందీలో మంచి నటకులుగా ప్రసిద్ధిచెందారు. ఈ సంఘటన తెలుగులో నాటకాల ఆవశ్యకతను గుర్తించడానికి కారణభూతమైంది. చాలా

ఊళ్ళల్లో తెలుగు నాటకాలను ప్రదర్శిం చేందుకు నాటకసమాజాలు తలెత్తాయి. తెలుగు నాటకాల అవసరం అధికమైంది. బళ్ళారిలోలాగానే సర్కారుల్లో కూడా సాహితీవేత్తలు పలువురు నాటకాలు వ్రాసేం దుకు పూనుకున్నారు నాటకాల కొరతను తీర్చుకోవడానికై బహుకొద్ది నాటక సమా జాలు ప్రసిద్ధులయిన కవులను నాటకాలను వ్రాయడానికై నియోగిస్తుండేవి. ఆ విధంగా నాటకాల్ని వ్రాయించి ప్రదర్శించే కేంద్రంగా రాజమహేంద్రవరం ప్రసిద్ధి చెందింది.

ఇచ్చటనుండి కందుకూరి వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయుడు, చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారలు ఉత్కృష్టమైన నాటకాలు వ్రాసి ప్రసిద్ధులయ్యారు. కందుకూరి వీరేశ లింగంగారు సంఘసంస్కర్తలు. తమ సంఘ సంస్కరణోద్యమంలో ప్రహసనాన్ని ఆయన ఆయుధంగా ఉపయోగించుకున్నారు. వీరి రచనల్లోని వ్యంగ్యం అశేష ప్రజానీ కాన్ని ఒక్క ఊపు ఊపింది. అవన్నీ రంగ స్థలంమీద రక్తికట్టినవే అయినా యితి వృత్తాలు ఆనాటి సాంఘిక జీవితానికి సంబం ధించినవి కావడంవలన, కాలగతిలో పాత బడినందున యిప్పుడు ప్రదర్శనకు వీలయి నవిగా నిలబడలేవు. ఆయన ఇంగ్లీషు (షేక్స్పియర్, షెరిడన్), సంస్కృతము-రెండింటినుంచీ నాటకాల్ని-అనుసరిస్తుండే వారు. కాళిదాసునాటకం ఆధారంగా వీరు వ్రాసిన శకుంతల ప్రేక్షకుల్ని, పాఠకుల్ని విశేషంగా ఆకర్షించింది.

వడ్డాది సుబ్బారాయుడుగారు సాహి త్యంలో సనాతన తెగకు చెందినవారు. సంస్కృతంనుండి వేణీ సంహారాన్ని తెలుగులోకి అనువాదంచేశారు. ఆ ప్రదర్శన ప్రజారంజకమైంది. చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు రంగస్థలంతో బహుసన్ని హితంగావున్న వ్యక్తి. స్వతః పండితుడు ఆయన. చిన్నతనంలోనే దృష్టి మందగించి త్వరలోనే పూర్తిదృష్టిలోపం వచ్చేసింది. అయినప్పటికీ ఆ లోపం వారి జీవన పథంలో ఆశయాలపంటను పండించుకోవ డానికిగాని, ఉత్సాహంతో ఉరకలెత్తుతూ గమ్యాన్ని చేరుకోవడానికిగాని ఆటంకం కాలేదు. మనుషుల ఆచారవ్యవహారాల్ని పరిహసిస్తూ వారు చాలా ప్రహసనాలు వ్రాశారు. ఇవి వీరేశలింగంగారి ప్రహస నాలకన్నా సున్నితంగా వుంటాయి. సమ కాలీన విషయాలనే యితివృత్తాలుగా తీసు కున్నప్పటికీ వీటిల్లోని సంఘటనలు దేశ కాల పాత్రలకు అతీతమైనవికావడంవలన యీనాటికీ వాటిల్లో నవ్యత కనిపిస్తూనే వుంటుంది. అంతేగాక ఒకానొక నాటక సమాజానికై నాటకాలువ్రాసే నాటకకర్త ఆయన. పురాణాలనుండి యితివృత్తాన్ని ఏరుకున్నప్పటికీ వాటిని స్వంతంగా, స్వతంత్రంగా మలచి చక్కటి నాటకాల్ని వ్రాశారు. గయోపాఖ్యానం, ప్రసన్న యాదవం, పారిజాతాపహరణం — యీ మూడు ప్రదర్శనయోగ్యాలై ప్రసిద్ధిచెందాయి. వీటిల్లో మొట్టమొదటిది కొంతకాలంపాటు విశేష ప్రచారాన్నిపొంది ఆదరించబడింది. వీరు భాసుని నాటకాల్లో చిన్నవాటిని కొన్నిం టిని అనువదించారు. అవన్నీ పాఠక లోకాన్ని సంతృప్తి పరిచాయికాని ప్రదర్శన యోగ్యాలు కాలేకపోయాయి. అందుకు కారణం మన రంగస్థలానికివున్న పరిమితులే కాని రచనల్లోని లోపంమాత్రం కాదు. రాజమహేంద్రవరం తర్వాత మచిలీపట్టణం, గుంటూరు చెప్పుకోదగ్గ కేంద్రాలు. ఆ తర్వాత తెనాలి, నెల్లూరు చెప్పదగినవి.

## రంగస్థల వికాసం

ఇంతవరకూ సాధించిన అభివృద్ధికి కారణం కేవలం ప్రాంతీయనాటక సమాజా ల్లోని నటకుల ఉత్సాహమేకాదు. వారి శక్తి సామర్థ్యాలు కూడా అందుకు కారణా లయ్యాయి. మచిలీపట్టణంలో ఈ మని లక్ష్మణస్వామిగారు, గుంటూరులో హరి ప్రసాదరావుగారు, కాకినాడలో వెదురుమూడి శేషగిరిరావు గారు పై కోవలోనివారే. వీరి కీర్తి ప్రతిష్ఠలు దూరదూర తీరాలకు కూడా వ్యాపించి ప్రేక్షకులను ఆకట్టుకుంటూ వుండేవి.

నాటకప్రదర్శనలు ఆర్థికపుష్టిని పుంజు కోవడం ప్రారంభించగానే యీ రంగంలో కొత్తమార్పులు తలయెత్తాయి. వ్యాపార నాటక సమాజాలూ, నటకులూ బయలు దేరారు. 'మానేపల్లి కంపెనీ' అనే తొలి వ్యాపారనాటక సమాజం రాజమండ్రిలో స్థాపించబడ్డట్టుగా చెప్పబడుతోంది. తర్వాత సత్యవోలు గున్నేశ్వరరావు, కృత్తివెంటి నాగేశ్వరరావు కలిసి సాహ సించి ఒక కంపెనీని స్థాపించారు. నాగేశ్వర రావు కొంతకాలం తర్వాత విడిపోయి అక్కడే తన స్వంతకంపెనీని ఒకదాన్ని స్థాపించుకున్నారు. బ్రహ్మాండమైన తెరలు, ఆకర్షణీయమైన సంగీతముతో పాటు సమర్థ వంతమైన నటన యీ నాటకకళ వ్యాపార యుతం కావడంవలన లాభించింది. ఈ రకపు వ్యాపారనాటక సమాజాలలో ఏలూరు లోని సీతారామాంజనేయ నాటక సమాజమూ, బెజవాడలోని మైలవరం బాలభారతీ సమా జమూ ప్రసిద్ధమైనవి. ఇవి రెండూ 1905 నుండి 1925 వరకు రెండు దశాబ్దాలపాటు ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించాయి.

ఇంతవరకూ చెప్పుకున్న నాటకాలే కాక బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి 'హరిశ్చంద్ర', ముతరాజు సుబ్బారావుగారి 'శ్రీకృష్ణ తులా

ఖారం', శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రిగారి 'సావిత్రి', మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారి 'ద్రౌపదీ వస్త్రాపహరణము' 'కృష్ణలీల'లు, తిరపతికవుల 'పాండవ ఉద్యోగ' 'విజయము'లు, పానుగంటి లక్ష్మీనరసింహం గారి 'పాదుకా పట్టాభిషేకము' 'విప్రనారాయణ' 'రాధా కృష్ణ', కాళ్ళకూరి నారాయణ రావుగారి 'చింతామణి' 'వరవిక్రయం' నాటకాలు విశేషంగా ప్రేక్షకుల్ని ఆకర్షించి ప్రసిద్ధిచెందాయి.

వేదం వేంకటరాయ శాస్త్రిగారి 'ప్రతాప రుద్రీయం', గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' స్వతంత్ర రచనలుగా చెప్పుకోదగ్గ నాటకాలు. ఇందులో మొదటిది శాస్త్రీయ పంథాలోనూ, రెండోది వ్యావహారిక భాషలో కొత్త ప్రయోగంలోనూ నడిచాయి.

ఈ కాలం ఆంధ్ర దేశంలో నాటకకళకు స్వర్ణయుగం అని చెప్పుకోవచ్చు. నాటక ప్రదర్శన నాటక రచననూ, నాటకరచన నాటక ప్రదర్శననూ ఒకదానినొకటి ప్రోత్సహించుకున్నాయి. ఆ విధంగానే పెద్ద పెద్ద నటకులు నాటకాల్నీ, నాటక సమాజాల్నీ ప్రోత్సహిస్తే అవి తిరిగి నటకుల్ని ప్రోత్సహించాయి. సంస్కృతంలో గొప్ప గొప్ప నాటకాలుగా పేరందినవి తెలుగులో రూపాల్ని దిద్దుకోవడమేగాక సరికొత్త నాటకాలుకూడా తెలుగులో వచ్చాయి. ఆ విషయంలో మనం గర్వపడవచ్చు. ఇతర భాషల్లో పేరుప్రతిష్ఠల్ని సంపాదించుకున్న నాటక రచయితలకు సాటయిన రచయితలు ఆంధ్రదేశంలోనూ తయారయ్యారు. శ్రీయుతులు ధర్మవరం కృష్ణమాచారి, కోలాచలం శ్రీనివాసరావు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, కందుకూరి వీరేశలింగ, వేదం వెంకటరాయశాస్త్రి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, గురజాడ అప్పారావుగారలు యితర భాషల్లోని ఏ గొప్ప నాటక రచయితకూ తీసిపోని రచయితలు. చిత్రనళీయం, పాదుకా పట్టాభిషేకం, రాధాకృష్ణ, ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం నాటకాలు ప్రపంచప్రసిద్ధ నాటకాల కోవలో చేర్చదగినవి నాటకరంగ జీవితపు అన్ని కోణాల్నీ — పౌరాణిక, సాంఘిక, రాజకీయ రంగాల్నీ — ఆవరించింది.

నటకుల విషయంలో కూడా ఆంధ్రదేశం అనేకమంది ఉద్దండుల్ని సృష్టించింది. హరిప్రసాదరావు, యడవల్లి సూర్యనారాయణ, యడవల్లి శ్రీరామమూర్తి, మంజులూరి కృష్ణారావు, నెల్లూరు నాగరాజారావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, డా॥ జి. వి. సుబ్బారావు, డి. వి. సుబ్బారావుగారలు మగవేషాలు వేసి; పారుపల్లి సుబ్బారావు, ఉప్పులూరి సంజీవరావు స్త్రీ వేషాలు వేసి అశేష ప్రేక్షకుల్ని ఆకర్షించారు. బళ్ళారి టి. రాఘవగారూ, స్థానం నరసింహారావు గారూ అఖిలభారత ప్రసిద్ధులైన నటకులు.

## పతనము

వ్యాపారనాటకసమాజాలు ఆంధ్రనాటక రంగాన్ని ఉచ్చస్థితికి తీసుకవెళ్ళినప్పటికీ వాటికి తగిన ఆర్థికస్తోమతగానీ, పటిష్ఠమైన నిర్వహణశక్తిగానీ లేవు. అవి జమీందారుల అండదండలమీదా, ఆసక్తిగల ధనవంతుల ప్రోత్సాహంమీదా ఆధారపడి వుండేవి. అందువల్ల యీ వ్యాపారసమాజాలు బలహీన పడక తప్పలేదు

1930 నాటికి యించుమించు అన్ని వ్యాపారనాటకసమాజాలూ రూపుమాసి కొద్దిమంది పేరుపడ్డ నటకులు మాత్రమే మిగిలారు. ఈ లోటును భర్తీచేయడానికై 'కంట్రాక్టర్లు' తలెత్తి నాటక ప్రదర్శనల్ని ఏర్పాటు చేస్తుండేవారు. అదేనాటక రంగానికి ఆధారమైంది. ఆపైని నాటకరంగం మరింతవేగంగా చితికిపోవడం ప్రారంభించింది. చివరకు సినిమాలువచ్చి మంచి మంచి నటకులందర్నీ ఆకర్షించుకొని నాటక రంగస్థలాన్ని సినిమాహాలులుగా మార్చేసి నాటకరంగానికి గొడ్డలిపెట్టు పెట్టింది.

## అధునాతన నాటకం

సరిగ్గా రంగస్థలం పతనమవుతున్న సమయంలోనే పౌరాణికాల్లోంచి అధునాతన నాటకం తలెత్తింది. టి.రాఘవ 1929–30లో ప్రదర్శించిన రాజమన్నారుగారి 'తప్పెవరిది' ఈ కోవకు చెందినదే. ఏమయినా దురదృష్ట వశాత్తూ ఈ రంగంలో వచ్చిన మార్పుల వల్ల సువ్యవస్థితమైన సమాజాలు రూపు మాసి ఏ విధమైన అభివృద్ధీ కనుపించ లేదు.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత, ముఖ్యంగా దేశానికి స్వాతంత్ర్యం లభించిన అనంతరం, ఆంధ్రదేశంలో రంగస్థలాన్ని పునరుద్ధరించడానికి తీవ్రమైన ప్రయత్నాలు జరిగాయి. తొలిరోజుల్లోవలె యిప్పుడూ తెలుగురంగస్థల పునరుద్ధరణ ఔత్సాహికనాటకసమాజాలవల్లనే జరిగింది. ఎప్పటి కప్పుడు సరికొత్త నాటకాలను ప్రదర్శిస్తూ రంగస్థల పునరుద్ధరణకు పూను కున్న ఔత్సాహిక నాటక సమాజాలు ఆంధ్ర దేశంలో ప్రతిఊళ్ళో ఒకటో రెండో చెప్పుకోదగ్గవి వుంటూనే వుండేవి. దానికి తోడు వివిధవ్యక్తుల సహకారాన్ని ఆయా సమాజాల సహకారాన్ని దరిచేర్చి రంగస్థల ఉద్యమాన్ని లేవదీయడానికి ఒక కేంద్ర సంఘాన్ని స్థాపించడానికి అప్పుడప్పుడు ప్రయత్నాలు జరుగుతుండేవి. ఆంధ్ర నాటక

కళాపరిషత్తు, చిన్న రంగస్థల ఉద్యమం, (The Talugu little Theatre movement) ఆంధ్ర రంగస్థల సమాఖ్యలు యీ రకపు ప్రయత్నాలను వ్యక్తంచేస్తూంటాయి. ఇటీవలనే రంగస్థలకేంద్రం స్థాపించబడి అభినందనీయమైన ఫలితాలను సాధిస్తోంది.

## అధునాతన రంగస్థలానికి కావలసిన నాటకాలు

తొలిరోజుల్లో ఆంధ్రరంగస్థలానికి, సంస్కృత సంప్రదాయ సిద్ధమైన పౌరాణిక నాటకం ఆధారమైతే యీ నాటి రంగాస్థలానికి పాశ్చాత్యనాటకం ఒక నమూనాగా, ప్రేరణగా పనిచేసింది. అభివృద్ధికరమైన యీ మార్పు యితర భారతీయ భాషల్లో కూడా వచ్చినప్పటికీ దీనిని మాత్రం ప్రత్యేకంగా పరిశీలించి వ్యాఖ్యానించ వలసివుంది. రంగస్థలనిర్మాణాన్ని గూర్చిన అభిప్రాయాల్లో పూర్తిగా మార్పురావడం యిందుకు ముఖ్యకారణం. 18, 19వ శతాబ్దపు ఆంగ్ల రంగస్థలం మన రంగస్థలానికి రూపులు దిద్దిందనే విషయం మనం మర్చిపోగూడదు. వారి ప్రదర్శన ఎక్కువగా చిత్రించిన తెరల మీద ఆధారపడివుండేది. ఈ రకపు ప్రదర్శన, వివిధ ప్రాంతాలను చూపిస్తూ ఎక్కువ అంకాలతో నాటకాన్ని వ్రాసేందుకు తోడ్పడింది. ఇది సంస్కృత నాటకాలకు, సంస్కృతంలోనుండి తెలుగులోకి అనువదించినవాటికి, సంస్కృత సంప్రదాయాన్ని దృష్టిలోవుంచుకుని స్వచ్ఛందంగా తెలుగులో వ్రాసిన నాటకానికి అనుగుణంగా బయలుదేరింది. ఆతర్వాత చిత్రించిన తెరల స్థానే వాస్తవధోరణిలో త్రిముఖదృశ్యరంగాలంకరణ వచ్చింది. దీనికి కొత్త రకపు రంగనిర్మాణము అవసరమైంది. ఒకే ఒక సెట్టుతో వేసే మూడంకాల నాటకం పైకృషి ఫలితంగా బయల్వెడలింది. ఇదే ఆంధ్ర నాటక రంగస్థల పునరుద్ధరణకు కారణభూతమైంది. సంస్కృత సాహిత్యంలో దీనికి అనుగుణమైన అభివృద్ధిఏమీలేకపోవడంచేత మనం పూర్తిగా పాశ్చాత్య సాహిత్యంమీద ఆధారపడవలసి వచ్చింది. మరోకారణం ఏమిటంటే సరిగా అప్పుడే ఒక్క పాత్య పుస్తకాలల్లోతప్ప మిగిలిన అన్నిచోట్లా గ్రాంధికభాషస్థానే వ్యవహారికభాష వాడుకలోకి వచ్చింది. అందుచేత ఈ నాటి రంగస్థలానికి వ్యావహారిక భాషలో వ్రాసిననాటకం అవసరం. కవులూ, పండితులూ వృత్తిరీత్యా సనాతన సంప్రదాయాల్ని పరిపోషించేవారు కావడంవలన గ్రాంధిక భాషకు కట్టుబడిపోయి, శిక్షణవల్లగాని, అలవాటువల్లగాని యీ నాటి రంగస్థలానికి సరిపడే అధునాతన నాటకాన్ని వ్రాయలేకపోయారు. పాశ్చాత్య విద్యను అభ్యసించిన యువకులు ఖండాంతర దేశాలనాటకాలతోనూ, ఇంగ్లండు, అమెరికా దేశాలవారి నాటకాలతోనూ సన్నిహితులై సరికొత్త నాటకాల్ని అందించడానికి ముందుకొచ్చారు. సాధారణంగా వారికి ఏవి సన్నిహితమైనవో వాటినే తెలుగులోకి దింపుతూండేవారు.

మనం పాశ్చాత్యదేశాలమీద ఆధారపడడానికి, నేటి అధునాతన నాటకం సాంఘిక జీవితానికి సంబంధించినది కావడం మూడో కారణంగా చెప్పుకోవచ్చు. సాంఘిక నాటక రచనకు సంస్కృత నాటకరీతులు అంతగా తోడ్పడవు. కాళ్ళకూరి నారాయణరావుగారి 'వరవిక్రయం' పూర్వపు పద్ధతుల్లోనూ గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' యిప్పటి పద్ధతుల్లోనూ వ్రాసినవని చెప్పుకోవచ్చు. పై మూడింటి విషయంలోనూ మరో అభిప్రాయానికి తావులేదు.

వాస్తవికమైన రంగాలంకరణ, వ్యవహారికభాష, సాంఘిక నాటకము — యీ మూడూ తెలుగు నాటక రచయితల్ని పాశ్చాత్య నాటకధోరణిలో వ్రాయడానికి పత్తిడిచేశాయి. పాశ్చాత్య ధోరణిలో స్వతంత్రంగా వ్రాసిననాటకాలుకొన్ని వున్నప్పటికీ చాలామట్టుకు అనుసరణలే ఇగ్లండు, అమెరికా మొదలైన ఖండాంతర దేశాల్లోని ఆంగ్ల నాటకాలను తెలుగులో ప్రతిభావంతంగా అనువదించడం జరుగుతోంది. ఇవి స్వతంత్ర రచనలకు ఏమాత్రమూ తీసిపోవు. సాంఘిక, రాజకీయ సమస్యలతోనూ, తాత్విక వాతావరణంతోనూ, చివరకు అపరాధ పరిశోధక వాతావరణంతోనూ నాటకాలు వచ్చాయి. తెలుగులోవచ్చిన యిన్నిరకాల నాటకాలూ వాటి సంఖ్యా చూస్తే ఆశ్చర్యం కలగకమానదు. ఇది నిజంగా తెలుగురచయితల కృషికీ, ఉత్సాహానికీ నిదర్శనం. సంఖ్యలో తెలుగు నాటకాలు యే యితర భారతీయభాషలోని నాటకాలకు తీసిపోవు.సరికదా ఒకొక్కప్పుడు వీటిసంఖ్య అధిగమిస్తూనూ వుంటుంది. అనువాదాల్లో బహుకొద్ది నాటకాలు చెప్పుకోదగ్గవి వున్నప్పటికీ చాలావరకు ఈ అనువాదాలు రెండు విధాలుగా లోపాన్ని కలిగి వున్నాయని నా అభిప్రాయం. మొదటిది — ఔత్సాహిక రచయితలు భాషలో సరియైన పాండిత్యాన్ని సంపాదించకుండానే నాటక రచనకు పూనుకోవడం. వ్యవహారిక భాష అంటేనూ, జాతీయాల్ని ప్రయోగించడం అంటేనూ అర్థం నోరుజారడంకాదు. దురదృష్టవశాత్తూ యీరకపు భాష సాహిత్యంలోకి కూడా దిగుమతి అయ్యింది. ఇంతకంటే బాధాకరమైన లోపం ఏమిటంటే చాలామంది రచయితలకు సంఘాన్నిగురించి నిర్దిష్టమైన అభిప్రాయాలేమీ లేకపోవడం. ఇతర భాషలో కాస్తనచ్చిన భావాన్నో కదలించిన సన్నివేశాన్నో తీసుకువచ్చి,

అది ఎక్కడ ఏ సాంఘిక పరిస్థితుల్లో పుట్టిందో అన్న పరిజ్ఞానమన్నా లేకుండా, తిన్నగా తెలుగులోకి దిగుమతి చేస్తున్నారు. అందుచేత మనం వుంటున్న సంఘానికి ఆ సంఘటనలు ఏ మాత్రము అతుకుపడక, సంబంధంలేని విషయాలను మిడి మిడి జ్ఞానంతో నాటకంలో చొప్పించి నట్టనిపిస్తోంది. మన రంగస్థలంలో చైతన్యమే గాని వుండి వుంటే తప్పకుండా లోపాలు అపజయాలుగా కొట్టుకుపోయేవే. దురదృష్ట వశాత్తూ ప్రస్తుత పరిస్థితుల్లో మంచీ చెడూ రెండూకూడా ఒకేవిధంగా అపజయంపొందే దుస్థితిపట్టింది. మంచిని వెలికితెచ్చే వాతావరణం యిదికాదు. అందుకని అధునాతన నాటకాన్ని కాదని మళ్ళీ పూర్వపు పద్ధతుల వైపు మొగ్గడం మంచిపనికాదు. సంఘంలో ఎన్నోమార్పులు వస్తున్నాయి. ఈ మార్పులు నాటకంలోనూ ప్రతిబింబించాలి. అధునాతన నాటకం ప్రేక్షకుల్ని ఆకర్షించ లేదు అనడంలో అర్ధంలేదు. ఆధునిక నాటకానికి తగిన వాతావరణాన్ని కల్పించడం వల్లనే యీలోటు తీరగలదు.. ఈ నాటి తెలుగు నాటకానికి గౌరవాన్ని కల్పించేందుకు తగినంతమంది సమర్థులైన నాటక రచయితలు ముందుకు వస్తున్నారని నేను భావిస్తున్నాను.

ఆచార్య ఆత్రేయ, కొండముది గోపాల రాయశర్మ, డి. వి. నరసరాజు, ప్రఖ్య శ్రీరామమూర్తి, కొర్రపాటి గంగాధరం, జి. మారుతీరావు, భమిడిపాటి రాధాకృష్ణ ప్రభృతులు చక్కటి అనుసరణ కర్తలేగాక చెప్పుకోదగ్గ స్వతంత్ర రచయితలు కూడా. మన రంగస్థలం అభివృద్ధికరంగావుండి అలాటి వారికి ఆర్థిక పుష్టిని కలిగిస్తే, వాళ్ళు తప్పకుండా ఏ భాషలోనన్నా డబ్బు చేసుకోకల స్వతంత్ర నాటకాల్ని వ్రాస్తారని గంటాపథంగా చెప్పవచ్చును. గోపాలరాయశర్మగారి 'ఎదురీత' ఆత్రేయగారి 'గుమాస్తా' 'కప్పలు' రాధాకృష్ణగారి 'కీర్తిశేషులు' చెప్పుకోదగ్గ రచనలు. రంగస్థలాన్ని చక్కగా వ్యవస్థీకరించగలిగినట్లయితే ఆత్రేయ, గంగాధరం, భమిడిపాటి రాధాకృష్ణ, నరసరాజులాంటి రచయితలు యితర భాషల్లోని గొప్ప నాటకాలతో సమానమైన నాటకాల్ని సృష్టిస్తారనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

# ప్రజానాటక సాంప్రదాయాలు: తెలంగాణా నాటకాలు

యస్వీ జోగారావు

మహమ్మదీయ దేశాలలో వలె మత పరంగా నిషిద్ధమైతే తప్ప ప్రతి నాగరిక జాతికీ స్వంత నాటకసంప్రదాయాలంటూ వుంటాయి. ప్రాచీన కాలంలోనే భారత దేశంలో పది రకాల రూపకాలు, సుమారు 24 రకాల ఉపరూపకాలు ప్రచారంలో వున్నాయి. ఈ నాటక రీతులన్నీ సంస్కృత సాహిత్యంలో వివరించబడినవి. పెక్కురు సంస్కృత నాటకశాస్త్రవేత్తలు తమ కూర్పు విధానాలను సమగ్రంగా వర్ణించారు. ఇలాంటి గ్రంథాలలో భరతుని నాట్యశాస్త్రం పురాతనమైనది. దీనిలో రూపకాలను గురించి వ్రాయబడింది. సంస్కృత ప్రభావం అధికంగా పడిన అనేక ఇతర భారతీయ భాషలలో, సంస్కృత నాటకాల పద్ధతిలో రూపొందించిన నాటకాలు సాహిత్యపరంగా ఏమీ అభివృద్ధి జెందకపోవడం విచిత్రమైన విషయం. అయితే దేశంలోని ప్రతి భాషా ప్రాంతంలోనూ నాటక ప్రక్రియలో ఏదో ఒక విధమైన స్వంత సంప్రదాయాలంటూ వున్నయి. కాగా ఇది ఆంధ్రకు కూడా అక్షరాలా వర్తిస్తుంది.

వంగరాష్ట్రంలో 'యాత్ర' మహారాష్ట్రంలో 'లలిత' 'తమాష్' అనే సంప్రదాయకమైన నాటకప్రక్రియలు ప్రచారంలో వున్నాయి. ఇదేవిధంగా మార్వార్‌లో 'గంధర్వనాట్యం' సౌరాష్ట్రంలో 'భవాయ్,' తమిళప్రాంతంలో కురవయ్ కుట్టు, అరియకుట్టు, తెరుక్కూట్టు అనే నాటకరీతులు,, కేరళలో కథాకళి, మోహిని యట్టం అనే నాటక సంప్రదాయాలు కర్నాటకంలో బయలత, యక్షగానాలు వాడుకలో వున్నాయి. కాగా ఆంధ్రలో వీధి నాటకాలు, యక్షగానాలు మొదలైన నాటక రీతులు ప్రచారంలో వున్నాయి. అయితే ఇవన్నీ కూడా కూర్పు విషయంలోనూ, వస్తు విషయంలోనూ అభివృద్ధి జెందిన సంస్కృత నాటకాలకు సమఉజ్జీగా నిలువ లేవు. రాజాధిరాజులు, ప్రభువులు సంస్కృత నాటకాలను తిలకించి ఆనందించగా సామాన్య ప్రజలు దేశీయపద్ధతి నాటకాలను చూసేవారు. బహుశా ఈ కారణంవల్లనే నేమో సంస్కృత

భాషా వ్యామోహితులైన ఆయా భాషా రాష్ట్రాలకవులు అనేక మంది తమ భాషలలో సామాన్య ప్రజానీకంకొరకు నాటకాలు రచించవలసిన అవసరాన్ని గుర్తించలేదు. సాహిత్యపరంగా తగు ప్రతిపత్తిని సంత రించుకొని, రాజాదరణను కూడా పొంద గలిగినట్టి దేశీయనాటక రీతులు మాత్రమే అభివృద్ధి జెందగలిగాయి. అన్యమైనవి జనపదాల పొలిమేరలలోనే అంతరించి పోయినవి.

## పూర్వరంగ విశేషాలు

పూర్వం కొందరు తెలుగు కవులు అనేక సంస్కృత నాటకాలను, నాటకరూపంలో గాక పద్య వివరణల రూపంలో అనువ దించారు. అయితే 15 వ శతాబ్దంలో రచించ బడిన పద్యనాటకం 'క్రీడాభిరామ' ఒక్కటి మాత్రం తద్భిన్నమైనది. రావిపాటి త్రిపురాంతకదేవ తెలుగు కవి విరచితమైన 'పేమాభిరామ' అనే సంస్కృత నాటకానికి ఇది అనువాదం. ఈ కవి 14 వ శతాబ్దపు వాడు. ఈ నాటకం, పది ప్రధాన సంస్కృత రూపక విధానాలలో ఒకటైన 'వీధి' క్రిందికి వస్తుంది. ద్వారసముద్రానికి చెందిన నటకులు ఈ నాటకాన్ని ప్రదర్శించినట్లు క్రీడాభి రామంలో పేర్కొన బడింది.

తెలుగునాట వీధినాటకం అనే నాటక ప్రక్రియ అనన్యప్రచారం పొందింది. ఇక్కడ వీధి అంటే సంస్కృత రూపకం కాక బజారుఅని మాత్రమే అర్థం. చాలా కాలంనుంచీ 'నాటకం' ఆ అర్థంలో సాధార ణంగా వాడబడుతూ వుంది. సామాన్య ప్రజలు చూడడానికి అనువుగా ఈ నాట కాలను వీధులలో ప్రదర్శిస్తారు. ఈ కారణంగానే వీధినాటకాలనే పేరు వీటికి వచ్చింది. తమిళంలోని 'తెరుక్కుట్టు' కన్నడంలోని 'బయలత'లు కూడా ఇలాం టివే. ఇవన్నీ బహిరంగస్థలంలో ప్రద ర్శించబడేవే.

పాల్కురికి సోమనాథుని (బహుశా 12 వ శతాబ్దపువాడు) పండితారాధ్య చరిత్ర అయిదవ అశ్వాసం (పర్వత ప్రకరణ – పుటలు : 432 – 62) లో పూర్వ కాలంలో శ్రీశైలంలో శివరాత్రి సందర్భంగా జరిగే ఉత్సవ విశేషాల వర్ణనవుంది. దీనినిబట్టి ఆ కాలంలో ఆంధ్రలో పలురకాల నాటకరీతులు ప్రచారంలో వున్నట్లు స్పష్ట మవుతున్నది. సంగీత మేళాలు, ఛాయా ప్రదర్శనలు, తోలు బొమ్మలాటలు, పులి వేషాలవంటి ఆటలు, పంచాంసి, పెరని, బహురూప, వెడ్డంగ మొదలైన ఇతర నాటకాలతోపాటు శైవమత సంప్రదాయానికి చెందిన కథా వస్తువులతోకూడిన నాటకాలు కూడా అధిక సంఖ్యలో ప్రదర్శించబడినట్లు తెలుస్తున్నది[1]. బహుశా వాటిని మత ప్రచారానికి సాధనాలుగా వినియోగించుకొని వుంటారు. అవి వీధి నాటకాలు తప్ప మరేమీ అయివుండవు[2]. ప్రదర్శన పద్ధతులను గురించి సోమనాధుడు సమగ్రంగా వర్ణించాడు. ఉత్కృష్టమైన వేషధారణ, సంగీత వాద్యాలు, తెరలు, కార్యక్రమ ప్రకటనలను గురించీ, పెక్కు భంగిమలు, విభిన్న అభినయాలను గురించీ అంతేగాక ప్రదర్శనలలోని ప్రత్యేకమైన నృత్యాల పేర్లను ఆయన పేర్కొన్నాడు. ఆ కాలంలో వీధినాటకం బాగా అభివృద్ధి పొందివున్నట్లు వీటినిబట్టి తెలుసుకోవచ్చు.

కాకతీయ చక్రవర్తి (14 వ శతాబ్దం) ప్రతాపరుద్రుని ఆస్థాన నర్తకి మాచాలదేవి చరిత్ర ప్రజాదరణపొందిన నాటకాలకు కథా వస్తువుగా వున్నట్లు శ్రీనాథుడు (15 వ శతాబ్దం) క్రీడాభిరామలో పేర్కొన్నాడు. ప్రతాపరుద్రుడు వరంగల్ (ఇప్పుడు తెలంగాణాలో జిల్లా కేంద్ర కార్యస్థానం) రాజధానిగా కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు.

## కూచిపూడి భాగవతార్లు

ఆంధ్రలో భరతనాట్య నిపుణులు అయిన కూచిపూడి బ్రాహ్మణ భాగవతార్లు వీధినాట కాల వ్యాప్తికి చాలా వరకు దోహదం చేశారు. వీరు ఆంధ్రలో నృత్య,నాటక రీతుల సంచార ప్రచారకులుగా. వుండేవారు. వీరు సమస్త హంగులుగల బృందంతో దేశ యాత్రచేసి, ప్రదర్శనలిచ్చి ప్రభువులు దాతలు సమర్పించిన విలువైన కానుకలతో స్వస్థలాలకు తిరిగి వచ్చేవారు. 15 వ శతాబ్దంలో వారు ప్రఖ్యాతిలోకి వచ్చారు. ఒకసారి వారు రాయలసీమలో పర్యటిస్తున్న సందర్భంలో, కడపజిల్లా సిద్దొట్‌లో, స్త్రీల నుంచి పన్నులు వసూలు చేయడానికి దారుణమైన హింసా విధానాలు అవలంబిం చడం వారు చూశారు. విజయనగరం పాల కుని సైనికోద్యోగి అయిన సిద్దొట్ తహ శీల్దారు సంబెట గురవరాజు భయానకమైన ఈ చట్టానికి కర్త. కూచిపూడి భాగవతార్లు విజయనగర పాలకుడైన వీర నరసింహ రాయలు ( 1506–1509 ) వద్దకేగి, అంతః పురంలో ఆయన సమక్షంలో సిద్దొట్ దుర్ఘట నలను వాస్తవికంగా అత్యద్భుతంగా ప్రదర్శి చారు. చక్రవర్తి విషయాన్ని గ్రహించి

1. త్రిపురవిజయం, కామదహనం, అర్ధనారీశ్వర (గౌరీకళ్యాణం) అంధకవధ, గజాసుర మర్దన, దక్షయజ్ఞం, క్షీరసాగరమదనం మొదలైనవి. పరమశివభక్తుడైన శ్రీయాళుని కథ, ఆ కాలంలో నాటక కథా వస్తువుగా బహుశ ప్రచారంలోవున్నట్లు సోమనాదుడు తన బసవపురాణం 4 వ ఆశ్వాసంలో పేర్కొన్నాడు.
2. ఈ కథలలో కొన్ని సంగీత మేళాలకు [శ్రీనాధుని (15 వ శతాబ్దం) భీమేశ్వరపురాణం III. 178] యక్షగానాలకు కూడా కథావస్తువులుగా రూపొందాయి.

తగుచర్య తీసుకున్నాడు.[3] ప్రాచుర్యం పొందిన నాటకకళద్వారా ప్రజాక్షేమానికి దోహదం చేయడంలో కూచిపూడి భాగవతార్లు ప్రదర్శించిన ఉదాత్త వైఖరిని, నాటకం వంటి గొప్ప సమ్మిశ్రితమైన కళాప్రక్రియ సాధించగల ఉత్తమ ప్రయోజనాన్ని ఈ సంఘటన చాటుతుంది.

## 16 వ శతాబ్దము

కూచిపూడి నాట్యకళా నిపుణులు ఇచ్చిన ప్రోత్సాహం కారణంగా విజయనగర సామ్రాజ్యంలో నాటకబృందాలు ఏర్పడ్డాయి. కర్నూలు జిల్లా చెరువుబెలగల్లు అనే గ్రామంలో లభించిన ఒక శాసనం[4] తాయి కొండనాటకం అనే నాటకాన్ని ప్రదర్శించిన నటుడికి, నటీమణికి ఒక గ్రామకరణం ఒక భూఖండాన్ని విరాళంగా ఇచ్చివేసినట్లు తెలుపుతున్నది. విజయనగర చక్రవర్తులలో ఉద్దండుడైన శ్రీకృష్ణదేవరాయల కాలంలో 1514 వ సంవత్సరంలో చెక్కబడిన శాసనం ఇది.

ఇదే శతాబ్దంలో వీరశైవ మతస్థులైన జంగములు, తమ 'తెరనాటక'[5] ప్రదర్శనల ద్వారా ప్రసిద్ధిజెందారు. ఇంతేగాక వీరు 'జంగం కథలు' అనే సంగీతమేళాల నిర్వహణలో కూడా సిద్ధహస్తులు. వీరి కథలు నేటికీ ప్రచారంలో వున్నాయి. వీరు శైవమత ప్రచారకులు. ఈ ప్రయోజనార్థమే బహుశా వీరు ఈ రెండువిధాలైన ప్రచార సాధనాలను అవలంబించి వుంటారు. పాల్కురికి సోమన పేర్కొన్న నాటకాలలో కొన్ని బహుశా జంగం సాహిత్యానికి చెంది వుంటాయి.

పదహారవ శతాబ్దం ఉత్తరార్ధానికి చెందిన తెలుగుకవి పింగళి సూరన, ప్రభావతీ ప్రద్యుమ్నం(IV 96-101)అనే తనకావ్యంలో 'గంగావతరణం' అనే నాటక ప్రదర్శన విశేషాలను సమగ్రంగా వర్ణించాడు. దీనిలో అనేక కథలు, గీతాప్రబంధాలు, చక్కగా కూర్చిన వాద్య సమ్మేళనం, బ్రహ్మాండమైన రంగాలంకరణలు, సూత్రధారి, పరిసర్స్వక, విదూషకుడు పూర్వరంగం, నాంది, ప్రస్తావనలను గూర్చి, పేర్కొనబడింది.

బ్రహ్మాండమైన ఈ నాటక ప్రదర్శనం సాధారణమైన వీధినాటకంగా గాక సంస్కృత రూపకాలవంటి బాగా అభివృద్ధి జెందిన నాటకాలను స్ఫురింపజేసేదిగా వుంటుంది. వీధి నాటకాల ఉచ్ఛదశను ఇది సూచిస్తుందనుకోవడంలో అప్రస్తుతమేమీ లేదు. కాగా వీధినాటకాలు నిష్ణాతులైన కూచిపూడి భాగవతార్లు లేదా రాజాస్థానాలలోని బాగా అభివృద్ధి పరిచిన నాటకశాలలనుంచి నూతన రీతులను సంతరించుకొని అభివృద్ధిజెంది వుంటాయి.

ఇదే శతాబ్దంలో రచింపబడిన 'వసుచరిత్ర' అనే తెలుగు కావ్యంలో రంగంపైకి (111, 45) రాజుపాత్ర ప్రవేశపెట్టబడే వింత విధానం, తెర మెల్లగా క్రిందికి జారుతుండగా కథానాయికి రంగస్థలంపై క్రమంగా కనిపించడం (భామకలాపంలోని భామ వేషంమాదిరి) వర్ణించ బడినాయి. పోతే ఈ వర్ణనలనుబట్టి, రంగస్థలంపైకి ప్రధాన పాత్రను ప్రవేశపెట్టేప్పుడు పాట పాడుతారనీ (సంస్కృత నాటకాలలో దీనిని ప్రవేశిక ధ్రువగానం అంటారు.) కాగా ఈ పాట సారంగరాగంలో వుంటుందనీ, ఈ నాటకాలలో తెరప్రక్కలనుంచిగాక కేరళకు చెందిన కథాకలిలోవలె పైనుంచి క్రిందికి వాలుతుందని ఈ వర్ణనలవల్ల తెలుస్తుంది. వీటన్నింటినిబట్టి, ఆ కాలంనాటికే ఆంధ్రలో నాటకాలు బాగా ప్రచారంలో వున్నట్లు వెల్లడవుతుంది.

## యక్షగానాలు

రమారమి ఆ కాలంలోనే జక్కుల బాలికల నాటక ప్రక్రియలనుంచి ఉత్పన్నమైన యక్షగానాలు, సిద్ధహస్తులైన కవులు వీటికూర్పుకు పూనుకోవడంతో, కూచిపూడి భాగవతార్లవంటి ఉద్దండులు వీటి ప్రదర్శనకు ఉపక్రమించడంతో జనాదరణ పొందిన పరిపూర్ణమైన నాటకాలుగా అభివృద్ధి జెందాయి. కాలక్రమేణా ఇవి వీధి నాటకాలకు దాదాపు మారుపేరుగా రూపొందాయి. 17,18 వ శతాబ్దాలలో ఇవి ఆంధ్ర దేశమంతటా బహుళంగా ప్రచారంలోకి వచ్చాయి. అంతేగాక తంజావూరు, మధుర, మైసూరు మొదలైన దక్షిణాది రాష్ట్రాలలో కూడా వీటి ప్రభావం ప్రసరిల్లింది. వీటికి రాజాదరణకూడా చాలావరకు లభించింది. పదిహేడవ శతాబ్ది ఉత్తరార్థంలో ఇవి తెలంగాణాలో ప్రథమంగా ప్రచారంలోకి వచ్చాయి.

## తానీషాల హయాములో

ఖమ్మం, వరంగల్, నల్గొండ, కరీంనగర్, హైద్రాబాదు, మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్ అనే 9 జిల్లాలతో కూడిన తెలంగాణా ప్రాంతం, నిజాం పాలన క్రింద వున్న పూర్వ హైద్రాబాదు రాష్ట్రంనుంచి ఆంధ్రప్రదేశ్‌లో చేర్చబడింది. పూర్వ హైద్రాబాదురాష్ట్రం లక్షలకొలది తెలుగు ప్రజలకు నివాసస్థానం. ఈ సంస్థానం గోలకొండ సుల్తానుల ఏలుబడిలోవున్న కాలంలో అబుల్‌హసన్ తానీషా (1672-85) హయాములో బహుళ ప్రచారమైన నాటకరీతులు ప్రచారంలోకి

---

3. జి. ఓ. ఎం. ఎల్. స్థానిక రికార్డులు సం. నెం. 56 పు. 66.

4. ARE. 558 (1915) (ఈ అంశాలను వెలికితీసిన డాక్టర్ ఎన్. వెంకటరమణయ్యగారికి నా కృతజ్ఞతలు.)

5. బైచరాజు వెంకటనాథుని పంచ తంత్రము. (IV. 240 ) (హంసవింశతి. III. 29 )

వచ్చాయి ప్రసిద్ధకూచిపూడి నాట్యాచార్యులు సిద్ధేంద్రముని, తానీషా దర్బారులో తన బృందంతో నాట్యం ప్రదర్శించి ఆయన వద్దపారితోషికం పొందినట్లు తెలుస్తున్నది[6]. ఒక మునిసత్తముడు ఈ నాటకాల అభివృద్ధికి దోహదంచేయడం వాటి ప్రతిపత్తిని, ప్రాశస్త్యాన్నీ వెల్లడిస్తుంది. తానీషావద్ద అమాత్యులుగా వున్న అక్కన్న, మాదన్నలు ఒక నాటకబృందాన్ని నిర్వహించినట్లూ, ఈ బృందం వివిధ ప్రదేశాలకు వెళ్ళి ప్రదర్శనలిచ్చినట్లూ తెలుస్తున్నది.[7] అదిమొదలు తెలంగాణాలో ప్రజానీకానికి నాటక విషయాలతో సంబంధం వుంటూ వచ్చినట్లు భావించవచ్చు.

## పురోగతి

ఈ ప్రాంతంలో వీధినాటకాలు లేదా యక్షగానాల వర్గానికి చెందిన రచనలు 18వ శతాబ్ది ఉత్తరార్థంలో మాత్రమే వెలువడినట్లు కనిపిస్తుంది. పద్మనాయక జాతికి చెందిన ఒక అజ్ఞాత రచయిత వ్రాసిన సారంగధర చరిత్ర, ఈ ప్రాంతంలోని పురాతనమైన యక్షగానమైనట్లు ప్రతీతి. కాని రూఢిగా తెలిసినంతవరకు దాదాపు 1780 వ సంవత్సరంలో రచించబడిన రాపాక శ్రీరామకవి విరచితమైన అధ్యాత్మ రామాయణం, శేషాచలకవి విరచితమైన ధర్మపురి రామాయణం ఈ ప్రాంతంలో లభ్యమైన మొదటి యక్షగానాలైనట్లు కనిపిస్తుంది. ధర్మపురి రామాయణం సర్కార్ ప్రాంతంలోకూడా ప్రసిద్ధి గాంచింది. దీనిలో రామాయణపు ఆరు కాండాలూ వున్నాయి. దీనికూర్పు నాటక పద్ధతిలోకంటే వివరణరూపంలో అధికంగా వున్నట్లు కనిపిస్తుంది. అయితే దీనిని ప్రదర్శించినట్లుకూడా తెలుస్తున్నది. బహుశా దీనిని యదాతథంగా ప్రదర్శించి వుండరు. ఇందలి పాటలను, ఇతర ప్రాంతాలలో రామాయణ వీధినాటక ప్రదర్శనాలలో ఉపయోగించుకోవడం జరిగింది. సుమారు 1800 వ సంవత్సరంలో లిఖించబడిన కానూరి వీరభద్రకవి విరచితమైన బసవ మహిమామృత విలాసం, చెల్వూరు సన్యాసి విరచితమైన బసవకల్యాణం అనే రెండు వీరశైవ యక్షగానాలలో నాటకీయత చెప్పదగినంతవుంది.

19 వ శతాబ్ది పూర్వార్థంలో కొన్ని యక్షగానాలు రచించబడినట్లు తెలుస్తున్నది. అయితే ఆ పుస్తకాలు లభించడంలేదు. ఈ శతాబ్దం ఉత్తరార్ధంలో కవులకు ప్రోత్సాహం లభించింది, వారి యక్షగానాలు ప్రదర్శింపబడినవి. ఆత్మకూరు సంస్థానాధీశుడైన ముక్కర సీతారామభూపాలుని (1851–1905)ఆదరణపొందిన రామదాసు అనే కవి తారకశాంకం, భీమసేన విలాసం అను వాటిని రచించాడు. ఈ రెండింటిలోనూ సూత్రధారుడు నాటక పాత్రలతో సంభాషిస్తాడు. తిరునగరపు పాపకవి విరచితమైన హరిశ్చంద్రలో కూడా ఇవి వున్నాయి. జడ్చర్ల దేశ్‌పాండ్య, పట్వారీ ప్రోత్సాహం వల్ల గోవర్ధనం వెంకట నరసింహాచార్య అజామిలోపాఖ్యానమనే యక్షగానాన్నీ, గొల్ల కలాపాన్నీ రచించాడు. తెలంగాణా నాటకసాహిత్యంలో, పాండురాజు రామానుజాచార్య (బహుశా పూర్వకాలపు వాడై వుంటాడు) విరచితమైన శ్రీ రుక్మిణీ కురవంజి, రూప్‌ఖాన్‌పేట రత్నమ్మ(1847–1929) విరచితమైన శివకురవంజి – అనే రెండు కురవంజీలుకూడా వున్నాయి. ఆ కాలానికి [8] చెందిన నాటకాలు నటకులు రంగస్థలంపైకి ప్రవేశించేప్పుడు నేపథ్యం నుంచి పాటలు పాడటం, హాస్యగాడు, లేదా ద్వారపాలకుడు అడిగే ప్రశ్నలకు సమాధానంగా పాత్రలు తమనుతాము పరిచయం చేసుకోవడం, గద్యంలో సంభాషణలు, సంధివచనాలు, అనేక రంగస్థల నిర్వాహకత్వాలవంటి ప్రదర్శనల రీతిని తెలియజేస్తాయి. కొన్ని నాటకాలు[9], రంభ, ఊర్వశుల నృత్యంతో ఆరంభమవుతాయి. మరికొన్నింటి[10]లో విదూషకుడు వస్తాడు. వీటినిబట్టి తెలంగాణాలో 19 వ శతాబ్దంలో, నాటకకళ బహుళప్రచారంపొంది గణనీయమైన అభివృద్ధి దశలోవున్నట్లు ఈ నాటకాలు ఎంతో ప్రదర్శనయోగ్యమైనవైనట్లు విశదమవుతున్నది.

## ఆధునిక యుగం

వస్తువైవిధ్యము, యితివృత్తంలో కొత్తదనమువున్న యక్షగాన రచనలు యీ శతాబ్దంలో చాలా వచ్చాయి.

తెలంగాణా యక్షగాన రచయితల్లో జీవించివున్న వారిలో శ్రీ సెర్విరాల భాగయ్య అగ్రగామి. ఈ రకపు రచనల్లో గణనీయతను సాధించిన యీ యన యింతవరకూ వస్తువులోను, శిల్పంలోనూ కొత్తదనాన్ని చూపించే ముప్ఫయి నాలుగు రచనలు చేశారు. ఈ నాటి తెలంగాణాలోని యక్షగాన సాహిత్యానికి నిజమైన ప్రాతినిధ్యం వహించే రచనలుఅవి. ఇంచుమించు వీటన్నింటినీ ఆయన యక్షగానాలుగానే పేర్కొన్నారు. కొన్నిటికి (ఉదా. బబ్రువాహన చరిత్ర) భాగవతం, నాటకం అని నామాంతరాలు పెట్టారు. ఇంచుమించుగా అన్నీ ప్రదర్శనకొరకే ఉద్దే

6. చూ. శ్రీమతి కె. గోమతి, ఎం. లిట్ కొరకు మద్రాసు విశ్వవిద్యాలయానికి, దక్షిణభారత నృత్యనాటకాల సంగీతంపై సమర్పించిన పరిశోధకవ్యాసం.
7. చూ. మధురమంగాపుంశ్చలీవిలాసం, ప్రభుత్వ ప్రాచ్య లిఖిత ప్రతుల భాండాగారం మద్రాసు డి. నెం. 1449.
8 తాడిపర్తి లక్ష్మణదాసు విరచితమైన ప్రహ్లాద; శేషభట్టారు కృష్ణమాచార్య విరచితమైన రంభ నలకూబరవిలాసం; గడ్డం రామదాసు విరచితమైన విప్రనారాయణ చరిత్ర, ప్రభావతీ విలాసం, కాలియమర్ధన; జి. లక్ష్మీపతి విరచితమైన నలచరిత్ర.
9. పండరి విఠలరాయ విరచితమైన గజగౌరీవ్రతం, శ్రీరామ విజయం, జి. ఎల్. పతి విరచితమైన నలచరిత్ర, రాయభట్టు లక్ష్మణ కవి విరచితమైన మంధాత చరిత్ర.
10. జి. రాజలింగ కవి విరచితమైన హరిశ్చంద్ర.

శించబడి ప్రదర్శనావిజయాన్ని సాధించాయి. చాలావాటిల్లో ప్రశ్నించేపాత్ర (నాటకం నిర్వాహకుడులాంటిపాత్ర) ఒకటివుంటుంది. ఈ పాత్ర మిగిలిన పాత్రల్ని ప్రశ్నించి తమని తాము వ్యక్తపరచుకొనేట్టు చేస్తుంది. తరచుగా యీ పాత్ర హాస్యగాడితోకలిసి ఆ రచన అంకితాన్ని గురించిగాని, ప్రచురణను గురించిగాని హిందీలోవలె ప్రస్తావిస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు పాత్రలే యీ పనిని నిర్వర్తిస్తూ వుంటాయి. సంస్కృత నాటకాలలోవలే నాంది, ప్రస్తావన, నటి, సూత్రధారుడు — అనేవి కృష్ణగారడీలో కనిపిస్తాయి. ఈయన రచనల్లోవస్తువైవిధ్యానికి ఒక ప్రత్యేకవిలువ వుంది. ప్రసిద్ధమైన పురాణ కథలేకాక అల్లిరాణి, నాగార్జునలాంటి అరుదు కథలు; అర్మరాతిల కథ, కాంభోజరాజు కథ, బాలనాగమ్మకథ లాంటి జానపదకథలు; బొబ్బిలి యుద్ధంలాటి చారిత్రకాలు; కంఠమతి, భద్రసేనా విలాసంలాటి సాంఘికాలు కూడా ఆయన రచనల్లో లభిస్తాయి. ఈ కథలు భావ విజృంభణాన్ని, పాత్రల వైవిధ్యాల్ని వ్యక్తం చేస్తుంటాయి. తెలంగాణా జీవితం, తెలుగు గ్రామ్యభాషచ్ఛాయలు వీటిలో చాలా కోణాల్లో ప్రతిబింబిస్తాయి. ఒకరకపు పద్యాలూ పాటలు, సంధి వచనాలు, గద్య సంభాషణలు ఈయన రచనల్లో కనిపిస్తాయి. సామాన్య ప్రజలకు అర్థంకావడానికి వీలుగా రచనల యందంతటా భాష సరళంగా ప్రయోగించ బడింది.

అంతవరకూ ప్రతివారూ నాటకాలు వ్రాస్తుండేవారు. అవి కోకొల్లలుగా అచ్చు అవుతూనూ వుండేవి. భాషాప్రమాణాలు, నిర్మాణపు విలువలు క్రమక్రమంగా దిగజారిపోయాయి. ఒక్క నాటకీయంమాత్రమే ఏ మార్పుపొందకుండా మిగిలిపోయింది. భాగయ్య విద్యార్థి మహమ్మద్ అబ్దుల్లా అనే అతను 'హనుమద్రామసంగ్రామం' అనే యక్షగానాన్ని తెలుగులో వ్రాశాడు. ఒక మహమ్మదీయ వ్యక్తి తెలుగులో యక్షగానాన్ని వ్రాయడం ఆశ్చర్యకరమైన విషయమే. ఇటీవలి కాలంలో వచ్చిన 'క్రోధపురిరైతు విజయం' అనే నాటకాన్ని బట్టి చూస్తే రచయితమీద యీనాటి సోషలిజం ప్రభావం ఎంతగా పడిందోతెలుస్తుంది. వీధి నాటకాల గుణాల్ని కొన్నిటిని పరిరక్షిస్తూ వీధి నాటకంగానే చెలామణి అయినప్పటికీ యిదిసంస్కృతాంగ్ల భాషనాటక విధానాల సమ్మేళనమే అవుతుంది. వ్యాప్తిలోకి రాబోతున్న ఈ రకపు నాటకం యిప్పుడుతెలంగాణాలో వాడుకలోవుంది.11

తెలంగాణా నాటకాలను గురించి ఒక విషయం చెప్పడం అవసరం. ప్రదర్శనకు వీలుగా వీటిని మలచడంచేత యివి బాగా పేరు ప్రతిష్ఠల్ని సంపాదించుకున్నాయి. ఈ విధంగా ప్రజల అభిరుచులకు అనుగుణంగా ప్రదర్శించే సంప్రదాయం యిక్కడ ఊపిరి పీల్చుకొంటోంది. ★

11. కె. గాంధార కవి విరచితమైన చిరుతొండ, శివకుమార నాటకాలు; ఐ. నరసింహులువిరచితమైన స్వారోచ్యోపాఖ్యానం; బూరుగుపల్లి సోదరులనాటకాలు.

# సంగ్రహ ప్రకటనలు

## వ్యవసాయదార్లకు రూ. 12 లక్షల ఋణం

తక్కావీ పద్ధతిమీద ఆయిల్ ఇంజన్లు, విద్యుచ్ఛక్తి మోటారు పంపుసెట్లు కొనుక్కునేందుకై వ్యవసాయదార్లకు ఋణాలు మంజూరు చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1963-64 వ సంవత్సరానికి రూ. 12 లక్షలు మంజూరు చేసింది. ఈ వివరాలు దిగువ ఇవ్వబడినాయి. ఏదైనా జిల్లాకు కేటాయించిన మొత్తం అధికమైనట్లయితే ఆ మొత్తాన్ని ఇతోధికంగా డబ్బు అవసరమైన మరోజిల్లాకు మార్చడం జరుగుతుంది.

శ్రీకాకుళం రూ. 56,980; విశాఖపట్నం-రూ. 50,280; తూర్పుగోదావరి-రూ.23,460; పశ్చిమ గోదావరి - రూ. 30,160; కృష్ణా - రూ. 46,940; గుంటూరు-రూ.49,600 నెల్లూరు-రూ 1,40,770 కర్నూలు-రూ. 76,440 అనంతపురం - రూ. 1,27,370; కడప-రూ. 1,24,000; చిత్తూరు-రూ. 1,24,000; హైద్రాబాదు-రూ.35,860; నిజామాబాదు-రూ. 19,140; మెదక్ - రూ. 35,860; మహబూబ్‌నగర్-రూ.59,760; నల్గొండ-రూ. 68,850; వరంగల్-రూ. 35,380; ఖమ్మం - రూ. 26,300; కరీంనగర్-రూ. 54,500; ఆదిలాబాదు-రూ.14,350.

## నిరుద్యోగ పరిస్థితిని చక్కబరచటానికి ఆర్థిక సహాయం

బృహత్తర హైద్రాబాదులో నిరుద్యోగ పరిస్థితిని మెరుగుపరిచే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం 1963-64 వ సంవత్సరానికి రూ. 10 లక్షలు కేటాయించింది. గత మూడు సంవత్సరాలనుంచీ ప్రభుత్వం ఈ ప్రకారం చేస్తున్నది. ఈ కార్యక్రమం క్రింద, లఘు పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, చేతిపరిశ్రమలు, పారిశ్రామిక సహకార సంస్థలు, పరిగణింపబడిన ఇతర సంస్థల క్రింద ప్రస్తుతం పనిచేస్తున్న లేదా స్థాపించదలచిన పారిశ్రామిక యూనిట్లకు ఋణాలు ఇవ్వడం ద్వారా ఆర్థిక సహాయం చేస్తారు.

నిరుద్యోగ ఉపశమన కృషిలో పాల్గొనే పై పారిశ్రామిక యూనిట్లకై వాటిని స్థాపించ తలచేవారికి దిగువ షరతులపై ఋణాలు ఇస్తారు. (అ) దరఖాస్తుదారు స్వంత పూచీమీద రూ. 1,000/- వరకు; (ఆ) ఇద్దరువ్యక్తులు హామీపై రూ.1,000/-లు మొదలు రూ. 5,000/-ల వరకు. హామీ వుండేవ్యక్తులు శాశ్వతప్రభుత్వోద్యోగులైనా అయివుండాలి లేదా ఆస్తులనన్నా కలిగి వుండాలి. (ఇ) దరఖాస్తుదారు స్థిరాస్తిపై రూ.5,000/- లు మొదలు రూ. 25,000/-ల వరకు.

ఋణాలు పొందదలిచినవారు, నిర్ణీత ఫారాలు, ఇతర వివరాల కొరకు హైద్రాబాదు చిరాగ్ అలీలేనులోని పరిశ్రమలు, వాణిజ్యశాఖ డైరెక్టరును సంప్రదించవచ్చు.

## ఖరీఫ్ ఉద్యమం

1963 ఖరీఫ్ ఉద్యమానికి ప్రభుత్వం రూ. 28,420 లు మంజూరు చేసింది. గత సంవత్సరాలలో వలెనే సాంద్ర వ్యవసాయ కార్యక్రమ ప్రాతిపదికపై ఈ ఉద్యమాన్ని చేపడతారు. ఈ ఉద్యమం నిమిత్తమై శ్రీకాకుళం, విశాఖపట్నం, అనంతపురం, కడప, హైద్రాబాదు, నల్గొండ, ఆదిలాబాదు, మెదక్, ఖమ్మం జిల్లాలలో ప్రతి గ్రామ సేవకుని సర్కిలు నుంచీ రెండుగ్రామాలను ఎన్నిక చేస్తారు. ఈ గ్రామాలలో ఆహార పంటల క్రింద నీటి పారుదల జరిగే విస్తీర్ణమంతటికీ ఉద్యమాన్ని వర్తింపజేస్తారు. విత్తనాలు చల్లేకాలంలో ఉద్యమాన్ని ప్రారంభిస్తారు.

ప్రభుత్వం ఇప్పుడు రాష్ట్రంలోని పది జిల్లాలకూ సాంద్రవ్యవసాయ పథకం పద్ధతిలో తీవ్రతర వరిసేద్యం పథకాన్ని మంజూరు చేసింది. కాబట్టి, పశ్చిమగోదావరి జిల్లాలో తీవ్రతర జిల్లా వ్యవసాయ కార్యక్రమం ఇదివరకే వర్తింప జేయబడింది. కాబట్టి,1963 ఖరీఫ్ ఉద్యమాన్ని మిగతా తొమ్మిది జిల్లాల లోని పంచాయితీ సమితిప్రాంతాలన్నింటిలోనూ విస్తృత ప్రాతిపదికపై ప్రతి గ్రామసేవకుని సర్కిలులోనూ రెండుగ్రామాలలో చొప్పున అమలు పరుస్తారు.

## ఓటర్ల జాబితాల పునఃపరిశీలన

రాష్ట్రంలోని అన్ని శాసనసభల ఓటర్ల జాబితాలను 1963 సంవత్సరంలో స్వల్పంగా పునః పరిశీలన చేయాలని ఎన్నికలసంఘం ఆదేశించింది. కనుక ఇంటింటికీవెళ్ళి వివరాలు సేకరించడం జరుగదు. 1950 వ సంవత్సరపు ప్రజా ప్రతినిధుల చట్టం 16 వ శెక్షను క్రింద అనర్హత పొందకుండావుండి. సాధారణంగా ఏదైనా నియోజకవర్గంలో నివసిస్తూ వుండి, 1-1-63 నాటికి

21 సంవత్సరాల వయస్సువున్న వారెవరైనా తాము నివసిస్తున్న నియోజకవర్గానికి సంబంధించిన ఓటర్ల జాబితాలలో తమపేర్లు నమోదు చేసుకోవడానికి అర్హత కలిగి వుంటారు. ఎవరైనా వ్యక్తికి ఏదైనా ప్రదేశంలో స్వంతఇల్లు వున్నంతమాత్రాన కానీ లేదా అతని అధీనంలో ఇల్లు వున్నందు చేతగానీ ఆ నియోజక వర్గానికి సంబంధించిన నియోజక వర్గంలో తనపేరు నమోదు చేసుకొనడానికి అతనికి అర్హతవుండదు. ఓటరు ఏ నియోజకవర్గపు ఓటర్ల జాబితాలో తనపేరు నమోదు కాగోరుతాడో ఆ నియోజకవర్గంలో అతడు సాధారణంగా నివసిస్తూ వుండడం అవసరం.

మన రాష్ట్రంలో 1963వ సంవత్సరంలో జరిగే ఓటర్ల జాబితాల పునఃపరిశీలన కార్యక్రమం దిగువ విధంగా అమలు జరుగుతుంది. ఓటర్ల జాబితా ముసాయిదాల ప్రకటన తేదీ 10-7-1963; క్లెయిములు, అభ్యంతరాలను దాఖలు చేసుకునే ఆఖరు తేదీ 9-8-1963. ఓటర్ల నమోదు అధికార్లు ఆయా క్లెయిములు, అభ్యంతరాలను పరిష్కరించేతేదీలు 19-8-1963 నుంచి 6-9-1963 వరకు. క్లెయిములు, అభ్యంతరాలు మొదలైన వాటిపై ఓటర్ల నమోదు అధికార్లు ఇచ్చిన తీర్పుల పర్యవసానంగా అవసరమయ్యే సవరణల జాబితాలతయారీ, ముద్రణ; 21-10-63.

ఓటరుగా నమోదు కావడానికి అర్హత కలిగివుండి, 10-7-1963 తేదీన ప్రకటించబడే ఓటర్ల జాబితాలో పేర్లులేని వ్యక్తులు, 1960 వ సంవత్సరపు ఓటర్ల రిజిస్ట్రేషను నియమావళికి అనుబంధంగావుండే 6 వ నెంబరు ఫారములో క్లెయిము దరఖాస్తులు వ్రాసి రిజిస్ట్రేషను ఆఫీసర్ల (రెవెన్యూ డివిజనల్ ఆఫీసర్లు) కుగానీ లేదా రిజిస్ట్రేషన్ ఆఫీసర్లచే ఇందునిమిత్తమై అధికారం పొందిన మరెవరైనా అధికారికి గానీ 9-8-1963 తేదీన గానీ తత్పూర్వంగానీ దాఖలు చేయాలి. ఏదైనా అంశం విషయంలో తెలుపుకునే అభ్యంతరాలనుకూడా 7 వ నెంబరు ఫారములో ఈ గడువులోగా దాఖలు చేయాలి.

## తీవ్రతరంగా ఎరువుల వాడకం

1963-64 వ సంవత్సరంలో రాష్ట్రంలో తీవ్రతర ఎరువుల వాడకం పథకాన్ని అమలు జరుపడాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆమోదించి దీనికై రూ. 50-00 లక్షలు మంజూరు చేసింది. వివిధ సమితి, నాన్‌సమితిప్రాంతాలలో రైతులు రసాయనిక ఎరువులను కొనుగోలు చేయడానికి వీలుగా పై మొత్తాన్ని ఋణంగా పంపిణీ చేస్తారు.

దిగువ తెల్పిన పైర్లకు వాటికెదురుగా పేర్కొన్న మొత్తాలమేరకు ఒక్కొక్క వ్యక్తికి రూ. 500/ లకు మించకుండా ఋణాలు ఇస్తారు.

(అ) మొక్క జొన్న మినహా జొన్న, రాగి, వరితో సహా అన్ని కాయధాన్యాలు... రూ. 35/- ఎకరానికి.

(ఆ) ప్రత్తితోసహా అన్ని వ్యాపార పంటలు రూ. 35/- ఎకరానికి.

(ఇ) ఫలాలు, కూరగాయలు, అరటి, పొగాకు, మొక్క-జొన్న... రూ. 70/- ఎకరానికి.

(ఈ) చెరకు...రూ. 100/- ఎకరానికి.

జిల్లా పరిషత్తులు చేసిన సమితులవారీ కేటాయింపుల ప్రాతిపదికపై పంచాయతీ సమితులకు ఒకే వాయిదాలో ఋణాలను జారీచేయడానికి జిల్లా వ్యవసాయ శాఖాధికారులకు ప్రభుత్వం అధికారం ఇచ్చింది. యీ ఋణాలపై 6 శాతం వడ్డీ విధించడానికికూడా ప్రభుత్వం ఉత్తరువు చేసింది. అయితే యీ వడ్డీరేటు ఆతర్వాత చేసే సవరింపులకు లోబడివుంటుంది.

## విద్యా రాయతీలు

పోరాటంలో నిమగ్నమైవున్న లేక సరిహద్దు ప్రాంతాలలో నియుక్తులైన లేక పోరాటంలో అసువులు కోల్పోయిన లేదా దుర్బలులైపోయినట్టి సైనికోద్యోగుల పిల్లలకు కల్పిస్తున్న విద్యారాయితీలను, భారత-టిబెట్టు సరిహద్దులోనూ, నాగా భూమిలోనూ ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో నియమించబడిన రాష్ట్రపోలీసుదళోద్యోగుల పిల్లలకుకూడా వర్తింపజేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఈ ఉద్యోగులు ఆయా ప్రదేశాలలో వాస్తవంగా పనిచేసేకాలంవరకూ ఈ రాయతీలు వర్తింపులో వుంటాయి.

## పంచాయతీ సభ్యుల పదవీకాలం పొడిగింపు

ఆంధ్రప్రాంతంలోని కొన్ని పంచాయితీలకు 1960 వ సంవత్సరంలో ఎన్నికలు జరిగాయి. కాబట్టి అట్టి పంచాయితీలకు 1963 వ సంవత్సరంలో తిరిగి ఎన్నికలు జరుగవలసివుంది. 1963 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయితీల బిల్లులో పంచాయతీల కాలపరిమితిని 1964 జూలై మొదటితేదీవరకు పొడిగించడానికి నిబంధన

చేర్చబడింది. ఈ బిల్లు ప్రస్తుతం శాసన సభలో నిలిచి వుంది. ఈ బిల్లుశాసనరూపం దాల్చేలోగా ఇప్పుడు ఇటువంటి పంచాయితీ సభ్యుల పదవీకాలాన్ని 1963 డిశంబరు 31 వ తేదీ వరకు పొడిగించడం అవసర మని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భావించి తదనుగుణ్యంగా, 1963 డిశంబరు 31 వ తేదీలోగా పదవీకాలం ముగిసే ఆంధ్ర ప్రాంతంలోని పంచాయితీ సభ్యులందరి పదవీకాలాన్ని 1963 డిశంబరు 31 వ తేదీ వరకు పొడిగించడానికి ఉత్తర్వు చేసింది.

## భిక్షాటన నిరోధన

హైద్రాబాదు భిక్షాటన నిరోధక చట్టాన్ని, హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో 1963 అక్టోబరు మొదటి తేదీనుంచి అమలు పరచడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఈ నిర్ణయాన్ని అమలు పరచడానికి వీలుగా అవసరమైన చర్యలు తీసుకుంటున్నారు.

## నౌకా కేంద్రం

ఇదివరకే విశాఖపట్నానికి మంజూరు చేసిన శాశ్వత నౌకాకేంద్రం స్థాపనకు బదులు సంచారనౌకాకేంద్రాన్ని సేకరించే ప్రతిపాదనను విశాఖపట్నం హిందుస్తాన్ షిప్‌యార్డ్ డైరెక్టర్లబోర్డు ఆమోదించినట్లు రాష్ట్రప్రభుత్వం దృష్టికి వచ్చింది.

శాశ్వత నౌకా కేంద్రానికి సంబంధించిన ప్రతిపాదన 1955 వ సంవత్సరంలోనే మంజూరైనప్పటికీ విదేశ మారకద్రవ్యం కొరత కారణంగా దానిని చేపట్టడానికి వీలు పడలేదనే కారణాన్ని సంచార నౌకాకేంద్రం స్థాపనను సమర్థిస్తూ చూపడం జరిగింది.

(అ) శాశ్వత నౌకా కేంద్రానికై ప్లానులు, అంచనాలను స్థిరీకరించడానికి ఇది వరకే చాలామొత్తం ఖర్చుచేసినప్పటికీ (ఆ) ఒకస్థలనుంచి మరో స్థలానికి తరలింప కలిగిన సంచారనౌకా కేంద్రం కంటే శాశ్వత నౌకా కేంద్రమే ఎక్కువ ప్రయోజనకారి అనే సంగతి సుస్పష్టమే అయినప్పటికీ, శాశ్వత నౌకా కేంద్ర నిర్మాణానికి లోగడ ఆమోదించిన ప్రతిపాదనను మార్చి సంచార నౌకా కేంద్రం స్థాపనకు ప్రతిపాదించడంవల్ల వుండే సాధకబాధకాలు రాష్ట్ర ప్రభుత్వానికి తెలుసు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ విషయాన్ని భారత ప్రభుత్వం రవాణామంత్రిత్వ శాఖకూ, విశాఖపట్నం హిందుస్తాన్ నౌకా నిర్మాణ కేంద్ర మేనేజింగ్ డైరెక్టరుకూ, ఈ ప్రతిపాదనకు సంబంధించిన పూర్తివివరాలను తెలుసుకోవడానికీ, ఈ విషయంలో, ఇబ్బందీ, దుబారా జరుగకుండా అవసరమైన చర్యలు తీసుకోవడానికి వీలుగా నివేదించింది. ★



## ఆంగ్లకథ


మూలం :
గెయిరాల్ కర్ష్

అనువాదం :
కు॥ జానకీరామ పట్నాయక్


'సర్...ర్...ర్' మంటూ తీవ్రవేగంతో గుండు దూసుకు వచ్చింది. లెఫ్టినెంట్ లింగ్‌పో _ రెప్పపాట్లో నేలమీద బారుగా పరుండిపోయాడు. పర్వత ప్రాంతం. నాలుగువేపులా కారడవి. లింగ్‌పో, అతని 'గైడ్' ఇద్దరూ కలిసి ఆ దుర్గమ ప్రాంతంలో కాలిబాట ఏర్పరుస్తున్నారు. ఇంతలో హటాత్తుగా ఆపద చుట్టిముట్టింది. లింగ్‌పో బతికిపోయాడు. 'గైడ్' మాత్రం ఆ ఘాఘాగానికి బలి అయిపోయాడు. గుండు అతని గుండెల్లో దూసుకుపోయింది. శాశ్వతంగా కన్ను మూశాడు. లింగ్‌పో ఒంటరివాడై పోయాడు.

'గైడ్' శవాన్ని కొన్ని నిముషాలు పాటు రెప్ప వెయ్యకుండా లింగ్‌పో చూశాడు. దీర్ఘంగా నిట్టూర్చాడు. తన సంచిలో ఉన్న దుర్భిణీ తీసి గుండు వచ్చిన వేపు పరీక్షగా చూశాడు. రమారమి వెయ్యి గజాల దూరంలో రైఫిల్తో పోతూన్న ఒక వ్యక్తి లీలగా కనిపించాడు. దుర్భిణీ

అనువాద భారతి

సంచిలో ఉంచి నాలుగువేపులా పరికించాడు. అంతా నిశ్శబ్దంగా, నీరవంగాఉంది. పగలైనా ఆ ప్రదేశం చిరుచీకటిగా ఉంది. 'ఏదోవిధంగా — యిక్కణ్ణుంచి కదిలి పోవాలి !......కాని — ఎలా ? 'గైడ్' చచ్చిపోయాడు; దారి తెలియదు. పైగా రాత్రి ముంచుకొస్తున్నది —' అనుకున్నాడు లీంగ్‌పో.

చచ్చి పడిఉన్న 'గైడ్' సంచిని లీంగ్‌పో తీసుకున్నాడు — అందులో కొద్దిపాటి తినుబడి పదార్థాలున్నాయ్ ! వాటిని తన సంచిలో వేసుకున్నాడు. ఆ శవాన్ని తోవ ప్రక్కనున్న రాళ్ళ మధ్యకు లాక్కుపోయాడు. కొన్ని రాళ్లు తీసి, శవాన్ని ఆ కొద్దిపాటి పల్లంలో ఉంచి, దాన్ని రాళ్ళతోనూ, మట్టితోనూ కప్పిపెట్టాడు. తరవాత మెల్లమెల్లగా బయల్దేరాడు. ఆ ప్రదేశం నిర్జనంగా ఉన్నా లీంగ్‌పో మాత్రం ఎన్నెవరో వెంటాడుతున్నట్టు జంకుజంకుతూ, చెట్లమాటున దాక్కుంటూ నడక సాగిస్తున్నాడు. ఉదయం నుంచీ నడుస్తూ ఉండడంవల్ల లీంగ్‌పో చాల అలసిపోయాడు. నడవలేకపోతున్నాడు. ఒక లతాగుల్మం దగ్గరకొచ్చి కాసేపు సేద దీర్చుకున్నాడు. నిద్ర ముంచుకొస్తున్నది. కాని — ఎలా నిద్రపోతాడు ?......లేచి, కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరాడు. ఆకలి వేధిస్తున్నది. దాన్ని మించి దాహం సతాయిస్తున్నది. నీటిచుక్క కనిపించే ఆస్కారం ఏ వైపునా లేదు. తన దగ్గర తినుబడి పదార్థాల్లేవు. వాటర్ బేగ్ మధ్యాహ్నమే ఖాళీ అయిపోయింది. గైడ్ సంచినుంచి తీసిన చిన్న రొట్టెముక్కా, రెండు ఖర్జూరపు కాయలూ నోట వేసుకున్నాడు. కాని అదే మాత్రం ? ఏనుక్కు వెలక్కాయ ! శరీరం రాట్నంలో పెట్టి నలగదీస్తున్నట్టు బాధపడుతున్నాడు. కండ్లు తేలిపోతున్నాయ్ ! నాలుక పిడుచకట్టుకు పోతున్నది !...శ్వాస — వీరసంగా, వేడిగా వస్తున్నది !...చెవుల ఘడియలు పడుచున్నవి !...ఇవన్నీ మరణ చిహ్నాలేమోనని లీంగ్‌పో అనుమానపడ సాగాడు ఎలానో, మిగిలిఉన్న శక్తిని కూడగట్టుకొని ముందుకు పోతున్నాడు !

అదృష్టవశాత్తూ, కొద్ది దూరంలో ఒక యిల్లు కనిపించింది. లీంగ్‌పోకు ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆశ — నిరాశల మధ్య ఊగులాడుతూ, విసవిస ఆ వేపు నడక సాగించాడు. ఐతే — ఆ యిల్లు శత్రువులదేమో ?...ఔను ! శత్రువులదే !......ఆ ప్రాంతంలో మిత్రు లెవరున్నారు ?...ఎవరైతేనేం ?...ఒకవేళ వాళ్ళు గుర్తుపట్టి చంపివేస్తారేమో ? కానియ్ !...ఆకలీ దాహమూతో ఏలాగూ చావు వచ్చేటట్టు ఉంది. ఏమైనా మంచిదే !...మొత్తానికి తనకు విశ్రాంతి కావాలి ! కడుపార తిండి లేకపోయినా, దగ తీర్చే మంచి నీళ్ళు దొరికితే చాలు !...

లీంగ్‌పో — అతి కష్టంమీద ఆ యింటిని సమీపించాడు. తలుపులు బంధింపబడి ఉన్నాయ్ !...తట్టి పిలుద్దామని అనుకొంటూండగానే, అతను స్మారకం తప్పి, కుప్పపెట్టున ద్వారం దగ్గర కూలిపోయాడు.

ద్వారం తెరుచుకుంది. వెనువెంట యిలా వినవచ్చింది — "సుస్వాగతం భాయీ !... ఇలా దయచేయండి —'' కాని ఆ మాటలు లీంగ్‌పో చెవుల్లో పడలేదు.

సరిగ్గా యిరవై నాలుగు గంటల తరవాత లీంగ్‌పోకు తెలివి వచ్చింది. కండ్లు విప్పి చూశాడు. తను - ఒక మంచంమీద పరున్నాడు. తలకింద మెత్తని దిండ్లున్నాయ్ ! మంచంమీద ఒత్తుగా పరుపూ, కంబళ్లూ ఉన్నాయ్ ! ఎట్టఎదుట ఒక వృద్ధుడు గిన్నెనిండా 'సోర్వా'తో నిల్చున్నాడు. ఆ వృద్ధున్ని చూడగానే లీంగ్‌పో రావి ఆకులా ప్రకంపించిపోయాడు. అతను నేపాళీలా ఉన్నాడు. అంటే శత్రువు ! తను న్న ప్రదేశం బొమ్డీలాలోనిది ! అప్పటికి బొమ్డీలా పూర్తిగా తమ (చీనా) చేతుల్లోకి రాలేదు. దొంగపోరు సాగుతునే ఉన్నది. ఆ బొమ్డీలాలో — నేపాళులూ, గూర్ఖాలూ, తదితర గిరిజనులూ ఉన్నారు. తనూ కొంత సైన్యంతో యుద్ధం సాగిస్తున్నాడు. ఆ సైన్యానికి తను — లెఫ్టినెంట్ !...క్రితం రోజు తన చేతుల్లో చాలమంది బొమ్డీలా వాసులు ప్రాణాలు పోగొట్టుకున్నారు !... ఈ విషయం ముసలివానికి తెలిస్తే — గుప్‌చుప్‌గా ఊరుకుంటాడా ?...తన శరీరాన్ని 'ఖుర్కీ'తో ముక్కలు ముక్కలుగా తరిగి వేయడూ ?...

"ఇదిగోనండి సోర్వా !...కోడిపిల్లల సోర్వా !...తాగండి ! బలం చేకూరుతుంది ! తరవాత — విశ్రాంతి తీసుకోండి —'' వృద్ధుడు వినయంగా అన్నాడు.

లీంగ్‌పో భయభయంగా, క్షీణస్వరంతో అన్నాడు - "నే నెవరినో...బహుశా మీకు తెలియనట్టుంది. నేను...చీనా సైన్యం - ఒక దళానికి లెఫ్టినెంటును —''

"హుం !...అయిఉండొచ్చు ! కాని — ప్రస్తుతం మీరు మా అతిధులు ! మాకు - అంటే—భారతీయులకు అన్నిటికన్నా అతిధి సేవ ముఖ్యం! ఈ విషయంలో శత్రు, మిత్ర భేదంలేదు !...మీరు మా ద్వారం దగ్గరకు వచ్చారు. మీరు ఎవరైందీ మాకు అవసరం లేదు ! మాకు మీరు అతిధి !...అంతే !... మీరు నిర్భయంగా, నిస్సంకోచంగా మా యింట ఉండవచ్చు ! తినవచ్చు !...తిరగవచ్చు !...విశ్రాంతి తీసుకోవచ్చు !'' చిర్నవ్వుతో వృద్ధుడు జవాబిచ్చాడు.

''కాని — మహాశయా! మా దేశీయులం మీ దేశం మీదకు దండెత్తుకు వచ్చాం కదా...'' వినీ వినిపించనట్లు లీంగ్‌పో సణుక్కున్నాడు.

''చిత్తం!...ఈ విషయం బాగా తెలుసు!'' నిర్లిప్తంగా వృద్ధు డన్నాడు.

''ఐతే...ఐతే...నేను...మీ ఖైదీనా?'' కాతరస్వరంతో లీంగ్‌పో ప్రశ్నించాడు.

వృద్ధుడు నిర్వికారంగా నవ్వి ప్రశాంతంగా ''ఎంతమాత్రం కాదు! మీరు మా అతిధులు! అందువల్ల గౌరవనీయులు! మీరు స్మారకం తప్పి ఉంటూండగానే నేనూ, నా భార్యా మిమ్మల్ని పోల్చుకున్నాం! ఐనప్పటికీ — మీరు మా వాకిట్లో, ప్రాణావశిష్టులై పడి ఉన్నారు!...ఇలాంటి పరిస్థితుల్లో మాకు శత్రు, మిత్ర భేదం లేదు. ఆపదలో ఉన్నవారినీ, అతిధుల్నీ సహాయపడి గౌరవించడమే మా భారత జాతి ధ్యేయం!...ధర్మం!!...మీరు ఇతరత్రా చింతలు మాని, దీన్ని మీ స్వంత యిల్లుగా భావించి, నిర్భయంగా, ఆనందంగా ఉండండి!...మీకు ఇష్టంవచ్చి నన్నాళ్ళు— ఒక రోజే కానివ్వండి — లేక — ఒక సంవత్సరమే కానివ్వండి — అతిధిగా ఉండండి!... మీ రెప్పుడు వెళ్ళిపోదలుస్తారో చెబితే, ఆనాడు మీ ప్రయాణానికి కావల్సిన ఏర్పాటు చేస్తాను. మా ప్రాంతంలో ఉన్నంతకాలమూ మీ కెలాంటి కష్టనష్టాలు రానివ్వను! కావల్సొస్తే నా ప్రాణాల్ని బలి చేస్తాను. కాని మీకు మాత్రం హాని కలగనివ్వను—" అన్నాడు.

లీంగ్‌పో ఆ మాటలు విని, నిబ్బరపడి, ముసలతను ఇచ్చిన సోర్బాను తృప్తిగా తాగివేశాడు. ఆ గది నాలుగు మూలలూ కలియజూశాడు. గది ఎంతో శుభ్రంగాఉంది. భారతీయత ప్రతీ అంగుళంలో మూర్తీభవించిఉంది. ముసలాతని పేరు పరమానంద లింబూ!

"మీరు — యిప్పుడే భోజనం చేస్తారా.. లేక కాసేపు పోయాక చేస్తారా?" ప్రశ్నించాడు లింబూ.

"నా గురించి చాల శ్రమ తీసుకుంటూ ఉన్నారు. నన్నిక వెళ్ళనివ్వండి! క్యాంపుకు వీలైనంత త్వరలో చేరుకోవాలి!...... ఆలస్యం చేస్తే ప్రమాదం'' లీంగ్‌పో అన్నాడు.

"సరే! మీ యిష్టానికి వ్యతిరేకంగా ఏమీ చేయను. కాని — ముందుగా భోజనం కానివ్వండి'' నమ్రస్వరంతో లింబూ అన్నాడు.

లీంగ్‌పో మౌనం వహించాడు, దాన్ని అర్ధాంగీకారంగా తీసుకొని లింబూ వంటయింటికి వెళ్ళాడు, కొద్దిసేపట్లో వంటవాడు వచ్చి చిన్న ముక్కాలి పీటమీద భోజనం అమర్చాడు. లీంగ్‌పో కడుపార భుజించి, త్రేన్చి తృప్తిపడ్డాడు. అతని శరీరంలో ద్విగుణీకృతమైన శక్తీ, ఉత్సాహమూ వచ్చాయ్!

''ఆఁ...తాజావార్త లేమిటి?'' లీంగ్‌పో ప్రశ్నించాడు.

''బొమ్డీలా పడిపోయింది!...మీ జండా ఎగురుతున్నది — '' గంభీరంగా లింబూ జవాబిచ్చాడు.

ఆమాట లీంగ్‌పోకు అమృతప్రాయంగా సోకింది — 'ఒహో! అందుకే ముసలాడు నన్నింత 'ఖుషామదు' చేస్తున్నాడు —' అనుకున్నాడు లోలోపల! బయటకుమాత్రం "మహాశయా! మీ రీనాడుచేసిన ఉపకారం నా హృదయంలోనే ఉంటుంది! సమయం వస్తే నాశక్తికొద్దీ ప్రత్యుపకారం చేస్తాను!... విశ్వసించండి!" అన్నాడు.

లింగ్‌పో ధోరణి లింబూకు పరమ అసహ్యంగా తోచింది. అతని అంతఃకరణ క్షణంలో గ్రహించాడు. ఐనా — తనభావాన్ని మరుగుపర్చి ప్రశాంత స్వరంతో "మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకుంటున్నారు. నేను మిమ్మల్ని అతిధిగా భావించి నా చేతనైన సేవ చేస్తున్నాను. కాని ప్రత్యుపకారవాంఛతో చేయలేదు! మా భారతీయ సాంప్రదాయానుసారం మిమ్మల్నిగౌరవించి ఆతిథ్యం యివ్వాలి! ఇందులోవేరే ఆకాంక్ష లేదు! అయితే — ఒకటే విచారం...! అది — మీరు చైనీయులవటం...! అదే — దురదృష్టం —" అన్నాడు.

చివరమాట వినీ వినగానే లీంగ్‌పో ముఖం ఎర్రగా, కందగడ్డయిపోయింది —

"చైనీయులవడం... దురదృష్టమా...? కాస్త నోరుసమాళించుకొని మాటాడండి మహాశయా!" అన్నాడు లీంగ్‌పో.

లింబూ అదే ధోరణిలో, నిర్భయంగా మాటాడుకుపోతున్నాడు — ''ఔను ...! దురదృష్టమే...! ఎందుకంటె...?మీరేమో మాయింట్లో...కాగా...మా పూరి పొలిమేర్లోపల ఉన్నంతసేపూ అతిధులే,...! ఆపైని మీరు మా శత్రువులు!...బద్ధవిరోధులు! ... మీరు మా యింటికి రాబట్టి అతిధులయ్యారు. ఆతిథ్యం యివ్వడం మా కర్తవ్యమైంది...! ఈ అతిధిసేవా — ఈ పవిత్ర ధర్మం — మా భారతీయుల్లో యుగయుగాలుగా, తరతరాలుగా వస్తూ ఉన్నది. అంతేగాని — మా యీ పవిత్ర ధర్మాన్ని, మీరు — మేము మీదగ్గర భయపడుతూ, మీదయ సంపాయించడంకోసం చేస్తూన్న 'ఖుషామత్' అని తలస్తూ వున్నట్టుంది! అదే నిజమైతే — మీరు తప్పక తప్పటూహలో ఉన్నారని చెప్పడానికి సాహసిస్తున్నాను —"

లింగ్‌పో ఏమనుకున్నాడో ఏమిటో జవాబివ్వలేదు. లింబూ తిరిగి శాంతంగా "కాస్త మిఠాయి స్వీకరించండి —" అంటూ గాజు పళ్లెంలో ముందు నాలుగురకాల తీపి పదార్థాలు లింగ్‌పో ఎదుట ఉంచాడు. లింగ్‌పో వాటిని ఆరగిస్తూ "భేష్...! భేష్...! మీ భారతీయులు భోజనపదార్థాలూ, మిఠాయి దినుసులూ దివ్యంగా తయారుచేస్తారు బాయీ !" అని పెట్టినదంతా ఆరగించాడు.

కాసేపు పిచ్చాపాటీ అయాక లింగ్‌పో అదోలా నవ్వుతూ "మహాశయా !... ఇప్పుడు జరుగుతున్నయుద్ధం — యుద్ధంలా కాకుండా చిన్న తమాషాగాఉన్నది ! ... మీ భారతీయులు ప్రతిరంగంలోనూ వెనక్కు జరగడమేగాని— ముందుకు ఒక అడుగైనా వేయలేకపోతున్నారు ! ఆఁ ! ఒక సంగతి మాత్రం ఒప్పుకోనకతీరదు !... మీలో క్రమశిక్షణ అమోఘం ! ప్రతి ఒక్కరూ ధైర్య సాహసాలకు కాణాచి ! రైఫిలు పట్టుకుంటే — ఎండుటాకులు రాల్చినట్లు శత్రువుల్ని రాల్చివేస్తారు ! ... ఇవాల్టి విషయంవినండి - నేనూ, 'నా గైడూ' పర్వతాలనుంచి వస్తూవుండగా, వెయ్యి గజాలదూరంనుంచి ఒక భారతీయుడు ప్రయోగించిన రైఫిలుగుండు, సరాసరి మా గైడ్‌గుండెకాయను చీల్చుకుంటూ దూసుకుపోయింది —" అన్నాడు.

లింబూ జవాబివ్వలేదు. బయట ఎవరో ఆడవాళ్ళు పెద్ద పెట్టున రోదిస్తున్నట్లు వినవచ్చింది. సంగతేమిటంటే — చైనీయులు చేసిన దురాక్రమణ ఫలితంగా జరిగిన యుద్ధంలో లింబూ కొడుకులు ఐదుగురూ పాల్గొన్నారు. పాపం ఆ ఐదుగురూ ఆ యుద్ధంలో ప్రాణాలుకోల్పోయారు!...ఇప్పుడా ఐదుశవాలూ లింబూ యింటికి తెచ్చారు. ఆ ఐదుగురినీ కన్నతల్లి — వృద్ధురాలు — చూసి ఘోరంగా విలపిస్తున్నది. ఆ దృశ్యం చూసి లింబూకాసేపు విచలితుడై పోయాడు. కాని అంతలోనే తెప్పిరిల్లి లింగ్‌పోతో "క్షమించండి : మీ విశ్రాంతికి భంగం కలిగినట్టుంది. ఏం జేస్తాం ? ... నేనూ యుద్ధానికి పోయాను. కాని — అదృష్టహీనుణ్ణి ! వీరస్వర్గం పొందలేకపోయాను.'' అన్నాడు.

లింగ్‌పో ఖిన్న స్వరంతో — "భగవంతుని లీల !...బహుశా యీ ఐదుగురి ప్రాణాలూ నేనే తీశానేమో ? ఆఁ...నిన్నటి యుద్ధంలో - ఔను !...ఐనా - ఎవరు ఎవరి చేత మరణిస్తారో....చెప్పడం దుస్సాధ్యం కదా ? - '' అన్నాడు.

లింబూ దుఃఖాన్నీ, ఆవేశాన్నీ అణచుకొని "సరే ! మహాశయా ! మీరు మాత్రం నిశ్చింతగా ఉండండి !...మీ రిక్కడ ఉన్నంతకాలమూ మీ కెలాంటి ఆపదా రాదని హామీ యిస్తున్నాను. మీరు ఎవరవనివ్వండి- ప్రస్తుతానికి మా అతిథులు ! అందువల్ల మీ పట్ల ఏవిధమైన అనుచితమూ జరగదు !" అన్నాడు.

"లేదులేదు ! మీరు పదేపదే చెప్పవద్దు. మీ మాటలపట్ల నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది. నా కెలాంటి భయమూలేదు. ఐతే — మీరు చేస్తున్న యీ సేవా శుశ్రూషలకు ప్రత్యుపకారం — "

"అవసరంలేదు. మా స్థితి మీరుచూస్తూనే ఉన్నారు. కృతజ్ఞుణ్ణి ! వేరే ఆలోచనలు పెట్టుకోకండి !...ఇదిగో ... మీకోసం యీ షర్బత్తు తయారు చేశాం !......స్వీకరించండి — "

"వాస్తవానికి మహాశయా ! మీ యీ అతిథి గౌరవమూ, తరతరాలుగా వస్తున్న మీ ఆతిథ్య ధర్మమూ చూస్తూంటే నా కెంతో సంతోషంగా ఉంది. ఈ విషయంలో నేను మా ప్రభుత్వంతో చెప్పి తగిన ప్రత్యుపకారం జరిగేలా చూస్తాను."

లింబూ లింగ్‌పో మాటలమీద ధ్యానం ఉంచకుండా చల్లగా నిట్టూర్చి, శాంత స్వరంతో చెప్పుకుపోయాడు -

"మీరు బహుశా గమనించే ఉంటారు.. మా వూరు యీ పర్వతం మీద అన్నిటికన్నా ఎత్తయిన శిఖరంమీద నిర్మింపబడిఉందని ! అందువల్ల మీ చైనీయులు ఏంచేసి పోతారో అన్న భయం నాకు పిసరంతయినా లేదు ! ఈ ప్రదేశానికి రావడానికి కేవలం ఒకేఒక తోవ ఉంది. అది నాకూ, నా అంతరంగిక సేవకునికే తెలుసు ! ఒకప్రకారంగా అనుకోవల్సొస్తే యిదొక అజేయ దుర్గం ! దీన్ని జయించడానికి మీ సర్కారువారు ఎంతో పెద్ద సైన్యం పంపాల్సి ఉంటుంది ! అప్పటికైనా జయం మీకు లభిస్తుందో లేదో ?... ఆఁ...చెప్పడం మర్చాను. మా ఆతిథ్యం గురించీ, అందులోగల కట్టుబాట్లు గురించీ మీకో చిన్న సంఘటన వివరిస్తాను — ఒకప్పుడు యీ ఇలాకాకు చెందిన ఒక వ్యక్తి, తన పొరుగాయన భార్యను హత్య చేశాడు. ఆ భర్త హంతకుణ్ణి మట్టుబెట్టడానికి ప్రతిజ్ఞ పట్టాడు. కాని, ఆ హంతకుడు ఆ భర్త యింట్లో అతిథిగా ప్రవేశించాడు. ప్రవేశించడమే కాదు. అలా అతిథిగా యిరవై సంవత్సరాలు ఉన్నాడు. ఆ వ్యవధిలో అతణ్ణి ఎవరూ కొద్దిపాటి కష్టం కూడా కలిగించిన పాపానపోలేదు. హంతకుడు మహామజాగా, సుఖంగా, నిశ్చింతగా పెళ్ళికొడుకులా ఉంటూ వచ్చాడు — ''

లింబూ చెబుతున్నదానికి లింగ్‌పో అడ్డు వచ్చి "గడ్డం బాగా మాసిపోయింది. పరికరాలున్నాయా ?" అన్నాడు. లింబూ వెంటనే రేజరూ, బ్రష్షూ, సబ్బూ, సీశ్నా, తువ్వాలూ అమర్చాడు. లింగ్‌పో క్షురకర్మ

పూర్తిచేసుకొని "ఇక నేను వెళ్ళిపోతాను" అన్నాడు.

"మీ యిష్టం!'' జవాబిచ్చాడు లింబూ.

లీంగ్ పో తయారయ్యాడు. నౌకరుతో చెప్పి లింబూ ఒక గుర్రాన్ని తెప్పించాడు. దానిమీద జీనూ, కళ్లెమూ లింబూస్వయాన అమర్చాడు. లీంగ్‌పోను సగౌరవంగా దాని మీద అధిష్ఠింప జేశాడు. తోవలో తినడానికి రొట్టెలూ, కూరా, పండ్లూ కట్టియిచ్చాడు. 'వాటర్ బేగ్' నిండా నీరుపోసి అందించాడు. తనొక గుర్రంమీద ఆరోహించి అతిధిని సాగనంపడానికి బయలు దేరాడు.

ఇద్దరూ చాలాదూరం వచ్చారు. సూర్యుడు పశ్చిమాద్రిలో దాక్కొనడానికి ప్రయత్నిస్తున్నాడు. లింబూ చటుక్కున గుర్రాన్నిఆపి "నా భూభాగానికిది సరిహద్దు!" అన్నాడు గంభీరంగా! లీంగ్‌పో త్రుళ్లి పడ్డాడు! భయావేశంతో "అరరే! ఇదేఁవిటి?" అన్నాడు - లింబూ చేతిలో రివాల్వరు చూస్తూ! ఆరివాల్వరు సరిగ్గా లీంగ్‌పో హృదయానికి గురిపెట్టబడిఉంది!

లింబూ అదేగంభీరస్వరంతో అన్నాడు- "ఆఁ! ... ఇందాక ఆ హంతకుని గురించి విన్నారుకదా? తరవాత ఒకనాడు ఏదోపని మీద ఆ హంతకుడు గ్రామానికి బహు దూరంలోఉన్న ఒక తోటకు వెళ్లాడు. అక్కడ ఆ గృహస్థు ఆ హంతకుణ్ణి రివాల్వరుతో పేల్చి చంపివేశాడు! ఇంటి హద్దు దాటాక ఆ అతిధి సంబంధం తెగి పోయింది! ... ఇప్పుడు - మీరుకూడా నా అతిధులుకారు! మన సంబంధం యీ హద్దుతో తెగిపోయింది! ... ఇవి మీ చివర గడియలు! చనిపోయేముందు భగవత్ప్రార్థన చేసే రివాజు ఉంటే... చేసుకొనండి-" అన్నాడు.

లీంగ్‌పో మతిభ్రష్టుడై పోయాడు! స్వరక్షణార్థంకోసం ప్రయత్నంకూడా చేసుకోలేకపోయాడు! లింబూ మాటవిని, భయావేశంతో తల అడ్డంగా తిప్పాడు!

"నా ఐదుగురు కొడుకులశరీరాలనుంచి బయటకు వచ్చినగుండ్లు మీ రైఫిలువే! నిన్ననే గమనించాను!... అంటేమీరు నా ఐదుగురు కొడుకుల్నీ చంపివేశారు! నిజానికి వాళ్ళుయుద్ధరంగంలో చనిపోలేదు. విశ్రాంతి సమయంలో మీరు దొంగచాటుగా వాళ్ళమీద మీ రైఫిలు ప్రయోగించారు!... అందువల్ల - నా ఒక్కొక్క కొడుకుపేరు మీదా...ఒక్కొక్కగుండు విడుస్తాను -" అంటూ లింబూ రివాల్వరు పేల్చాడు! 'ధన్... ధన్... ధన్ ... ధన్... ధన్' మంటూ ఐదుగుండ్లూ లీంగ్‌పో హృదయంలో దూసుకు పోయాయ్! లీంగ్‌పో గుర్రంమీదినుంచి క్రింద పడిపోయాడు!

లింబూ తిరస్కార స్వరంతో "పాషండులు!... నమ్మకద్రోహులు!!... 'చీనీ-హిందూ భాయీ - భాయీ' అంటూనే నా తల్లిని కొల్లగొట్టడానికి వచ్చిన పిశాచాలు!!!'' "అంటూ ఆ శవాన్ని రాళ్ళమీద నుంచి దిగువ పల్లంలోకి నెట్టివేశాడు. ★

# కమ్యూనిటీ రేడియో సెట్లు

## 1963 ఏప్రిల్‌లో నెలకొల్పబడిన గ్రామాలు

ఆంధ్రప్రదేశ్‌లోని ఈ క్రిందపేర్కొన్న గ్రామాలలో 1963 ఏప్రిల్‌లో కమ్యూనిటీ రేడియోసెట్టులను నెలకొల్పారు.

కుషాయ్‌గూడా, ధోబీపేట, కోట్మర్‌పల్లి (హైద్రాబాదుజిల్లా); చావళ్ళపూర్, రాఘవాపూర్, కస్తూర్‌పల్లి (మెదక్ జిల్లా); కాంతాపూర్, బ్రాహ్మణపల్లి, (అచ్చంపేట శివారు); కందుకుర్తి (నిజామాబాదు జిల్లా); రాంపల్లి, గుగ్గిళ్ళ, గంగారం, నారాయణపూర్, జూలపల్లి, మెరెడుపాక, జల్లారం, పెద్దతాడ్లు, ఎల్లబొత్తారం, విల్లాసాగర్, రామర, పొత్తారం, (జె) చింతకాని, గండిపల్లి, మల్లాపూర్- i. మల్లాపూర్- ii. (గోపాలరావుపల్లి సెట్టు). ఊటూరు, బూరుగుపల్లి, రాంపూర్, రామన్నపేట - బైనపల్లి శివారు - నేదునూరు, లాల్‌పల్లి, -ఎలెగేడు శివారు- షైద్‌పల్లి- గొడిశలపేట శివారు - (కరీంనగర్‌జిల్లా), ఆనెపూర్, ముప్పనపల్లి, పులికుర్తి, అజమానగర్ పర్లపల్లి, బచ్చనపేట (వరంగల్ జిల్లా) నాకర్లమూడి, అంగలూరు - ii. (కొత్తపేటపార్కు - ఎక్స్ఛేంజి) (కృష్ణాజిల్లా) ఇందుకూరుపేట.

i. సెట్టు. ii. లెబర్ - ii. సెట్టుiii. (నెల్లూరు జిల్లా), చిన్న రెప్పనపల్లి, అమ్మగారిపల్లి, కామరెడ్డివారిపల్లి, వల్లిగట్ల, చింతమాకులపల్లి పుడిపట్ల, నెల్లమడ, పాపెపల్లి, గోగిరెడ్డిపల్లి, (చిత్తూరు జిల్లా), విడిగల్లు, (అనంతపురం జిల్లా), చెర్లపల్లి, ఊటుకూరు, తిప్పయ్య పల్లి, వెలవలి, (కడప జిల్లా) గూబగూడెం, బొగోలు, నెలంపాడు, ఇటికాల, కొండాపురం, ముటుకుల, పెద్ద హుల్టి, జమ్ములదిన్నె (కర్నూలుజిల్లా)★

# ప్రశ్నలు - సమాధానాలు

*శ్రీ బొబ్బా రామచంద్రరావు, గాంధీనగరం, అమలాపురం తాలూకా. మహబూబ్ నగరం జిల్లా.*

ప్రశ్న : దయచేసి పాలసరఫరా పథకం వివరాలను తెలియజేయండి. మద్రాసులో కల్పిస్తున్నట్టి సౌకర్యాలనే ఇక్కడకూడా కల్పిస్తారా? రుణాలు ఇవ్వడానికి ఏదైనా బంధనవుందా? హైద్రాబాదులో పశువులను అట్టిపెట్టవచ్చా?

సమా : గ్రామానికి పాలుసరఫరా చేయవలసి వున్నట్లయితే ప్రాథమిక సహకార సంఘాలద్వారానే అది చేయవలసి వుంటుంది. వ్యక్తులను ప్రోత్సహించడం జరగదు. మదరాసు ప్రభుత్వం కలిగించే సౌకర్యాల ప్రస్తావన మాధవరం లోని షడ్డులలో పశువులను వుంచడానికి లైసెన్సులు జారీచేయడానికి సంబంధించి చేసినట్లయితే ఇలాంటి పథకానికి మావద్ద కూడా ప్లానులు వున్నాయన్నదే సమాధానం. ఇంకాదీనిని చేబట్టలేదు. సహకార సంఘాల సభ్యులకు పాడిపశువులు కొనుక్కునే నిమిత్తం స్వంత పూచీమీద ఒక్కొక్కరికి రూ. 500/-ల వరకు అప్పులు ఇస్తారు. నగరంలో పశువులు వుంచడాన్ని ప్రోత్సహించరు. గ్రామీణ ప్రాంతల్లో ఉత్పత్తిఅయ్యే పశుగ్రాసం అక్కడనే వినియోగమై ఆ భూములకు విలువైన ఎరువు లభించడానికి వీలుగా గ్రామ ప్రాంతాలలో పాడి పరిశ్రమను ప్రోత్సహించడమే ప్రభుత్వం లక్ష్యం.

*శ్రీ కంఠకం తానరెడ్డి, అగ్గయ్యగుండ్ల. నందనం, వరంగల్ జిల్లా.*

ప్ర : మా గ్రామానికి చుట్టుప్రక్కల గల భూములకు మద్రికుంట చెరువు ద్వారా నీరు లభింపజేయడానికి నందనం వాగుకు అడ్డంగా ఆనకట్ట నిర్మించే సంగతి నిజమేనా ?

సమా : మద్రికుంటకు నీరు లభింపజేయడానికై నందనంవాగు (ఆకేరు నది)కు అడ్డంగా ఆనకట్ట నిర్మించే ప్రతిపాదన పరిశీలనలోవుంది. ఈ పథకంవల్ల సుమారు 300 ఎకరాలకు నీటిపారుదల జరగ గలుగుతుంది. అంతేగాక మద్రికుంటక్రింది ఆయకట్టకు నిశ్చయంగా నీటి సరఫరా జరగగలుగుతుంది.

*శ్రీ ఏ. సోమేశ్వరరావు, పేముగొలను. కృష్ణా జిల్లా.*

ప్ర : నాగార్జునసాగర్ ఎడమ కాలువ విజయవాడ - ఖాజీపేట రైల్వే లైనును ఎక్కడ దాటుతుంది. ఆయకట్టు మ్యాపులు లభిస్తాయా ?

సమా : తాత్కాలిక ప్రతిపాదనల ననుసరించి నాగార్జునసాగర్ ఎడమ కాలువ ఖాజీపేట – విజయవాడ రైల్వేలైనును కామంచికల్లు రైలుస్టేషను సమీపంలో దాటుతుంది. కాలువ శాఖలో ఆయకట్టు పటాలను ఇంకా స్థిరీకరించలేదు. కాలువ రైలులైనుమ దాటే స్థలాన్ని ఇంకా నిర్ణయించలేదు.

*శ్రీ ఏ. రామన్ గౌడ్, దక్షిణ విజయపురి.*

ప్ర : మహబూబ్‌నగర్ జిల్లా, ఆత్మకూరు తాలూకాలో ఆర్. టి. సి. బస్సులు వేస్తారా ?

సమా : ఆత్మకూరు తాలూకాలో బస్సులు వేసే ప్రతిపాదనేదీ ప్రస్తుతానికి ఆర్. టి. సి. కి లేదు.

*శ్రీ జి. వి. రామారావు, కందుకూరు, హైదాబాదు జిల్లా.*

ప్ర : పహాడీషరీఫ్ మార్గంగా హైద్రాబాదు - కల్వకుర్తిలమధ్య నిర్మిస్తున్న రోడ్డుపని ఆరు సంవత్సరాలనుంచి జరుగుతున్నది. ఈ పని ఇంత కాలంగా ఎందుకు జరుగుతున్నది ?

సమా : ఈ రోడ్డు – పని 1956 జనవరి 18 వ తేదీన ఆరంభమైంది. 1958 జనవరి 17 వ తేదీనాటికి అంటే రెండు సంవత్సరాలలో రోడ్డు నిర్మాణం పూర్తి చేయడానికి మొదట తలపెట్టారు. కాని దిగువ పేర్కొన్న కారణాలవల్ల 1960 సెప్టెంబరు 30 వ తేదీవరకూ ఈ పని జరిగింది :- (1) ఈ పనిజరిగే ప్రదేశాలకు చుట్టుప్రక్కలగలగ్రామాలలో కలరా ఇన్‌ఫ్లూయింజావంటి అంటువ్యాధులు వ్యాపించినందువల్ల కంట్రాక్టర్లు చాలా కాలంపాటు పని నిలిపివేశారు. (2) పంటకోతలు జరిగేవరకూ భూములను స్వాధీన పరుచుకోవడానికి వీలుపడలేదు. (3) 1958, 1959 వర్షాకాలాలలో వానలు భారీగా కురిసినందువల్ల ఈ పనికి ముఖ్యంగా తాపీపనికి

అవరోధాలు కలిగాయి. (4) ఉక్కు, సిమ్మెంటుల సరఫరా తీవ్రమైన కొరత ఏర్పడినందువల్ల కుత్తూర్ వంతెనల వంటి భారీ తాపీపనులను సకాలంలో చేపట్టలేదు. దీని ఫలితంగా పని పూర్తి చేయడంలో ఆలస్యం జరిగింది. అయినప్పటికీ తాపీపనితో సహా ముఖ్యమైన పనిని 1960 సెప్టెంబరు 30 వ తేదీ నాటికి పూర్తిచేయడం జరిగింది. రోడ్డుప్రక్కల భద్రతకు రాళ్ళు పాతడం 3 అంగుళాల మందాన కంకర వేయడం వంటి కడపటి పనులు జరుగుతున్నాయి.

శ్రీ కె నాగభూషణం, చందూరు, నిజామాబాదు జిల్లా.

ప్ర : ఆంధ్ర ప్రదేశ్‌లో వడ్రంగంలో ఎక్కడ శిక్షణ యిస్తారు ? ఈ శిక్షణా సంస్థలలో చేరడానికి ఏమి అర్హతలు వుండాలి ? వాటిలో ఏమి సౌకర్యాలుంటాయి ?

సమా : హైద్రాబాదు నిజామాబాదు, నెల్లూరు, కాకినాడ, విశాఖపట్నం, విజయవాడ, ఏలూరు, తెనాలి, వరంగల్‌లలోని పారిశ్రామిక శిక్షణాసంస్థలలోనూ, హైద్రాబాదులోని అల్లాడ్డీన్ సాంకేతికశిక్షణ సంస్థలోనూ వడ్రంగంలో శిక్షణ ఇస్తారు

ఈ కోర్సులో ప్రవేశం పొందగోరే అభ్యర్థులు హెచ్.ఎస్.సి. లేదా ఎస్.ఎస్. ఎల్. సి. కి రెండు సంవత్సరాలు తక్కువైన తరగతి పరీక్షలో ఉత్తీర్ణులు కావల్సి వుంటుంది.

శిక్షణ సంస్థలో శిక్షణపొందే అభ్యర్థులలో 33⅓ వంతుల మంది అభ్యర్థులకు వారి ప్రతిభనూ, బీదతనాన్ని పురస్కరించుకొని నెలకు రూ. 25/- ల చొప్పున స్టయిపండులు మంజూరు చేస్తారు.

శ్రీ ఏ. నరసింహులు, బాదేపల్లి, మహబూబ్‌నగర్ జిల్లా.

ప్ర : నీటిసరఫరా పథకం పనిని మా పట్టణంలో ఎప్పుడు ఆరంభిస్తారు.

సమా : బాదేపల్లి నీటిసరఫరా పథకానికి సంబంధించిన ప్రాథమిక నివేదిక ప్రభుత్వ పరిశీలనలో వుంది.



# దేవదత్త మొత్తరా...

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

మేటి భారతీయుడా ! కి
రీటి వౌచు సాగరా
దేవదత్త మొత్తరా
నీవైరి మొత్త మొత్తరా.

ఉత్తరమున పగఅచూచి
హుంకరించి నడువరా
ఎత్తివచ్చు వారినిట్టె
ఉత్తరించరా.

గాండీవమె చాలునో
కావలెనో పాశుపతము
గండరించినట్టి యరుల
చెండి చెండి విడువరా

కండకలిగి నడువరా
కొండపిండి సేయరా
నీ కెదురటరా, అడ్డ
మాకలేక సాగరా.

మేటి భారతీయుడా ! కి
రీటివౌచు సాగరా
దేవదత్త మొత్తరా
వైరిమొత్త మొత్తరా.

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలుకా తాటిగుంటపల్లి గ్రామానికి 1963మార్చి నెలలో, నగరిమడుగు గ్రామానికి ఏప్రిల్ నెలలో విద్యుత్‌సౌకర్యాలు కలుగజేశారు.

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకా వెడ్లపట్ల గ్రామానికి 1963 ఏప్రిల్‌లో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు.

గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా కొండమూడి, అయ్యన్నపాలెం గ్రామాలకూ, విశాఖపట్నం జిల్లా చోడవరం తాలూకా భోగాపురంగ్రామానికీ, తూర్పుగోదావరి జిల్లా, అమలాపురం తాలూకా కేసనకుర్రు, కేసనకుర్రుపాలెం గ్రామాలకుకూడా ఏప్రిల్ నెలలోనే విద్యుత్ సౌకర్యాలను విస్తరింపజేశారు.



# నిర్బంధ డిపాజిటు పథకం

స్వచ్ఛంద పొదుపు పథకాలకు ఎక్కువగా పొదుపు పెట్టలేని తక్కువ ఆదాయం గలవారిని దృష్టిలో వుంచుకుని, అత్యయిక పరిస్థితిని ఎదుర్కొనుటకు, అటువంటివారు కూడా జాతీయ సాధన సంపత్తికి తమవంతు భాగాన్ని యివ్వడానికి వీలుగా, భారత ప్రభుత్వం నిర్బంధ డిపాజిటు పథకాన్ని దేశమంతటా ప్రవేశపెట్టింది. ఈ పథకం 1963 జూలై ఒకటినుండి ఆచరణలోకి వచ్చింది.

వివిధరకాల పొదుపు పథకాల క్రింద స్వచ్ఛందంగా పొదుపు చేసేవారిలో 90 శాతం మధ్య తరగతిలో పైవర్గానికి చెందినవారనీ, మిగిలినవారు బీదప్రజలనీ లెక్కలవల్ల తెలుస్తున్నది. ఈ బీదప్రజలు పొదుపుచేసిన ధనాన్ని వెనక్కు తీసుకుంటారు. ఈ వర్గానికి చెందినవారు కూడా పొదుపు చేయడానికి అవకాశాల్ని కల్పించేందుకై ముఖ్యంగా యీ పథకం ఉద్దేశించబడింది. అందుచేత ఈ నిర్బంధ డిపాజిటు పథకం స్వచ్ఛందంగా పొదుపు చేయబడే ధనానికి గొడ్డలిపెట్టు పెడుతుందని భయపడవలసిన అవసరం లేదు.

ఆ రకపు వర్గంవారు చేసే ఖర్చులో కొంత భాగాన్ని యీ నిర్బంధ డిపాజిటు పథకం రూపుమాపుతుంది. అందువల్ల యీ పథకాన్ని ద్రవ్యోల్బణ నిరోధి అనవచ్చు. అలాంటివారికి మొదట్లో యిది కొంత బాధాకరమే అయినప్పటికీ, అయిదేళ్ళ అనంతరం 4 శాతం వడ్డీతో సహా యీ డబ్బు తిరిగి రావడంవలన, కాలక్రమేణా అది వారికే ఉపయోగకారి అవుతుంది. ఈ పథకంక్రింద దాచుకున్న డబ్బును కోర్టులు గాని, మరేవిగాని స్వాధీనపరుచుకోవు. ఇది ప్రభుత్వం వద్ద నిర్భయంగా ధనాన్ని దాచుకోవడమే.

ఈ పథకంక్రింద ఆదాయాలనుబట్టి నిర్ణీత రేటు ప్రకారం ఆయా వర్గాలవారు ఒక పరిమిత ఆదాయంవరకూ దిగువ విధంగా పొదుపు చేయవలసివుంటుంది :—

1. జీతం తెచ్చుకునే ఉద్యోగులు :

జీతం తెచ్చుకునే ప్రభుత్వోద్యోగులు, ప్రైవేటు ఉద్యోగులందరూ, వారి ఆదాయం సంవత్సరానికి రూ. 1,500/-లకు మించివుండి, ఆదాయపు పన్ను చెల్లించ నవసరం లేనట్లయితే తమ జీతంలో 3 శాతం మొత్తాన్ని డిపాజిటు చేయాల్సి వుంటుంది.

2. అదాయపు పన్ను చెల్లించేవారు :

ఆదాయపు పన్ను చెల్లించిన తరువాత మిగిలిన ఆదాయం సంవత్సరానికి రూ. 6,000 లకు మించనివారు, ఆ విధంగా మిగిలిన ఆదాయంలోనుంచి 3 శాతం మొత్తాన్ని డిపాజిటు చేయాలి. ఈ డిపాజిటును వారు కొత్తగా చెల్లించవలసిన అదనపు సర్‌చార్జిలోనుంచి మినహాయిస్తారు.

ఆదాయపు పన్ను చెల్లించిన తరువాత మిగిలిన ఆదాయం సంవత్సరానికి రూ. 6,000 లకు మించినవారు, మిగిలిన ఆదాయంలో 2 శాతం మొత్తాన్ని డిపాజిటు చేయాలి. దీనినికూడా కొత్త అదనపు సర్‌చార్జి నుంచి మినహాయిస్తారు.

3. వృత్తి పనులవారు :

వివిధ వృత్తి పనులు చేసుకునేవారు కూడా జీతాలు తెచ్చుకునే ఉద్యోగులవలెనే అదేరేటులో డిపాజిటు చేయవలసివుంటుంది.

4. వ్యవసాయదార్లు :

వ్యవసాయదార్లు తమ భూములకు 1959-60 వ సంవత్సరానికి చెల్లించిన ప్రాతిపదిక భూమిశిస్తులో 50 శాతం మొత్తాన్ని డిపాజిటు చేయాలి.

5. పట్టణ ప్రాంతాలలో ఆస్తులున్నవారు :

పట్టణ ప్రాంతాలలో ఆస్తులు గలవారు తమ ఆస్తుల వార్షిక అద్దె విలువలో 3 శాతం మొత్తాన్ని డిపాజిటు చేయాల్సివుంటుంది.

మినహాయింపులు :

ఈ పథకం వర్తించే ఎవ్వరైనా వ్యక్తి, తన వార్షికాదాయంలో మొత్తంమీద 11 శాతానికి తగ్గని మొత్తాన్ని, (అ) స్వంతానికి లేదా తన భార్య/భర్త కొరకు జీవిత భీమా పాలసీ తీసుకోవడానికి చెల్లించినా లేక (ఆ) పరిగణించబడిన ఏదైనా ప్రావిడెంట్ ఫండుకు కంట్రిబ్యూషన్‌గా చెల్లించినా లేదా (ఇ) పది లేక పదిహేను సంవత్సరాల కుమ్యులేటివ్ టైమ్ డిపాజిటు పథకానికి డిపాజిటు చేయడానికి చెల్లించినా అలాంటి వ్యక్తి ఆ కాలం వరకు మరెలాంటి డిపాజిటు చేయనవసరం

లేదు. వారు 1963_64 వ సంవత్సరానికి ఆ సంవత్సరంలోపై పెట్టుబడులలో దేనికైనా తాము డబ్బు చెల్లించగలమనిమ యతజమానులకు వ్రాసి ఇవ్వవలసివుంటుంది.

జీతాలు తెచ్చుకునే ఉద్యోగులకు వర్తించే పథకం 1963 జూలై మొదటి తేదీ నుంచి అమల్లోకి వస్తుంది. ఇతర వర్గాల వారికి వర్తించే పథకాలు బహుశా 1963 సెప్టెంబరు మొదటి తేదీ నుంచి అమల్లోకి వస్తాయి. జీతాలు పొందే ఉద్యోగులు దాదాపు 30 లక్షల మందికి నిర్బంధ డిపాజిటు పథకం వర్తిస్తుందని అంచనా. ఆదాయపు పన్ను చెల్లించేవారికీ, రూ. 1,500/_లు అంతకు మించిన వార్షికాదాయం గల ఉద్యోగుల (ఆదాయపు పన్ను లేనివారల)కూ వర్తించే పథకాలను గూర్చిన వివరాలు :

ఈ రెండు పథకాల క్రింద, అన్ని హెడ్ పోష్టాఫీసులలోనూ, డిపార్ట్ మెంటల్ సబ్ పోస్టాఫీసులలోనూ రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా కార్యాలయా లన్నింటిలోనూ, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖలలోనూ_ ఇందునిమిత్తమై ప్రత్యేకంగా మినహాయించబడినవి తప్ప _ దాని సబ్సిడరీ బ్యాంకుల లోనూ డిపాజట్లు స్వీకరిస్తారు. డిపాజిటు చేసేవారందరికీ విడివిడిగా ప్యాస్ బుక్‌లు ఇస్తారు. డిపాజిటు మొత్తాన్ని సంవత్సరానికి 4 శాతం చొప్పున సామాన్య వడ్డీతో డిపాజిటు చేసిన సంవత్సరం నుండి అయిదు సంవత్సరాలు గడిచిన తరువాత తిరిగి చెల్లిస్తారు. వడ్డీపై ఆదాయపు పన్ను వుండదు. ఈ పథకం క్రింద డిపాజిటరు తన "నామినీ"ని ప్రకటించవలసివుంటుంది. ఈ విధంగా పేర్కొనబడే ''నామినీ''కి, డిపాజిటరు సక్సెషన్ సర్టిఫికెట్లు లేదా చట్టరీత్యా హక్కుదార్లయినవారిని పేర్కొనే పత్రాలను దాఖలు చేయకుండా మరణించిన పక్షంలో డిపాజిటు సొమ్ము చెల్లించబడుతుంది. ఈ రెండు పథకాల ఇతర ముఖ్యాంశాలు ఇవి :_

ఆదాయపు పన్ను చెల్లించే వారికి వర్తించే పథకం :

ఆదాయపు పన్ను చెల్లించే ఉద్యోగుల నెల జీతాల నుంచి వారి యజమానులు నిర్బంధ డిపాజిట్లకై డబ్బు మినహాయించుకోవడానికి యజమానులకు ఈ పథకంక్రింద ఎట్టి అవకాశం వుండదు. ఈ పథకంక్రింద డబ్బు డిపాజిటు చేసే బాధ్యత జీతాలు పొందేవారిమీదనే వుంటుంది. వీరు తమ ఇష్టం వచ్చిన డిపాజిటు కార్యాలయంలో ఆర్థిక సంవత్సరంలో ఎప్పుడైనా డబ్బు డిపాజిటు చేయవచ్చు. అయితే నెలకు ఒకసారికన్న ఎక్కువ పర్యాయాలు డిపాజిటు చేయడానికి వీలుండదు. డిపాజిటు కార్యాలయాలు డిపాజిటు చేసినప్పుడల్లా విడిగా రశీదులు ఇస్తూ ప్యాస్ బుక్‌లో ఆ విషయం ఉదహరిస్తాయి. డిపాజిటర్లు తాము డబ్బు చెల్లించి పొందిన రశీదులను, అదనపు సర్ చార్జి విధింపునుంచి మినహాయింపు పొందేందుకై, నిర్బంధ డిపాజిటు వేసినట్లు దాఖలాగా ఆదాయపుపన్నుశాఖకు అందజేయాలి.

ఆదాయపుపన్ను చెల్లించవలసివచ్చే ప్రభుత్వోద్యోగులు లేదా పబ్లిక్ రంగంలోని ఉద్యోగులకు సంబంధించినంతవరకు వారి జీతాలనుంచి డబ్బు మినహాయింపు చేయడం జరగదు. నిర్బంధ డిపాజిటుకు సంబంధించిన అంశాలు ఏవిధంగాకూడా ఆయా ఉద్యోగుల పే బిల్లులో చేర్చబడవు.

ఉద్యోగులకు వర్తించే పథకం :

ఈ పథకం (అ) రాష్ట్ర కేంద్ర ప్రభుత్వోద్యోగులకూ, (ఆ) స్థానిక సంస్థల ఉద్యోగులకూ, (ఇ) విదేశ కంపెనీలు, ప్రభుత్వ కంపెనీలతో సహా అన్ని కంపెనీల ఉద్యోగులకూ, (ఈ) సహకార సంఘాలతో సహా కార్పొరేషన్ల ఉద్యోగులకూ, (ఉ) ఆదాయపు పన్ను చెల్లించవలసివుండి, తమ ఆదాయాన్ని లెక్కకట్టేందుకు తమ ఉద్యోగులకు చెల్లించే జీతాలను మినహాయించడానికి అర్హతగల వ్యక్తులు లేదా కొందరు వ్యక్తుల వద్ద పనిచేసే ఉద్యోగులకూ వర్తిస్తుంది. ఇటువంటి ఉద్యోగుల వార్షికాదాయం _ జీతంద్వారా _ రూ. 1,500 లు లేదా అంతకు మించి వుండి ఆదాయపుపన్ను చెల్లించనవసరం లేకుండావుండాలి.

వీరి విషయంలో జీతాలు చెల్లించే సమయంలో ఉద్యోగుల జీతాలలో నుంచి నిర్బంధ డిపాజిటు మొత్తాలను, యజమానులు మినహాయించడాన్ని ఈ పథకం నిర్దేశిస్తున్నది.



# పరిసముత్యాలు

## గంగావతరణము

అసమలోచను మౌళియందున్న గంగ
వసుధ కెవ్విధమున వచ్చెనంచేనిఁ
గపిలుని కోపాగ్నిఁ గాలిన నగర -
నృపసమూహంబున కపవర్గపదవి
గావింప నా వియద్గంగఁ బృధివికిఁ
దేవలె ననుచుఁ దద్దేవిగుఱించి
వారి మనుమఁడు భగీరథుం డనఁగ
ధీరత నతివీరఘోరతపంబు
నాకాంక్షమై ద్రికోట్యబ్దముల్ సలుప
నాకాశగంగ ప్రత్యక్షమై నిలిచి,
మెచ్చితి, నీ కోర్కి నిచ్చెద, నిలకు
వచ్చెద, నాదు ప్రవాహంబు రాక
కోర్వదు భువి, గాన శర్వు భజింపు,
సర్వలోకాధీశు జడల వసించి
యరుగుదెంతు ననుడు నా భగీరథుఁడు
హరునిఁ బ్రసన్నుఁగానట్లు మెప్పింపఁ
గామారియును జటాగ్రం బట్టు సాప
నా మహాగంగ గృతార్థతానియతి
నసమ తదీయ జటాగ్రభాగమున
వసియించి తజ్జటాభసిత మధ్యమున
నింకుడు నతఁడు మహిష్ఠ సద్భక్తి
శంకరు మఱియుఁ బ్రసన్నుగాఁ బడయ
'నంగుష్ఠ తర్జనీభ్యాం నభస్మా' య-
నంగ నీశుఁడు జటాసంగతభూతిఁ
జిటికెనవ్రేల నంగుటము గోరంత
యటు గొంత సంధించి యవనిపై
విద్రువ
ధర 'నఖాగ్రాదపత' త్తనఁ బృధివిఁ
బరగె నఖాగ్ర సంభవలీల గంగ,
దుది 'భస్మవర్ణం తతో జలం' బనఁగ
నదియును భస్మవర్ణాంకమై యిట్లు
క్షితి హితార్థమును భాగీరథి గంగ
యతుల నదీప్రవాహస్వరూపమునఁ
బఱపెఁ దత్సగరులపై భగీరథుడు
నఱలేక తమ వంశమట్లుద్ధరించె
నిదియు శైవపురాణ విదిత ప్రయుక్తి;
యదిగాక మూలాగమాదులలోనఁ
జారుతరం బగు స్వచ్ఛందలీల

## గంగోత్పత్తి

భైరవాగమమునఁ బార్వతీ సతికి
వరుఁడు భూమండలవర్ణన లేక
సురగిరి వర్ణించుచును దన్నగంబు
నాల్గుదిక్కుల గంగ నరలోకమునకు
నాల్గుభాగంబులై నలఁదిగె ననెడు
హరునకు గిరిజ గరాబ్జముల్ మొగిచి
'సరిగఁ దాయస్య ప్రసాదేవ' యనఁగ
మహి 'సురసిద్ధ నమస్కృతా' యనగ
మహి సురసిద్ధ నమస్కృత గంగ
యాది నెట్లుదయించె నాదటతోఁ బ్ర-
సాదింపనే దేవసత్తమ! యదియు
సురగిరి కేమి ప్రస్తుతమున వచ్చెఁ
గర మెట్లు నరలోకగామిని యయ్యె'
ననుడు 'గంగాయాస్తు' అన
'సముత్పత్తి'
మనఁ 'గథయిష్యామి' యన
'సువ్యతే' య -
నను బార్వతీశుఁ డన్నాతి వీక్షించి
వినుము గంగోత్పత్తి వివరింతుఁ
బ్రియుఁడ
నయి 'జగన్మాతా మహాదేవి' యన వి-
నయ మొంద మును జగన్మాతవై
వెలుఁగు
నీవు దొల్లియుఁ దన దేవిఐ యిట్లు
గావున లోలావికస్వరబుద్ధి
నొక్కనాఁ డేమెర్గకుండంగ వెన్క -
దిక్కున నీవు నేతెంచి మేలంబు
దళుకొత్త నాదు నేత్రంబులు మూయ
జలజాక్షి! ఫాల విశాలలోచనము
విచ్చితి నాకన్ను విచ్చిన నంతఁ
జిచ్చు హేమాచల శృంగంబు దాఁక,
నతిభీతి నీవు నా యంఘ్రుల కెఱఁగి
కత మేమి దేవ! యీ కన్ను విచ్చుటకు
నావుడు సస్మితాననరుచు లెసగ
'దేవి! నాకన్నులు దినకరశశులు,

నీవుగప్పుటయును నిఖిలలోకముల
కావృతంబుగఁబర్వె నంధకారంబు,
నీకరంబులు ద్రోవనేరక యేను
లోకత్రయంబును లో వెలుఁగింపఁ
దెలిచితిఁ, దెలిచిన దీని కేమియును
వెలవంగవల దరవిందనిభాస్య ;
నీమూసినపుడు నా నేత్రంబులందు
భామిని! యానందబాష్పముల్ గ్రమ్మ
విడుచుడు నీ పదివ్రేళ్ళను దుదలఁ
దొడిఁదొడిఁ బుడమిపై దొఱఁగె
బిందువులు,

వది ప్రవాహంబులై పాఱ నందొక్క-
నది మముఁ బ్రార్థించి నారాయణుండు
గొనిపోయె నందు వైకుంఠలోకమున
జనుల నెల్లను గృతస్నానులఁ జేయ;
బ్రహ్మ యం దొకనది భక్తి న న్వేఁడి
బ్రహ్మలోకమున కేర్పడ గొనిపోయె;
నాకలోకమునకు నన్నుఁ బ్రార్థించి
నాకేశుఁ డందొక్కనదిఁ గొనిపోయె,
నదియును శశిమండ లావృత యగుచుఁ
జదలేఱు నా నొప్పె స్వర్గంబు పొంత;
నున్న యన్నదు లేడు నుప్పొంగి నిండి
సన్నుత గంగాప్రశస్తనామమున
ముల్లోకముల వెల్లి ముంచు నావేళఁ
దల్లడపడి బ్రహ్మ దామోదరేంద్ర —
సకల సురాసుర సంఘ మేతెంచి
చకితాత్ములై చక్కఁ జాఁగిలి మ్రొక్కి

'యభయ మభయమయ్య
యంబికానాథ !
యభయ మభయమయ్య
యఖిలాండనాథ !
శరణయ్య శరణయ్య శమితసురార్తి!
శరణయ్య శరణయ్య శాశ్వతమూర్తి !
రక్షింపు రక్షింపు రజతాద్రివాస!
రక్షింపు రక్షింపు ప్రమథవిలాస!
యద్ధత గంగా మహోర్మ్ములఁ బాపి
యుద్ధరింపుము మమ్ము నుక్షేంద్ర
వాహా!'

యంచు నన్ బ్రార్థింప నలరి తద్గంగ
మంచుబిందువుఁబోలె మౌళిఁ
దాఁదాల్ప
నంత న య్యజహరీంద్రాది గీర్వాణు
లంతంత ధరణి సాష్టాంగులై మఱియు
'గరళాగ్ని మూఁడులోకంబులఁ గాల్ప
ధరియించి కాచితి దండ్రి! యానాఁడు,
మూఁడులోకంబుల ముంచిన గంగ
నేఁడు దాలిచి మమ్ము నెఱయఁగాచితివి
గంగాప్రవాహోదకవిలోకనమున
మంగళం బయ్యె నమర్త్యలోకంబు
గావున మర్త్యలోకంబును నిట్ల
పావనంబుగఁ జేయఁబనుపవే శీఘ్ర-
గతి' ననవుడు మహాగంగాప్రవాహ—
పతనవేగంబునఁ బగులు ధరిత్రి
యనుచు మదీయ జటాగ్రకేశంబు—
కొనఁజాఁగి సౌవర్ణకుధరంబుమీఁదఁ

బడి నలుదిక్కులఁ బాఱంగఁ జేయ
వడి భువనములం బావనము సేయుచును
నదియు సీతాహ్వయ మనఁగఁ
బూర్వమున
వదలక చని పూర్వవారాశిఁ గలసె ;
దక్షిణంబునను సువక్షు నాఁ బరగి
యక్షీణగతి దక్షిణాంబుధిఁ గలిసె ;
నలిఁ బశ్చిమమున సునంద నాఁ బరగి
యలరుచుఁ దత్పశ్చిమాంబుధిఁ గలిసెఁ ;
బొనరుచు నుత్తంబున రుద్రసోమ
యనఁ గూడె నయ్యుత్తరాంబుధి'
ననుచు

నున్నత గంగాసముత్పత్తివిధము
మున్ను లోకము లెల్ల ముంచినవిధము
వెఱచి విష్ణ్వాదులు మొఱవెట్టువిధము
మఱి దేవుఁ డాగంగ మౌళి ధరించి
విష్ణువిరించుల. వివిధలోకముల
జిష్ణుముఖ్యులను రక్షించినవిధము
[సురుప్రార్థనఁ జేసి జూటంబు గంగ
ధరణికి బిందుమాత్రమునను హేమ
నగముపైఁ బడియది నాల్గుదిక్కులను
దిగివేఱువేఱ ఘటిల్లు నామముల
నాల్గుదిక్కులఁ బుణ్యనదులుగా నొప్పి
నాల్గువారిధులకు నడచినవిధముఁ
బోవుచు నా గంగ భువిని మర్త్యులను
బావనంబుగఁ జేయఁ బాల్పడ్డ విధము
దేవుఁ డానతియిచ్చె దేవికి నిట్లు]
గావున నదియ గంగాసముత్పత్తి.

*[పాల్కురికి సోమనాథుడు — పండితారాధ్య చరిత్ర]*



# పోచంపాడు

గత కొన్ని సంవత్సరాలనుంచీ పోచంపాడు వార్తలలో ఎక్కువగా కనిపిస్తున్నది. పోచంపాడు నిజామాబాదు జిల్లాలో ఒక చిన్న గ్రామం. ఈ గ్రామం ప్రక్కగా గోదావరినది ప్రవహిస్తుంది. మన రాష్ట్రంలో గోదావరినది 40 వ మైలువద్ద ఈ గ్రామాన్ని కలుస్తుంది. సేద్యపు ప్రయోజనాలనిమిత్తం ఈ స్థలంలో మళ్ళింపు బ్యారేజ్ నొకదాన్ని నిర్మించడానికి సుమారు మూడు దశాబ్దాల క్రితం ఒక పథకాన్ని రూపొందించారు. దీనిని 1956 వ సంవత్సరంలో మార్పుచేశారు. మహారాష్ట్ర, మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల మధ్య నదీజలాల వివాదం ఏర్పడిన ఫలితంగా ఈ పథకం విషయంలో సందిగ్ధపరిస్థితి ఏర్పడింది. భారత ప్రభుత్వం 1962 వ సంవత్సరంలో నియమించిన గుల్హాటీకమిషన్ అనేకృష్ణా-గోదావరి కమిషన్ పోచంపాడు వద్ద విద్యుదుత్పాదనకు అవకాశం చాలా తక్కువ వుంటుందనీ, నది నీటిపరిస్థితి దృష్ట్యా స్టోరేజి మీద ఆధారపడనిదే పోచంపాడునుంచి నీటి పారుదలకు కాలువ తీయడం సాధ్యపడదనీ అభిప్రాయపడింది.

తరువాత భారతప్రభుత్వం 33-3-63 తేదీన ఈ ప్రాజెక్టుకు ఆమోదం తెలియజేసింది. అయితే 66 టి. ఎం. సి. ని వినియోగించుకోవడానికై దీనిని స్టోరేజి ప్రాజెక్టుగా మార్చలనీ, అవసరమైన స్టోరేజిని పెంచడానికి అవకాశం కల్పించాలనీ భారతప్రభుత్వం షరతు పెట్టింది. నెలరోజులలోగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భారతప్రభుత్వం ఆమోదం నిమిత్తం సవరించిన పథకాన్ని (మళ్ళింపు బ్యారేజ్ కి బదులు స్టోరేజ్ రిజర్వాయరు) పంపించింది. ఈలోగా పనులు ప్రారంభించారు. ప్రాజెక్టుకు త్వరలో శంకుస్థాపన చేయడానికి ప్రధానమంత్రి అంగీకరించినట్లు తెలుస్తున్నది. నాగార్జునసాగర్ తో పోల్చినప్పుడు ఇది అంత పెద్ద ప్రాజెక్టుకాదు. 5.7 లక్షల ఎకరాలకు ఇది నీటిపారుదల చేస్తుంది. ఈ ప్రాజెక్టు నిజామాబాదు జిల్లాలో వున్నప్పటికీ ఆ జిల్లాలో సుమారు 2,50,000 ఎకరాలు మాత్రమే దీని క్రింద సాగవుతాయి. ఇది నీటి పారుదల చేయగల మిగతా విస్తీర్ణమంతా కరీంనగర్ జిల్లాలో వుంది. అంటే ఈ ప్రాజెక్టువల్ల కరీంనగర్ జిల్లాకు బాగా ప్రయోజనం చేకూరుతుందన్నమాట. దక్షిణ కాలువ ద్వారా నీటిపారుదల చేస్తారు. ఇది 70 మైళ్ల పొడవున వుంటుంది. ఈ ప్రాజెక్టు యొక్క ప్రతిపాదిత ఆయకట్టులో మూడింట ఒక వంతు తరి భూములు, రెండు వంతులు ఖుష్కీ భూములు వుంటాయి. పోచంపాడువద్ద గోదావరి రెండు పాయలుగా చీలి ప్రవహించడంవల్ల మధ్యన ఒక ద్వీపం ఏర్పడింది. ఇది ఇంజనీర్లకు ప్రయోజనకరంగా వుంది. ఎడమ వైపున కాఫర్ డామ్ నిర్మించి ప్రవాహాన్ని నిలిపివేశారు. 2,100 అడుగులకు పైగా పనిని ప్రారంభించారు. కాగా దీనిలో 900 అడుగుల పొడవులో తాపీపని 5 అడుగుల ఎత్తువరకు అప్పుడే పూర్తయింది. డాములో 2,550 అడుగుల పొడవున తాపీపని జరుగుతూంది. దీనికి ఇరు వైపులా 41,300 అడుగుల పొడవున మట్టికట్టలు వుంటాయి. "స్పిల్ వే"కి 50 అ × 35 అం.ల సైజుగల 32 రేడియల్ గేట్లు వుంటాయి. రిజర్వాయరు 170 చదరపు మైళ్ళ వైశాల్యంతో నాగార్జున సాగర్ వద్దకంటే కూడా పెద్ద సరస్సుగా రూపొందుతుంది.

ఈ ప్రాజెక్టుకు రూ. 39.85 కోట్లు ఖర్చవుతాయి. దీనిలో హెడ్ వర్క్సుకు రు. 19.10 కోట్లు, కాలువకు రు. 20.75 కోట్లు వ్యయ మవుతాయి. ఇప్పటివరకు దాదాపు రూ. 72.58 లక్షల వ్యయం జరిగింది. డిశంబరు – జూన్ లో ప్రాజెక్టు పని జరుగుతుంది. పని వాళ్ళలో చాలా మంది మహబూబ్ నగర్ జిల్లా వారే. ప్రస్తుతం దాదాపు 1500 మంది పని చేస్తున్నారు.

ఈ ప్రాంతంలో ఒక చిన్న కాలనీ ఏర్పడింది. అన్ని స్థాయిల ఉద్యోగులకు, పనివారలకు ప్రాజెక్టుస్థలంలో వసతి సౌకర్యాలు కల్పించారు. పనివారలకు సాముదాయిక స్నానాల గదులను ఏర్పాటు చేశారు. ఇక్కడ ఒక ప్రాథమిక పాఠశాల కూడా వుంది. అందమైన ఒక విశ్రాంతి గృహాన్ని కూడా నిర్మించారు.

ఈ ప్రాజెక్టుస్థలాన్ని సందర్శించినట్లయితే, ఇది కాగితం ప్రణాళిక మాత్రమే నన్న అభిప్రాయం పూర్తిగా తొలిగిపోతుంది. కేంద్రం సాంకేతికంగా ఆమోదం తెలిపిన తక్షణమే శరవేగంగా పనులు సాగించడానికి సన్నాహాలు చేశారు.

పని పతాకస్థాయినందుకునేప్పటికి ఇక్కడ 40,000 మంది పనివారలు పని చేయాల్సి వుంటుంది. వారు అలా పని చేసినప్పుడు లక్ష్యానుసారం ఆరు సంవత్సరాల కాలంలో ప్రాజెక్టు పూర్తి కాగలుగుతుంది. ప్రాజెక్టువద్ద పనిచేస్తున్న ప్రజలు ఆశాభావంతో ఎంతో ఉత్సాహంగా వున్నారు. ఏమీలేని చోట ఏదో ఒకదానిని సమకూర్చడంలో ఒకవిధమైన సంతృప్తి వుంటుంది. పోచంపాడు ప్రాజెక్టువద్ద పనిచేస్తున్న ఇంజనీర్లు ఇలాంటి ఆనందాన్నే పొందుతున్నారు. నిజానికి తెలంగాణాకు పోచంపాడు ప్రాజెక్టు ఆశాజ్యోతి. ★

## ప్రగతి పథంలో

### అనంతపురం జిల్లా

***11 నెలల శిక్షణ పథకం :***

ముదిగుబ్బ పంచాయతీ సమితికి చెందిన వెదురుపేము కేంద్రాలనుండి పది మంది శిక్షితులూ, వడ్రంగి కేంద్రంనుండి పదిమంది శిక్షితులూ తమ 11 నెలల శిక్షణకాలాన్ని మార్చి 23 నాటికి పూర్తి చేశారు. శిక్షణ పొందిన వారందరికీ ఆధునిక పనిముట్లను సబ్సిడీ ధరలకు అందజేశారు.

గ్రామీణ స్వఛంద సేవక దళాలకు చెందిన శిక్షణ కేంద్రాలను ప్రతి గ్రామ సేవకుని పరిధిలో మూడు రోజులపాటు జరిపించారు. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరూ, విస్తరణాధికారులు శిక్షితులను ఉద్దేశించి ప్రసంగించారు.

***గ్రామీణ వైద్యశాల:***

రోళ్ల పంచాయితీ సమితికి చెందిన మందలహళ్లి గ్రామంలో సుమారు రూ. 4000ల ఖర్చుతో నిర్మించిన గ్రామీణ వైద్యశాల మే నెలనాటికి పూర్తయ్యింది. గ్రామీణ స్వచ్ఛంద సేవకదళాలు, రక్షణ శ్రామిక బ్యాంకులు భవననిర్మాణంలో సహాయ సహకారాల్ని అందజేశాయి.

***గ్రామీణుల విరాళాలు :***

పెనుగొండ పంచాయతీ సమితికి చెందిన సోమందిపల్లి గ్రామంలో పేద విద్యార్థుల వసతిగృహం ప్రారంభించబడింది. వసతిగృహ నిర్మాణం, దాని నిర్వహణ భారాల్ని ముఖ్యంగా గ్రామస్థులే తమ విరాళాలతో భరిస్తున్నారు.

***అభివృద్ధి కార్యక్రమాలు :***

గుట్టూరు గ్రామంలో 'కురుక్షేత్రం' నాటకాన్ని వేసి 500 రూ. లను వసూలు చేశారు. ఈ డబ్బును గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగిస్తారు.

### చిత్తూరు జిల్లా

మదనపల్లి పంచాయతీసమితి కార్యాలయంలో మే 19 నుండి వారంరోజుల పాటు దళపతులకు, గ్రామ పంచాయతీ అధ్యక్షులకు పునశ్చరణ శిక్షణకేంద్రం నిర్వహించబడింది.

### కడప జిల్లా

***నూతన ప్రాథమిక ఆరోగ్య కేంద్రం :***

కడపజిల్లాకు చెందిన కాజీపేట గ్రామ పంచాయతీసమితిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని జిల్లాకలెక్టరు మేనెల మూడో వారంలో ప్రారంభించారు.

### తూర్పుగోదావరి జిల్లా

***సంగీత నాటకపోటీ :***

మే 11, 12 తారీఖులలో కరప గ్రామంలో మండలస్థాయిని సంగీత నాటకపోటీ జరిగింది. ఈ పోటీలో ఏలూరులోని పురపాలక హయ్యర్ సెకండరీ స్కూలు; కరప, రాజాంలలోని జిల్లా పరిషదున్నత పాఠశాలలు; శ్రీకాకుళంలోని ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల పాల్గొన్నాయి.

***ఉత్తమ పంచాయతీలు :***

రంగంపేట, రాయవరం పంచాయతీలు తూర్పు గోదావరి జిల్లాలోకెల్ల ఉత్తమమైన పంచాయతీలని జిల్లాస్థాయీ నిర్ణాయకసంఘం నిర్ణయించింది.

### గుంటూరు జిల్లా

***పనిముట్ల పంపకం :***

మే నెలలో ఐపూరు పంచాయతీ సమితిలో పన్నెండు ఆధునిక వ్యవసాయ పనిముట్లను పంచిపెట్టారు. దీనికితోడు ముప్ఫయిమంది సభ్యులతో రెండు మహిళా మండలులనుకూడా నిర్వహిస్తున్నారు.

### కరీంనగర్ జిల్లా

***గవర్నరు పర్యటన :***

జూన్ 10వ తారీఖున ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఈ జిల్లా పర్యటనలో ఖాదీ కార్యాలయాన్ని సందర్శించారు. ఉత్పత్తిలో యీ కార్యాలయం భారతదేశంలోనే రెండవస్థానాన్ని ఆక్రమిస్తోంది.

### ఖమ్మం జిల్లా

***యువజన మండలి ప్రారంభోత్సవం :***

పాలేరుపంచాయతీ సమితి నాయకులగూడెం యువజన మండలి అధ్వర్యంలో యువజనమండలి ఒకటి స్థాపించబడింది. జూన్ 7వ తారీఖున బ్లాకు డెవలప్‌మెంటు అధికారి యీ మండలికి ప్రారంభోత్సవం చేశారు.

### మహబూబ్‌నగర్ జిల్లా

***ప్రాథమిక ఆరోగ్య కేంద్రం :***

వనపర్తి బ్లాకులోని పెబ్బైరు గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి మే 23వ తారీఖున ప్రణాళికా పంచాయతీ రాజ్య శాఖలమంత్రి శంకుస్థాపన చేశారు.

***ప్రజల విరాళాలు :***

మే 10వ తారీఖున షాద్‌నగర్ తాలూకా తొమ్మిదిరేకుల పంచాయతీ

సమితి బ్లాకులో పంచాయతీఘర్ ఒకటి ప్రారంభించబడింది. భవన నిర్మాణానికి కావలసిన డబ్బును ప్రజలు విరాళాల రూపంలో వసూలు చేశారు. వసూల యిన మొత్తండబ్బు 1,946 రూపాయలు.

## మెదక్ జిల్లా

***మేలురకపు విత్తనాల పంపకం :***

63 మార్చినాటికి ఆఖరయ్యే త్రైమాసిక కాలానికి రామాయంపేట పంచాయతీ సమితిలో 4,350 మణుగుల మేలు రకపు విత్తనాల పంపకం జరిగింది. మొత్తం జిల్లాలో పంచిన మేలురకపు విత్తనాలు 6,463 మణుగులు.

***రైతులకు సహాయం :***

మే 30వ తారీఖున జిల్లా కలెక్టరు అధ్యక్షతన జిల్లాపరిషత్ స్థాయీ సంఘం-3 సమావేశమై మొత్తం రూ. 48,000 ఖరీదుచేసే 12 ఆయిలు యింజనులను, 22 ఎలక్ట్రిక్ పంపు సెట్లను జిల్లాలో అవసరమయిన రైతులకు పంచే అధికారాన్ని జిల్లా వ్యవసాయోద్యోగికి ఇచ్చింది.

***పశువైద్యశాల :***

ఒక్కొక్కటి రూ. 4000 లు విలువ చేసే తొమ్మిది పశువైద్యశాలల్ని నిర్మించడానికి జిల్లా పరిషత్తు నిధులనుండి డబ్బును యిప్పించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరడానికై పై కమిటీ తీర్మానించింది. ఈ నిర్మాణానికయ్యే ఖర్చులో సగభాగం ప్రజలే భరించవలసి వుంటుంది.

***గ్రామసహాయకుల శిక్షణ శిబిరం :***

షాద్‌నగర్ పంచాయతీ సమితికి చెందిన సంగమ్ గ్రామంలో మే 27నుండి మూడు రోజులపాటు వ్యావసాయిక విషయాల పై గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నడపబడింది. బ్లాకులోని విస్తరణాధికారులందరూ యీ శిక్షణలో పాల్గొన్నారు.

## నల్గొండ జిల్లా

మునుగోడి పంచాయతీ సమితి ప్రాంతంలో 1962-63 సంవత్సరాల మధ్య కాలంలో వ్యవసాయోత్పత్తిని అభివృద్ధి పరచేందుకు 1004 మణుగుల మేలురకపు విత్తనాలను, 2936 మణుగుల రసాయనిక ఎరువుల్ని, ఆధునిక పనిముట్లను రైతులకు పంచిపెట్టారు. దీనికి తోడు 313 కంపోస్టు ఎరువు గోతుల్ని త్రవ్వారు.

***సబ్బుల తయారీ :***

గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమం క్రింద నారాయన్‌పూర్‌లో సబ్బుల తయారీ సంఘం ఒకటి పని చేస్తున్నది. ఇంతవరకూ 923 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవకదళంలో చేరారు. 18 రక్షణ శ్రామిక బ్యాంకులు ప్రారంభించ బడ్డాయి.

## నెల్లూరు జిల్లా

***దళపతుల శిక్షణ :***

కొండపి పంచాయతీ సమితి దళపతులకు, గ్రామ అత్యయిక కమిటీల చైర్మనులకూ పునశ్చరణ శిక్షణ శిబిరం మే 9న ప్రారంభించ బడింది.

## నిజామాబాదు జిల్లా

***శిశువిహార్ ప్రారంభం :***

తెలంగాణాలో మూడు శిశువిహారాలను మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించడానికి ఆమోదం లభించింది. వాటిలో ఒకటి నిజామాబాద్‌లో వుంది.

నిజామాబాదు శిశువిహారంలో కుల, మత ప్రసక్తి లేకుండా అందరి పిల్లలకూ ప్రవేశం కల్పింపబడింది. దీనికి కేటాయించిన రూ. 13,360 ల బడ్జెటులో మార్చినెల నాటికి రూ. 12,400 ల ఖర్చయ్యాయి.

## విశాఖ పట్టణం జిల్లా

***గ్రామ సహాయకుల శిక్షణ :***

చోడవరం పంచాయతీ సమితిలోని అయిదవ గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని లక్కవరం గ్రామంలో మే 30 తారీఖు నుండి ప్రారంభించారు. వ్యవసాయంలోను, పశుపోషణలోను, చిన్న నీటి వనరులలోను గట్టి శిక్షణ యివ్వబడింది. లక్కవరం గ్రామ సేవకుని పరిధిలోని నాలుగు గ్రామాలనుండి 50 మంది సహాయకుల్ని యీ శిక్షణకై తీసుకున్నారు.

## వరంగల్ జిల్లా

***గ్రామీణ స్వచ్ఛంద సేవకుల ఉరవడి :***

'మే నెలలో గ్రామసేవకుల మండల స్థాయిలో గ్రామీణ స్వచ్ఛంద సేవక దళాల ప్రారంభానంతర పునశ్చరణ శిక్షణ శిబిరాలను అయిదుచోట్ల నిర్వహించారు. ఈ కార్యక్రమాలను ములుగు పంచాయతీ సమితికి చెందిన 10 గ్రామ సేవకుల మండలాలకు వర్తింపజేశారు. పంచాయతీ సమితుల సభ్యులకు, సహకార సంఘాలవారికి, గ్రామ సహాయకులకు, స్వచ్ఛంద సేవక సంస్థలవారికి' విస్తరణ సిబ్బంది తగు శిక్షణ యిచ్చింది.

***శ్రమదానం :***

ములుగు పంచాయతీ సమితికి చెందిన రక్షణ శ్రామిక బ్యాంకులు మే నెలలో సుమారు 375 రూ.ల మేరకు శ్రమదానం చేశాయి. మే నెలలో 200 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవకదళంలోను, రక్షణ శ్రామిక బ్యాంకులలోనూ తమ పేర్లను నమోదు చేసుకున్నారు. ★

# లలనావనం



## * సేవాగృహాలు *

— ఆవుల జయప్రదాదేవి

సేవాగృహాలు అన్న యీ వ్యాసం శీర్షికను చూడగానే ప్రతి కార్యక్రమమూ సేవా కార్యక్రమమే కదా? ఇంకా సేవా గృహము లేమిటి? అనే సంశయం పాఠకుల్లో రావచ్చు. ప్రతిఒక్కదానిని, తెలుసుకోడానికి విస్పష్టంగా అర్థం చేసుకుని అవగాహన చేసుకోడానికి, ఒక్కొక్క ప్రత్యేకమైన పేరు కావాలి. అందుకనే, ఆ ఉద్దేశ్యంతోనే వీటికి సేవాగృహాలని పేరు పెట్టబడింది.

ఇవికూడా అనాథలైన స్త్రీలకొరకు ఏర్పడినవే. అయితే లోగడ మనం తెలుసుకున్న అనంతర రక్షణ గృహాలు (After care homes) ముఖ్యంగా పతితులకు, పతితావస్థకు రానున్న అపాయ స్థితిలో వున్న వారికి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడ్డాయి. ఈ సేవా గృహాలు అలాంటివి కావు. కేవలం భర్తలచే, పరిత్యక్తలైన వారికి, అసహాయులైన భర్తలచే, అనగా రోగగ్రస్తులైన భర్తలచే, పోషింపబడలేని వారికి ముఖ్యంగా ఏర్పాటు చేయబడినవి.

ఒకవైపునుండి హిందూ వారసత్వపు బిల్లు అమలుజరుప బడుతున్నది. అందు కొంతవరకు స్త్రీల ఆర్థిక హక్కులను పొందుపరచి భద్రపరచడం జరిగింది. ఆర్థిక సమస్య తీరితే అన్ని సమస్యలూ, వాటంతటవి పరిష్కారమౌతాయని కొంతమంది అభిప్రాయం. కాని అన్ని సమస్యలూ ఎన్నడూ పరిష్కారం కాజాలవు. కాకపోతే ఏదో జీవనోపాధి కింత ఆర్థికమైన అవకాశ ముండడంచేత, చూడడానికంత దుర్భరంగా కన్పించక పోవచ్చును. మానసికమైన ప్రశాంతత, ఆనందం, సహజంగా లోపిస్తాయి. తనకింత తినడానికి తిండివుండి ఇతరుల కింత పెట్టగలిగిన అవకాశమున్నప్పటికీ, అవిద్యా కారణం వల్ల కుటుంబాలు ఎన్నో ఇక్కట్లపాలవుతున్నవి. ఇక్కడ అవిద్య అనగా అభిప్రాయం అజ్ఞానం. తమతమ బాధ్యతలను, కర్తవ్యాలను సక్రమమైన పద్ధతిని గమనించడమే జ్ఞానం కల మానవుని లక్షణం. అటువంటిది లోపించినప్పుడు, వారు కుబేరులైనా, సరస్వతీ సంపన్నులైనా, ప్రయోజనంలేదు. ధర్మబద్ధమైన, నీతిబద్ధమైన, తమ కర్తవ్యాన్ని గుర్తించ గలిగినప్పుడు మానవత్వం సార్థకమౌతుంది. అది లేనినాడు అనర్థాలు తప్ప అన్యదా ప్రయోజన మేముంటుంది?

అందువల్లనే ఈవిధాలైన సమస్యలు ఎక్కువ భాగరి తయారవుతున్నవి. అటువంటి దురదృష్టవంతురాలైన స్త్రీలకు, ఆస్కారం యివ్వడమే వీటి ప్రధాన ఆశయం. వీటిల్లో ఆడవారికి మూడు సంవత్సరముల వరకూ ఆశ్రయం లభిస్తుంది. ఈ మూడు సంవత్సరాల్లో వారిని కొంతవరకూ విద్యా సంపన్నులుగా జేయడానికై సంక్షిప్త విద్యావిధానం ప్రకారం 8వ తరగతి పరీక్షకు తయారుచేస్తున్నారు. ఇంతేగాక కుట్టు, తోలు పరిశ్రమ మొదలైన వాటిల్లో ఇతర చేతి పనుల్లోకూడా శిక్షణ నిస్తున్నారు.

ఇలాంటి సేవాగృహాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ స్త్రీ సంక్షేమశాఖ (Women Welfare department) తరఫున ప్రస్తుతం మూడింటిని నడుపుతున్నారు. అవి హైద్రాబాదు, అనంతపురం, కన్నాపురాల్లో ఉన్నాయి. కన్నాపురం పశ్చిమ గోదావరి జిల్లాలోని పోలవరం తాలూకాలో వుంది. ఇక్కడ నడుపుతున్న సేవాగృహానికి శ్రీమతి కానుమల్లి వెంకటనరసమ్మగారు కొంత ఆర్థిక సహాయమే కాక 13 యకరముల భూమినికూడా విరాళంగా యిచ్చారు.

ఇంతేకాక స్వచ్ఛంద సేవాసంస్థలుకూడా ఈ రకమైన సేవాగృహాలను నడుపుతున్నాయి. తూర్పు గోదావరిజిల్లాలోని సీతానగరంలో ఒక సేవా గృహం కస్తూర్బా స్మారకనిధివారి అధ్వర్యాన స్త్రీ సంక్షేమ

శాఖవారి ఆర్థిక సహాయంతో నిర్వహింపబడుతున్నది. కర్నూలుజిల్లాలోని ఆళ్ళగడ్డలో అరుంధతీ శరణాలయం అనుపేరుతో స్థానిక మహిళామండలివారు ఇలాంటి గృహాన్నే మరొక దాన్ని నడుపుతున్నారు.

ఈ విధమైన అభాగినులకు నేటి సేవా కార్యక్రమాలద్వారా జీవితంలో ఒక బాట యేర్పడి, తద్వారా సుఖజీవనం సాగించే అవకాశం లభిస్తున్న మాట వాస్తవం. ఉదాహరణకు ఒక్క చిన్న విషయాన్నే తీసుకుందాం. ఇలాంటి గృహాలలోనూ, ప్రత్యేక సేవా సంస్థలలోనూ అనేకచోట్ల సంక్షిప్త విద్యా విధానం అమలు జరుపబడుతున్న విషయం పాఠకులకు విదితమే. అందువల్ల అనేక సత్ఫలితాలు కలిగాయి.

మొత్తం మీద మనరాష్ట్రంలో ఈ విధమైన కోర్సులను నడపడంలో 25 సంస్థలు కృషిచేస్తున్నాయి. 1959-61, 60-62 సంవత్సరాల కాలంలో 16 కోర్సులు నడుపబడి, తద్వారా 354 గురు వయోజనులైన స్త్రీలు 8 వ తరగతి పరీక్షకు వెళ్ళారు. వారిలో 231 మంది ఉత్తీర్ణులయ్యారు. ఉత్తీర్ణులైన వారిలో 57 మంది మళ్ళీ పై చదువు చదివి మెట్రిక్ పరీక్షకు తయారవుతున్నారు. మిగిలినవారిలో 59 మంది ఉపాధ్యాయిని శిక్షణకు (ట్రైనింగ్‌కు) వెళ్ళారు. వీరిలో 14గురికి ఉద్యోగాలుకూడా లభించాయి. 1961-62 సంవత్సరకాలంలో 6 కోర్సుల ద్వారా 172 మంది పరీక్షలకు హాజరయ్యారు. ఫలితాలు త్వరలో వెలువడనున్నాయి.

1959-61 సంవత్సరకాలంలో మెట్రిక్ పరీక్షకు ఒక కోర్సు మాత్రమే నడపబడింది. 61-63 సంవత్సర కాలములో మూడు కోర్సులు నడుపబడ్డాయి. మొత్తం 83మంది వయోజనులైన మహిళలు పరీక్షలకు వెళ్ళారు. అందులో 41 మంది ఉత్తీర్ణులైనారు. వారిలో ఒకరికి ప్రథమశ్రేణి, 15 మందికి ద్వితీయశ్రేణి కూడాలభించింది. 1962-64 సంవత్సర కాలంలో 9 కోర్సులు 8 వ తరగతికి తయారు చేయబడుతున్నవి. ఇదే కాలంలో మెట్రిక్ పరీక్షకు 5 కోర్సులు నడుపబడుతున్నాయి.

ఈ విధంగా అభాగినులైన స్త్రీలకు ఈ కార్యక్రమాలద్వారా ఆశ్రయం, ఆస్కారం లభిస్తున్నది. మళ్ళీ 63-65 సంవత్సరాల కాలానికి మన రాష్ట్రంలో 7 కోర్సులు 8 వ తరగతికి, 4 కోర్సులు మెట్రిక్ పరీక్షలకు ప్రారంభింప బడుతున్నవి. వీటికి పూర్తిగా ప్రభుత్వం ఆర్థిక సహాయ మందిస్తున్నందువల్ల, ఏవిధమైన ఆర్థిక సమస్యలనూ ఎదుర్కొన వలసిన అవుసరం లేకుండానే, ఈ కార్యక్రమాలు జయప్రదంగా కొనసాగుతున్నాయి. 63-65 సంవత్సర కాలంలో ప్రారంభింపబడుతున్న కోర్సులకు విద్యార్థినులను ఇప్పుడిప్పుడే చేర్చుకుంటున్నారు. అవసరమైన మహిళలు త్వరపడి ఆయా సంస్థలకు దరఖాస్తులు పెట్టుకుని ఈ అవకాశాన్ని సద్వినియోగంచేసుకోవచ్చును.

ప్రస్తుతం నడుపబడే కోర్సులు: సంస్థల చిరునామాలు.

8 వ తరగతి

1. టౌను మహిళా సంఘం— విజయనగరం — విశాఖపట్నంజిల్లా.
2. శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజం — తణుకు —పశ్చిమ గోదావరిజిల్లా.
3. స్త్రీ హితైషిణీ మండలి - బాపట్ల- గుంటూరుజిల్లా.
4. సాధువమ్మ సేవాసదనం - సత్తెనపల్లి- గుంటూరుజిల్లా.
5. స్టేట్ ఆఫ్టర్ కేర్ హోమ్ — హైద్రాబాదు. —
6. కె. జి. యస్. యం. ట్రస్ట్- హైద్రాబాదు. —
7. వనితా మండలి - సంగారెడ్డి — మెదక్ జిల్లా.

మెట్రిక్

1. హిందూ స్త్రీ పునర్వివాహ సహాయక సంఘం — నర్సాపురం - పశ్చిమ గోదావరిజిల్లా.
2. మహిళా సమాజము - మోదుకూరు - గుంటూరుజిల్లా.
3. ఆంధ్రమహిళాసభ — విద్యానగర్ — హైద్రాబాదు.
4. లేడీస్ క్లబ్ —చిత్తూరు— చిత్తూరుజిల్లా.

ఈ పై కోర్సులు నడుపబడే చోట్ల కొన్నిటిలో ఇప్పటికే విద్యార్థినులు కొంత మంది చేర్చుకొనబడ్డారు. మిగిలిన చోట్లలో ఇప్పుడిప్పుడే చేర్చుకుంటున్నారు. కాబట్టి అభాగినులైన సోదరీ మణులు త్వరపడి పై సంస్థలకువ్రాసి అవకాశాలను సద్వినియోగ పరచుకొన గలరని ఆశిస్తున్నాము. ★

<u>స్వీకారం:</u>

వైజయంతి: (సచిత్రమాస పత్రిక)

ఎడిటర్ : మోహన్‌కుమార్,

సాలుచందా : రు. 5. విడిప్రతి : 25 నయాపైసలు;

చిరునామా : వైజయంతి : 29-13-7 లక్ష్మీవారపు పేట, రాజమండ్రి - 1

# పిల్లలు-జీర్ణశక్తి

డాక్టర్ : వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

కొంతమంది పిల్లలు పుట్టిన 24 గంటల వరకూ నిద్రపోతూనే వుంటారు. కొన్ని జాతులలో పిల్లలు పుట్టిన మూడు రోజుల వరకూ పాలివ్వకుండా అలానే వుంచేస్తుంటారు. పుట్టిన కొన్ని వారాల వరకూ ఆకలి వేసినప్పుడు పిల్లలు చాలా గట్టిగా ఏడుస్తుంటారు. ఏడ్పు ఆకలివల్లో, బాధవల్లో, ఒంటరితనంవల్లో తెలుసుకోవడం మొదట్లో కొంచెం కష్టమే. అన్నింటికీ ఒకేరకంగా వుంటుంది. కాని, రానురాను యీ భేదం గుర్తించవచ్చు. రెండు నెలలు అయ్యేసరికి చంటి పిల్లలు ఎందుకేడుస్తున్నదీ తెలుసుకోవచ్చు. మూడు నెలలకు క్రమంగా చంటిపిల్లల ఏడ్పులుకూడా నిమ్మళిస్తాయి.

సాధారణంగా పిల్లలకు ఆరో నెలలో పళ్ళు రావడం ప్రారంభిస్తాయి. కొంతమంది పిల్లలు పుట్టినప్పుడే పళ్ళతో పుట్టుతూ వుంటారు. అలాంటివారిని మన వాళ్ళు రాక్షససంతతి వారని అనడం కద్దు. పుట్టు కోరలతో పుట్టారు గనక రాక్షసత్వాన్ని మనవాళ్ళు ఆపాదిస్తుంటారు. కాని యీ అభిప్రాయం తప్పు. అలా పళ్ళతో పుట్టడం పుట్టినవాళ్ళ తప్పుకాదు. అంతగా ఆ పళ్ళు వాళ్ళను యిబ్బంది పెడ్తున్నాయనుకుంటే తీయించి వేయవచ్చు.

సంవత్సరం దాటితేగాని పిల్లలకు నమలడానికి వీలయిన పళ్ళు రావు. అంతవరకూ పదార్థాలను నోటితో చప్పరించి, లాలాజలంలో నాన్చి, మెత్తబడిన తర్వాత తింటుంటారు. పళ్ళు రావడం ప్రారంభించినప్పుడు కొన్ని రకాల యిబ్బందులు కూడా తలయెత్తుతుంటాయి. నోటిలో నుండి ఎక్కువగా నీరు కారుతూ వుంటుంది. అస్తమానం పిల్లలు చేతి వేళ్ళను నోట్లో పెట్టుకుంటూ వుంటారు. ఆ సమయంలో, ప్రాకినప్పుడు చేతి వేళ్ళకు అంటుకున్న మట్టి నోట్లోకి వెళ్ళిపోయే ఆస్కారం వుంటుంది. అది చాలా అనర్థాలకు హేతువు కావచ్చు. పళ్ళు వస్తున్న రోజులలో అప్పుడప్పుడు పిల్లలకు జ్వరంకూడా వస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు విరేచనాలు కూడా అవుతుంటాయి. అలాంటి సమయాల్లో కొత్త పదార్థాలను పిల్లలకు పెట్టడం మంచి పని కాదు.

పుట్టినప్పుడు పిల్లల పొట్ట సాధారణంగా 1-2 ఔన్సుల పాలు మాత్రమే పట్టేట్టుగా వుంటుంది. కాని పది రోజులు గడిచేసరికి 3½ ఔన్సుల వరకూ పట్టేటట్టు విశాలమవుతుంది. సాధారణంగా పాలు త్రాగేప్పుడు పిల్లలు పాలతోపాటు గాలిని కూడా లోపలికి పీలుస్తూ వుంటారు. అలా లోపలకు చేరిన గాలి త్రేన్చినప్పుడు బయటికి వచ్చేస్తుంది. కొంచెం మాత్రం కిందకు వెళ్తుంది.

పిల్లలకిచ్చే ఆహారం జీర్ణం కావడానికి స్వతః వాళ్ళ శరీరంలోనే అందుకవసరమైన రసాలు వుంటాయి. ఒక్క కొవ్వు పదార్థాల్ని జీర్ణం చేసుకోవడం మాత్రం పిల్లలకు కొంచెం కష్టంగా వుంటుంది. మొదటి మూడు నెలలలోనూ అందుకు అవసరమైన రసాలు అంతగా వాళ్ళల్లో తయారుకావు. అందువల్ల మూడు నెలల లోపు పిల్లలకు కొవ్వు తక్కువగా వున్న పాలనే యిస్తుండాలి. పిండి పదార్థాల్ని జీర్ణం చేసుకునే రసాలు, పుట్టినప్పుడే వాళ్ళల్లో వుంటాయి గనుక వాటి జీర్ణం విషయంలో యిబ్బందిలేదు.

పుట్టిన కొద్ది గంటలలోనే పిల్లలు విరేచనాలకు వెళ్తారు. అది చిలుకపచ్చ రంగులో మెత్తగా వుంటుంది. వాసన వుండదు. తర్వాత కొద్ది రోజులకు ఇది గోదుమ రంగులోకి మారుతుంది. తల్లి పాలు యివ్వడం ప్రారంభించాక పసుపు పచ్చగా విరేచనం అవుతుంది. పాలు తాగే రోజుల్లో ఎక్కువ సార్లు విరేచనాలకు పోతుంటారు. ఆరోజుల్లోనే అప్పుడప్పుడు ఆకుపచ్చని, పల్చని విరేచనాలుకూడా అవుతుంటాయి. అందులో ఏమీ దోషం లేదు. రోజూ వెళ్ళకుండా రెండు రోజుల కొకసారి వెళ్ళినా తప్పు లేదు. తల్లి పాలు తాగే బిడ్డ విరేచనం సాధారణంగా పల్చగానే వుంటుంది. పాలు తక్కువైనప్పటికీ కొద్ది కొద్దిగా చాలాసార్లు విరేచనాలకు వెళ్తారు గాని గట్టిగా మాత్రం వెళ్ళరు.

పై పాలుతాగే పిల్లల విరేచనం రంగు తక్కువగా, కొంచెం గట్టిగా వుంటుంది. దానికి వాసనకూడా వుంటుంది. అప్పుడప్పుడు పెరుగులాగ బిళ్ళలు బిళ్ళలుగా వెళ్తుంటారు. కొంచెం జిగురుగా కూడా వుంటుంది. కాని ఎక్కువ జిగురు జబ్బుకు గుర్తు. పై పాలు ఎక్కువగా తాగించినప్పుడు పెద్దపెద్ద పల్చని విరేచనాలు చాలాసార్లు అవుతాయి. తక్కువ తాగిస్తే కొద్దిసార్లు గట్టిగా అవుతాయి.

పిల్లలకు ముఖ్యమైన ఆహారం పాలు. అవి తల్లిపాలైనా కావచ్చు. ఆవుపాలైనా కావచ్చు. లేక బర్రెపాలైనా కావచ్చు. చివరకు పౌడరు పాలన్నా కావచ్చు. ఈ పాలల్లో ఒక్క విటమినులు తప్ప పిల్లలకు

కావలసిన వన్నీ వుంటాయి. చాలా దేశాలలో తల్లిపాలు పట్టకుండా ఆవుపాలని యిస్తూ వుంటారు. మరికొన్ని దేశాలలో గాడిదల్ని, మేకల్ని కూడా వుపయోగిస్తుంటారు. ఇవి కాక డబ్బా పాలను కూడా యీ రోజులలో విరివిగా వాడుతున్నారు. ఈ డబ్బా పాలు ద్రవ రూపంలోనూ, పొడి రూపంలోనూలభిస్తాయి.వీటిలో అంతాపాలు, కొవ్వు తీసేసిన పాలు అనే రకాలున్నాయి.

### మొదటి రెండు వారాలలో తల్లిపాలు

మామూలుగా చాలామంది పిల్లలు తల్లి లాగే మొదటిరోజున అలసి నిద్రపోతారు. ఆరుగంటలయిన తర్వాతగాని, లేక పన్నెండు గంటలయిన తర్వాతగాని ఒక్కో వైపు ఒక్కో నిమిషంచొప్పున రెండు వైపులా పాలివ్వాలి. ఈ రకంగా మొదటి రోజున, ఆరేసి గంటలకు ఒక్కొకసారి నిమిషంపాటు నాలుగుసార్లు పాలివ్వాలి. అలాగే రెండోరోజున, మూడోరోజున ఆరేసి గంటలకు ఒక్కోసారి రెండు నిమిషాలపాటు నాలుగుసార్లు పాలివ్వాలి. ఈ మూడురోజులూ చాలా తక్కువ పాలు వస్తాయి. అందువల్ల పాలు కుడపక పోయినా పర్వాలేదు కాని, కుడిపితే పాలు ఎక్కువ పడే అవకాశంవుంది.

పాలు తాగించడానికి ముందు పాలిచ్చే భాగాన్ని శుభ్రంగా కడగాలి. ఇబ్బంది లేకుండా తల్లి కూర్చుని అప్పుడు పాలు పట్టాలి. లేదా పడుకోబెట్టుకుని పట్టాలి. ఎడమవైపు పాలిచ్చేప్పుడు ఎడమవైపు వడుకోబెట్టుకోవాలి. అలాగే కుడివైపు పాలిస్తే కుడివైపు పడుకోబెట్టుకోవాలి.

కొంతమంది పిల్లలు బాగా పాలుతాగుతారు. మరి కొంతమంది మగతగా తాగుతారు. ఇంకొంతమంది తాగేబదులు ఆడుకుంటారు. అంతమాత్రంచేత మొదటి రెండు మూడు రోజులూ, నిద్రపోయే బిడ్డను బలవంతంగా నిద్రలేపి పాలు తాగించాల్సిన అవసరంలేదు. పాలుతాగించిన తర్వాత ఒళ్ళో కూర్చోబెట్టుకోవడమో, భుజంమీద వేసుకొవడమో చేయాలి. తేనుపు వచ్చేదాకా రెండువైపులా పాలివ్వాలి. ఒకసారి కుడివైపున మొదట ప్రారంభిస్తే, రెండోసారి ఎడమవైపున మొదట ప్రారంభించాలి. పాలు యివ్వగా యింకా మిగిలివుంటే వాటిని తీసేయాలి.

ప్రతి తల్లికి, మొదటి రెండువారములలో పిల్లల పాల అవసరమును గురించి తెలియడం చాలామంచిది. మామూలుగా 5–10 రోజులదాకా ఎనిమిదిసార్లు పాలు అవసరం. కాని కొంతమంది పిల్లలకు అన్నిసార్లు అవసరం వుండదు. చాలామంది పిల్లలు రాత్రిపూట నిద్రపోరు. ఏడ్చినప్పుడు కొంచెం సముదాయించి పడుకోబెడితే నిద్రపోతారు. అప్పటికీ నిద్రపోకపోతే పాలు పెడితే మంచిది. రోజూ అలా పాలు పెట్టాలన్న నియమం ఏమీలేదు. సరిగ్గా ఎన్ని గంటలకు తాగించాలన్నది అంత ముఖ్యంకాదు. మామూలుగా కొంచెం ప్రొద్దెక్కిన తర్వాత పిల్లలు పాలు తాగుతారు. మధ్యాహ్నమయ్యేసరికి కొంచెం త్వరగా తీసుకుంటుంటారు. అందుకని గం॥ 6–0, 10–0, 1–30, 4–30, 7–0, 9–30,12–0 గం॥ లకు, తెల్లవారుఝామున యిస్తేమేలు.

మొదటి రెండుమూడు రోజులుతల్లిపాలు లేకపోయినా పిల్లలు నిద్రపోతారు కాని ఒకవేళ నిజంగా ఆకలివేస్తే కొద్దిగా కాచి చల్లార్చిన నీటినిగాని, చక్కెర కలిపిన నీటినిగాని పట్టవచ్చు. అప్పటికీ ఆకలివేసి ఏడిస్తే పాలు యివ్వడం మంచిది. నీటిని స్పూనుతో యివ్వాలి. సీసాతో తాగడం ప్రారంభిస్తే ఆ తర్వాత తర్వాత తల్లిపాలు తాగకపోవచ్చు. తల్లిపాలు చాలనప్పుడు గూడా స్పూనుతో యివ్వవచ్చు గాని, అవి ఎప్పుడూ తల్లిపాలు తాగిన తర్వాతనే యివ్వాలి. ముందు యివ్వగూడదు. తల్లిపాలు చాలకపోతే మామూలుగా ఆవు పాలను యివ్వవచ్చు. 2 ఔన్సుల పాలలో 1 ఔన్సు నీళ్ళు కలిపి యివ్వాలి. బిడ్డకు పాలు సరిపోతున్నాయా లేదా అని ప్రతిసారి తూచ నవసరంలేదు. తాగిన తర్వాత బాగా నిద్రపోయి లేచి మరల పాలుతాగి ఆడుకొంటూ బరువు ఎక్కుతూ వుంటే పాలు చాలినవనడానికి అదే మంచి నిదర్శనం. పుట్టిన రోజున, నాలుగు, ఏడు, పది, పధ్నాలుగో రోజున; ఆ తర్వాత వారానికోసారి ఆరువారాలవరకూ; ఆపైన నెలకోసారి బిడ్డను తూచడం అవసరం.

పిల్లలకు పాలివ్వడానికి మరోమార్గం కూడా వుంది. మీరు టైము లెక్కపెట్టి పాలు కలిపేదాకా బిడ్డకుఆకలికాకుండా వుంటుందా? బిడ్డకు ఆకలి ఎప్పుడవుతుందో అప్పుడే పాలిస్తే మంచిదని కొంత మంది అభిప్రాయం. ఆవిధంగా కూడా చేయవచ్చు.

ఎక్కువ బరువుగాను కళ్ళు పచ్చగా వున్న పిల్లలు మగతగా వుంటారు. కొంతమంది ఊరికే నిద్రపోతూవుంటారు. జ్వరం వచ్చినప్పుడుగూడా పాలు సరిగా తాగరు. నోటిలోపేదైన కురుపువేసినప్పుడు, ముక్కుతో గాలి ధారాళంగా పీల్చలేక పోయినప్పుడు కూడా సరిగా తాగరు. మెదడు జబ్బువున్నవాళ్ళు కూడా అంతే. గడ్డం చిన్నదిగావుంటే పాలు తాగడంకష్టం. గుండెజబ్బుగాని, మరియే ఇతర జబ్బులు గాని వున్నట్టయితే తృప్తిగా తాగలేరు. పిల్లలు పాలు తాగకపోతే యీ కారణాలలో ఏ కారణంచేత తాగలేదో తెలుసుకోవడానికి ప్రతి తల్లీ ప్రయత్నించాలి. 

## 'జాతీయ ఫలం'

# మామిడి కాపులో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం

ఆంధ్రప్రదేశ్‌లో మామిడి మిక్కిలి ప్రశస్తమైన ఫలం. రాష్ట్రంలో ప్రస్తుతం 2,20,000 ఎకరాలలో యీ పండ్ల తోటలు వున్నట్లు అంచనా. ఈ విస్తీర్ణం రాష్ట్రంలోని మొత్తం పండ్ల తోటల వైశాల్యంలో 70 శాతం. భారతదేశం మొత్తంమీద, మామిడి తోటల విస్తీర్ణంలో, ఉత్తరప్రదేశ్, బీహారు రాష్ట్రాల తర్వాత ఆంధ్రప్రదేశ్ మూడవ స్థానాన్ని ఆక్రమించినప్పటికీ 300 పైచిలుకు మామిడి పండ్ల రకాలను కాయించగలిగిన గౌరవం ఒక్క ఆంధ్రప్రదేశ్‌కే దక్కింది. అనేక అఖిలభారత మామిడిపళ్ళ ప్రదర్శనల్లో, యీ రాష్ట్రంలో పండే బనేషాన్, హిమాయుద్దీన్ మొదలయిన రకాలు ప్రథమ బహుమతుల్ని, ప్రత్యేక బహుమతుల్ని పొందాయి.

ఇక్కడ ఏటా కాపు సుమారు 7 లక్షల టన్నులు వుంటుంది. అందులో యించుమించు 2 లక్షల టన్నులు మద్రాసు, పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, బొంబాయి మొదలయిన రాష్ట్రాలకు ఎగుమతి అవుతుంటాయి. ఆ రాష్ట్రాలలో యిక్కడి రకాలకు గిరాకీ ఎక్కువ. బంగినపల్లి (బనేషాన్) సువర్ణరేఖ, నీలమ్, బంగలోరా, రుమాని, పటర్, ఖాదిర్ (ఆల్‌ఫొన్‌సో)లు ఎగుమతి అయ్యే రకాలలో ప్రధానమైనవి.

రాష్ట్రంలో పండే కొన్ని రకాలు ముఖ్యంగా దేశంలోనే అపురూపమైనవి. వీటిని 'రసాలు' అంటారు. మన రాష్ట్రంలో గాని, దేశంలోగాని కాసే షీమరకం పండ్లకు యివి పూర్తిగా భిన్నమైనవి. ఈ రకాల పళ్ళను గట్టిగా అణిచినా, లోపలికి పీల్చినా పీచునుండి మధురమైన పల్చటి రసం బయటకు వస్తుంది. వెంటనే త్రాగటానికి, యీ రసం చక్కగా వుపయోగిస్తుంది. యావద్భారతంలో ఊరగాయకు, పచ్చళ్ళకు ఆంధ్రప్రదేశ్ ప్రసిద్ధిగాంచింది. అందుకై ప్రత్యేకమైన రకాల్ని అభివృద్ధి చేస్తున్నారు. మామిడితాండ్ర అనే నిలువచేయదగిన పదార్థం యీ రాష్ట్రంలో వ్యాప్తిలోకి వచ్చింది. పీచు ఎక్కువగా వుండి తినడానికి అంతగా పనికిరాని తాజాపళ్ళనుండి దీన్ని తయారు చేస్తారు. తాజా మామిడి పళ్ళు దొరకని రోజుల్లో తీపితోను, సుగంధ ద్రవ్యాలతోను యిది చక్కటి ఫలహారంగా వుపయోగిస్తుంది.

### కొత్త రకాలు

అనేక కొత్త రకాలను కాయించడంలో కూడా మన రాష్ట్రం గర్వించదగిన స్థానాన్ని ఆక్రమిస్తుంది. పెంపకంద్వారానూ, పరిశోధనల ద్వారానూ పండ్ల రకాలను పెంపొందిస్తున్నారు. ప్రభుత్వ ప్రయోగ కేంద్రాలలో, రాష్ట్ర వ్యవసాయశాఖ సెలక్షన్, మిశ్రమ విధానాలద్వారా ముప్పైకి పైగా కొత్త మిశ్రమ రకాలను ఇదివరకే అభివృద్ధి పరచడం జరిగింది. వీటిలో "స్వర్ణ జహాంగీర్" "హిమ నీలం" మొదలైనవి విందులకు ఉపయోగించే ప్రశస్తమైన మామిడి పండ్లుగా యావద్భారతదేశంలో ప్రసిద్ధి జెందాయి. సంగారెడ్డిలోని పండ్ల పరిశోధన కేంద్రం 280 కి పైగా పండ్ల రకాలలో పరిశోధనలు జరుపుతున్నది. దేశంలోని మరే ఇతర పరిశోధన కేంద్రంలో కూడా బహుశా వీటి సంఖ్య ఇంత అధికంగా వుండివుండదు.

దక్షిణ భారతదేశంలో సాధారణంగా కానవచ్చే విషయమేమంటే, ఇక్కడ మద్రాసు మొదలైన రాష్ట్రాలలో, ఉత్తర భారతదేశంలో సాధారణంగా కాసే పండ్ల రకాలు అంత బాగా కాయవు. దీనికి కారణం ఇక్కడి భిన్నమైన శీతోష్ణ పరిస్థితులే అయి వుంటుంది. అయితే ఈ రాష్ట్రంలోని తెలంగాణా ప్రాంతంలో మాత్రం దక్షిణ భారత రకాలతోపాటు ఉత్తర భారత రకాలు కూడా బాగా కాస్తాయి. రాష్ట్రంలోని సంగారెడ్డి పండ్ల పరిశోధన కేంద్రంలో, యావద్భారత దేశంలోని పండ్ల రకాలను సేకరించి పెద్దఎత్తున కొత్త రకాలను ఉత్పత్తి చేయడానికి ఈ అపూర్వావకాశాన్ని వినియోగపరచుకోవటం జరిగింది. ఉత్తర దక్షిణ భారతదేశాల శీతోష్ణపరిస్థితుల్లో కూడా ఒకేవిధంగా ఎదగగల కొత్త రకాలను ఉత్పత్తి చేయడానికి ఇప్పుడు పరిశోధనలు సాగిస్తున్నారు.

మన దేశంలో మామిడి పంటలో కానవచ్చే మరో ప్రత్యేకమైన విషయమేమిటంటే దీని కాత ఏటా ఒకేరకంగా వుండదు. కాత ఒక సంవత్సరం సమృద్ధిగా వుంటే ఆ మరుసటి సంవత్సరం చాలా తక్కువగా వుంటుంది. అంతేగాక ఒక్కొక్కప్పుడు వరుసగా రెండుమూడు సంవత్సరాల వరకు కూడా కాత లేకుండా పోతుంది. రాష్ట్రంలోని ప్రభుత్వ ప్రయోగశాలలలో, ఈ లోపాన్ని ప్రత్యేక సేద్య విధానాలు తదితర పద్ధతుల ద్వారా నివారించడానికి ఎంతవరకు సాధ్యపడేదీ పరిశోధనలు చేస్తున్నారు.

మామిడిని అనేక విధాల నిలువ చేయవచ్చు. కడప జిల్లా అనంతరాజు పేటలోని పండ్లను నిలువచేసే ప్రభుత్వ ఫ్యాక్టరీలో షర్బతులను, నీరు తీసివేసిన గుజ్జును, డబ్బాలలో జాగ్రత్తచేసే ముక్కలు మొదలైన వాటిని తయారు చేస్తారు. తీపి పచ్చళ్ళు, మామిడి తాండ్ర మొదలైన వాటికి విదేశాలలో బహుశా మంచి గిరాకీ వుండవచ్చు. ఈ రాష్ట్రంలో కాసే మామిడి రకాలు ఇలాంటి ఉత్పత్తులకు బాగా పనికి వస్తాయి.

మామిడిని మన 'జాతీయ ఫలం' అనడంలో ఎంతో సముచితంగా వుంది. మన దేశంలో మామిళ్ళు వున్నంతటి విస్తీర్ణంలో మరే పండ్ల చెట్లూ లేవు. ఇక్కడ కాసే మామిడి రకాలు 1,000 కి పైగా వుంటాయి. ఇవి పలు ప్రయోజనాలకు వినియోగపడుతూ భిన్నభిన్న రుచులు గల్గి పెక్కుమందికి సంతృప్తి కలిగిస్తున్నాయి. ప్రపంచంలో మరే పండ్లలోకూడా బహుశా ఇన్ని రకాలు వుండకపోవచ్చు. భారత రాష్ట్రాలన్నింటిలోనూ ఆంధ్రప్రదేశమే ఈ జాతీయ ఫలంలో ప్రశస్తమైన రకాలు పండించే రాష్ట్రమని ఘంటాపథంగా చెప్పవచ్చు. మామిడి కాపును ఇతోధికంగా అభివృద్ధిపరచడానికి, విదేశాలకు ఎగుమతి చేయడానికి కూడా ఇక్కడ చక్కని అవకాశాలున్నాయి. ★

# వికలాంగులకు విద్య

వానిరాజు ప్రకాశం

*తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!*

మనం వుదయాన్నే నిద్రలేచినప్పటి నుంచి, తిరిగి సాయంత్రమయి, చీకటి పడేలోగా ఎన్నోరకాల మనుష్యులను చూస్తూ వుంటాం. వారంతా వివిధ రకాలైన భాషలు మాట్లాడుతూ వుంటారు. వారు ధరించే దుస్తుల్లోనైతేనేమి, వారి ప్రవర్తనలోనైతేనేమి ఒకరితో ఒకరికి సంబంధమే వుండదు. కొందరి మాటతీరు చూస్తుంటే, మరికొంతసేపు మాట్లాడాలని అనిపిస్తుంది. కొందరి ధోరణి చూస్తుంటే, 'ఇక్కడినుంచి ఎప్పుడెప్పుడులేచిపోదామా?' అని అనిపిస్తుంది.

అదేవిధంగా మానవదేహాల నిర్మాణంలో కూడా ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. 'జిహ్వకొకరుచి' అన్నట్లుగా ఒక్కొక్క మనిషికి ఒక్కరూపం. అందులో కొందరు మిలమిలలాడే పచ్చని దేహచ్ఛాయ కలిగివుంటారు. కొందరు ఎటూకాని చామనచాయ. మరి కొందరునీలవర్ణంకలిగివుంటారు. ముఖాల్లో కూడా అంతే. ఎంతో వ్యత్యాసం వుంటుంది. చాలామంది చక్కని దేహపుష్టి కలిగి వుంటారు. అజానుబాహులై, చూస్తే కొట్టవచ్చేటట్లుగా వుండేవారున్నారు. వారుగాక, పొట్టిగాను, మధ్యరకంగాను వుండేవారూ వున్నారు.

కొందరి దేహనిర్మాణం అసమగ్రంగా వుంటుంది. అంటే వారికి యేవో అవయవ లోపాలు వుంటాయన్నమాట. కొందరికి కాళ్ళు, కొందరికి చేతులు వుండవు. కొందరికి కళ్ళు కనిపించవు. మరికొందరికి మాటలు రానేరావు. చెవులుండీ చెవిటివారై వినలేనివారు మరి కొందరు.

ఎంత ధనవంతులైనా కావచ్చును. పెద్ద పెద్ద భవనాలు ఎన్నైనా వుండవచ్చును. కాని లోపం లోపమే. దేహంలో వూపిరి వున్నంత కాలమూ, బాధిస్తూనే వుంటాయి యీ లోపాలు. మన ప్రక్కన వున్నవాడు చక్కగా నడవగలుగుతున్నప్పుడు, మనం కుంటుతూ నడుస్తుంటే బాధేగా మరి! చూపు కూడా అంతే. మన ఎదుటివాడు చక్రంగా చూడగలుగుతూ వుంటాడు. మనం మన ప్రక్కవారి చేయూతతో నడవటానికి ఎంతో బాధపడతాం.

నోరు వుండికూడా మాట్లాడలేనివారున్నారు మన సమాజంలో. అటువంటి వారినే మూగవాళ్ళని అంటాం. సరిగ్గా మాట్లాడటం చేతకాక, చేతులతో సౌంజ్ఞలు చేస్తూవుంటారు. తాము చెప్పదలచుకొన్నది, ఇతరులకు సరిగ్గా చెప్పలేకపోతున్నామని లోలోన ఎంతగానో బాధపడుతూ వుంటారు. అలాంటి వారిని చూచి, మనలో వుండే కొంటె పిల్లలు వేళాకోళం చేస్తుంటారు.

చెవిటివారికికూడా అదేబాధ. ఎదుటివారు ఏం చెపుతున్నదీ వినలేకపోతుంటారు. ఏదైనా సభకో, సినిమాకో వెళ్ళటానికి వెనకాడుతూ వుంటారు. అందాకా ఎందుకు? నలుగురిలో నిలబడి ధైర్యంగా ఒక మాట చెప్పటానికి భయపడతారు.

కాళ్ళు, చేతులు లేనివారు, వాళ్ళకు వాళ్ళే భారమేకాక, ఎదుటివారికి కూడా ఒక్కొక్కమారు పెద్ద తలనొప్పిగా తయారయి కూర్చొంటారు. వాళ్ళను ఎక్కడికైనా తీసుకవెళ్ళాలంటే మరొకరు కావాలి. ఆ విధంగా అమూల్యమైన ఇరువురి సమయమూ వృధా అవుతుంది. గ్రుడ్డివారి పరిస్థితికూడా దాదాపు అంతే. ప్రక్కన ఎవరూలేకుండా, కేవలం చేతికర్ర చేయూతతో వీధులలో నడిచేవారిని మనం అప్పుడప్పుడూ చూస్తూ వుంటాం. వారివల్ల కారుప్రమాదాలు అధికంగా జరిగే ప్రమాదంవున్నది.

భౌతికంగా వీరికి యీ లోపాలున్నప్పటికీ, వీరంతా స్వతంత్ర భారత దేశంలోని పౌరులే. అందరికిమల్లే, వీరుకూడా పౌర హక్కులను అనుభవిస్తున్నారు.

కాని, దురదృష్టవశాత్తు, వీరు యీ లోపాలతో జీవించవలసి వస్తున్నది. ఈ లోపాలను సరిదిద్ది, వీరినికూడా అందరిలాగే ఎందుకు తయారుచేయకూడదు? ఈ బాధ్యతను మన ప్రభుత్వం గుర్తించి, సక్రమంగా వీరిని అన్నివిధాలా అభివృద్ధి చేయడానికి సౌకర్యాలు కల్పిస్తున్నది. చిన్నతనంనుంచి గ్రుడ్డిగావున్నవారికి, చెవిటివారికి, మూగవారికి, చికిత్సచేయటం వుత్తమం అని మన ప్రభుత్వం భావించింది. వారికొక్కడా ప్రత్యేకంగా పాఠశాలలు నెలకొల్పటం జరిగింది. ఆయాశాఖలలో నిపుణులైన అధ్యాపకులను నియమించి, తద్వారా, చిన్నపిల్లలలో చిన్ననాటినుంచి ఏర్పడిన అంధత్వాన్ని తొలగించడానికి, మూగవారిచేత మాటాడించడానికి భారీఎత్తున కృషి జరుగుతున్నది.

ఆ విధంగా కృషి జరుపుతున్న ప్రభుత్వ పాఠశాలల్లో ఒకటి హైద్రాబాదులోని మలక్ పేటలో వుంది. ఈ పాఠశాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. వికలాంగులకు వెలుగుబాటలు చూపుతున్నది.

తొలుత 1939 లోనే యీ సంస్థ హైద్రాబాదులో స్థాపించబడింది. ప్రారంభించిన రోజుల్లో, నలుగురే నలుగురు విద్యార్థులుండేవారు. గ్రుడ్డివారికి, మూగ – చెవిటివారికి కలిపి యీ పాఠశాలను ప్రారంభించారు. కాని రానురాను ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ యేర్పడ్డాక పాఠశాలలో విద్యార్థుల సంఖ్య బాగా పెరిగిపోవడంవల్ల రెండు శాఖలను, 1961

## బాలానందం

లో విభజించటం జరిగింది.

రాష్ట్రంలోని పిల్లలందరికీ సమానంగా విద్యావకాశాలు కల్పించాలన్న మహదాశయంతోనే ప్రభుత్వం యీ సంస్థను నిర్వహిస్తున్నది. ఆ విధంగా, వికలాంగులైన బాలబాలికలనుకూడా మిగతావారి స్థాయికి తీసుకరావటానికి కృషి జరుగుతున్నది. ఆ సమానత్వం సిద్ధించినపుడు వికలాంగులైన వారుకూడా తమకుతామేకాకుండా, సమాజాభివృద్ధికీ, నవభారత నిర్మాణానికీ తోడ్పడ గలరనటంలో సందేహంలేదు.

అంధులైనవారికి, మూగవారికి జరుగుతున్న విద్యాబోధనల్లో వ్యత్యాసంవుంది. మూగవారికి, చెవిటివారికి ప్రభుత్వం కొన్ని ప్రత్యేకసదుపాయాలను కలుగ చేస్తున్నది.

గ్రుడ్డి — మూగవారికి సంబంధించిన విభాగంలో 150 మంది పిల్లలు చదువు కొంటున్నారు. వీరికి విద్యాబోధచేయటం కూడా ఒక 'కళ'యేకనుక, ఆ కళలో ప్రత్యేకంగా శిక్షణ పొందినవారే ఇక్కడ పనిచేస్తుంటారు.

ఈ పాఠశాలలో చేరే ప్రతి విద్యార్థీ, పది సంవత్సరాల కాలం శిక్షణ పొందవలసి వుంటుంది. ఈ పది సంవత్సరాల కాలంలో కొన్ని వృత్తివిద్యలలో చక్కని తర్ఫీదు ఇస్తారు. అంటే, పది సంవత్సరాల కోర్సు ముగిసిన అనంతరం, విదార్థి, తనకు నిత్య జీవితంలో అవసరమైన డబ్బును సంపాదించుకొన గలుగుతాడు. వర్క్‌షాపుపని, పుస్తకాలు బైండింగు చేయటం మొదలైన వృత్తులలో చెవిటివారికి, మూగవారికి శిక్షణనిస్తారు. వీరు, కొంతకాలం అయిన తరువాత కారుకూడా నడుప గలుగుతారు. ఈ విధంగా, ఇక్కడ శిక్షణపొందిన వారిల్లో దాదాపు వందమందికి వుద్యోగం చూపటం కూడా జరిగింది. వికలాంగులకు ఉపాధి కల్పించే వుద్యోగసంస్థ ఇటీవలనే ప్రారంభింపబడింది. దానిద్వారాకూడా ఇక్కడ విద్యార్థులకు వుద్యోగాలు దొరుకుతూ వుంటాయి.

కుట్టుపనులు, చిత్రలేఖనం, కొయ్యపనులను ఇక్కడి వారికి నేర్పుతారు. ఈ వృత్తి పనులలో వారికి ఆసక్తి కలిగించి, విద్యార్థులను చక్కని నిపుణులుగా తయారుచేస్తారు.

లోకజ్ఞానం సహజంగా తక్కువ పాళ్ళలో వుండే వికలాంగులకు విద్యాబోధన చేయటం కష్ట సాధ్యమని అందరూ అంగీకరించినదే. అంతేకాకుండా, ఇది చాలా ఓర్పుతో కూడిన పని. ప్రభుత్వం యీ పాఠశాల నిర్వహణకు ఏటా, పెద్దమొత్తాన్నే కేటాయిస్తున్నది.

ఓర్పుతోనూ, కష్టంతోనూ కూడిన పని అయినప్పటికీ, విద్యాబోధనకు ఇక్కడ 'ఫీజు' వసూలుచేయరు. దీనికితోడు 'హాస్టలు' సౌకర్యంకూడా కల్పించారు. పైగా బట్టలు కూడా వుచితంగా ఇస్తారు.

కేవలం బాలురకే కాకుండా, బాలికలకు కూడా ఇక్కడ ప్రవేశం వున్నది. ప్రస్తుతం విద్యాభ్యాసం చేస్తున్న 150 మందిలో 30 మంది బాలికలుండడం ప్రత్యేకంగా పేర్కొనదగిన విషయం.

మన దేశంలో అనేకమందివికలాంగులు గుడ్డి — చెవిటివారు వున్నారు. ఇటువంటి వారు మీ యింట్లో లేదా మీ బంధు మిత్రుల్లో మీ యిరుగు పొరుగున — మీ వూళ్ళో — మీ యెరుకలో యెక్కడైనా వుండవచ్చు. ఈ విద్యాలయాలద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేస్తున్న అమూల్యమైన సహాయాన్ని వారికి తెలియచెప్పివారుకూడా యీ సహాయాన్ని పొంది అభివృద్ధికివచ్చి విజ్ఞానవంతులైన పౌరులుగా రూపొందడంలో మీ బాధ్యతను మీరు నిర్వర్తించుతారు కదూ! — ★

## చీనా కథ

చిన్నతనములో చీనానామము
చెవిబడి నంతనె చీనాంబరములు
కౌశేయంబులు జ్ఞప్తికి వచ్చును,
ఊటలూరగా నోటను పిమ్మట
మెత్తని చక్కెర స్మృతిలో మెలగును
కౌమారంబున 'కంగ్' 'ఫంగ్' 'చంగ్'
సూక్తి పఠనమున బొక్కెడి వారము
మింగు నామధర మేదినీశ్వరుల
రంగుల మేలిమి పింగాణీలకు
ముగ్ధ మనస్సుల మురిసిపోయితిమి.
పట చిత్రంబుల, పంచ లోహముల
బహు విగ్రహముల పచ్చల సొబగుల
ప్రశంసించితిమి.
నల్ల మందు తిను నరులని ఎంతో
జాలిచెందితిమి,
శత్రు దేశములు చీనా భూమిని
చీల్చు చున్నపుడు
ఆక్రోశించితి మన్యాయం బని,
ఎట్టెట్టులో తెప్పరిల్లి కుదుటంబడ్డు
చల చల్లగా శక్తిసామర్థ్యముల్ పొంది
కాంచి 'రూసీ' అండక్రమముగా వర్ధిల్లి
మరిచిపోయిరి వెనుకమాటచీనావారు
బల విహీనుడు సురా
పానంబు చేయుచో
తత్క్షణంబే కైపు తల కెక్కెడి విధాన
అధిన వోత్సాహాస
ఆవేశ వశులైరి.
చీని చీనాంబరమ్ములవి యెల్లను
తెర్రులై తేళ్ళునై దుష్ట సర్పమ్ములై
చీనాచక్కెర అంతయుచేదై విషమై
పోయెను
మనసే విషమైపోయెను మరి కాని
దికేముండును ?
చూచి చూచి చతురమ్ముగ
చుట్టు పక్క ప్రదేశములో
కబళింపన్ జొచ్చినారు
కప్పవోలె మెల మెల్లన
'టిబ్బతి' దేశంబన్నను
దేవ భూమివంటి దంద్రు
అమాయకులు జనులు ; దాని
నాక్రమించి వేసినారు.
మంచి మంచి మాటలతో
మనసుగూడ మోసగించి
'లడఖ్' దిక మైన హిమా
లయము ఆక్రమించినారు.
'అసమ' దేశ భాగముపై
నాక్రమణము చేసినారు
భారత భాగములు కొన్ని
పట్టుకొనం దలచినారు
లోక మంత వారికి వ్యతి
రేకంబగు కారణమున
కుటిలనీతి పూర్వకముగ
కొంత వెనుక కరిగినారు
శీఘ్రముగా చైనీయులు
చేరవలయు యథాస్థితికి
వ్యవహరించుచుండ వలయు
న్యాయబుద్ధి తోడనింక.

శ్రీ శివశంకరస్వామి

బాలానందం : గుజరాతీ కథ

# చిలకమ్మ కథ

—వేటూరి ఆనందమూర్తి

["తాతా! తాతా! కథ చెప్పవూ'' అంటూ అడిగిన వెంటనే ఒక్క తాత నోటివెంటేకాదు అవ్వ—అమ్మా—నాన్నా యెవ్వరినడిగితే వారి నోటివెంట వెంటనే వెలువడే కథ ఒకే ఒక్కటుంది. "అనగనగా ఒక రాజు ఆ రాజుకేడుగురు కొడుకులు - ఏడుగురూ వేటకెళ్లారు. ఏడు చేపలు తెచ్చారు." అంటూ చెప్పుకొనే ఏడు చేపల కథ అది. మన దేశంలో ఆబాలగోపాలం యింత ప్రసిద్ధి చెందిన కథ మరొకటిలేదు. ఇదే విధంగా ఒక్కొక్క భాషకొక్కటిగా అన్ని భాషల్లోనూ ఆయా భాషీయులనోళ్లల్లో నానే కథలున్నాయి. వాటిల్లో కొన్నిటిని సచిత్రంగా యీ బాలానందం శీర్షిక క్రింద ప్రచురిస్తున్నాము—ఎడిటర్].

ఒక ఊళ్లోనేమో ఒక చిలక ఉండేది. ఒకసారి బాగా డబ్బు సంపాదించుకోవాలని ఆ చిలక, వాళ్ల అమ్మని వదిలి చాలా దూరం ఎగిరిపోయింగి. అలా పోతూ పోతూ ఉండగ దారిలో ఆ చిలకకు ఒక కాకమ్మ" ఎదురైంది.



'కాకమ్మా! కాకమ్మా! ఏఊరు వెళుతున్నావు?' అని అడిగింది చిలక.



'మీ అమ్మగారి ఊరికేనూ! అంది కాకమ్మ.

అలాగా! అయితే మా అమ్మతో ఈ మాట చెపుతావా? అంది చిలక. ఏమనంటే.



"చిన్నారి నీ చిలక హాయిగా వుంది. ఆకలీలేదూ, దాహమూలేదూ. తియ్యామామిడి చెట్టుకొమ్మ మీదుంది. చెరువుగట్టువె చిలక గూడు కట్టింది. ఆరముగ్గిన పళ్లు దోరకాయల్లు ఆరగిస్తూ చిలక హాయిగాఉంది"—అని.



కాకమ్మ కబురందిస్తే చిలకమ్మ సుఖంగా ఉంది.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

21 మే: ఖమ్మం జిల్లాలో ఎల్లందు పంచాయతిసమితిప్రారంభించబడింది.

26 మే: బలిమేల ప్రాజెక్టుకు చెందిన జాయింటు కంట్రోల్ బోర్డు హైదరాబాదులో సమావేశమై 1963-64 కాలానికి అనకట్టపై 3.50 కోట్ల రూపాయల్ని ఖర్చు పెట్టడానికి నిశ్చయించుకుంది.

27 మే: నిర్బంధ ప్రాథమిక విద్యపై మూడవ గోష్ఠి హైద్రాబాదులో జరిగింది.

కేంద్ర హోంమంత్రి అధ్యక్షతను దక్షిణమండల కమిటీ హైదరాబాదులో సమావేశమయ్యింది.

29 మే: రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి సంస్థకు పారిశ్రామిక ట్రస్టు నిధులనుండి 40 లక్షల రూపాయల్ని యిప్పించి ఉత్పత్తిని అధికం చేయడానికిరాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించుకుంది.

1 జూన్: హైద్రాబాదులోని జూబ్లీ హాలులో త్రైమాసిక బహుమతి పత్రాల పన్నెండవ డ్రా జరిగింది.

10 జూన్: గవర్నరు పోచంపాడు ప్రాజెక్టును సందర్శించారు.

12 జూన్: అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక కలాపాల సంస్థ తాలూకు ప్రచురణలను, దృశ్య ప్రదర్శన పరికరాలను హైదరాబాదులో ప్రదర్శించారు.

15 జూన్: ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ హైద్రాబాదు ఒంగోలుల మధ్య రాత్రిపూట నడిచే రెండవ బస్సు సర్వీసును ప్రారంభించింది.

18 జూన్: దక్షిణ భారతదేశంలోకెల్ల మొట్టమొదటి రేడియో రిలేస్టేషను కడపలో పని చేయడం ప్రారంభించింది.

## భారతదేశంలో

16 మే: ఇండో-పాకిస్థాను చర్చలు విఫలమైనట్లు ఒక సంయుక్త ప్రకటన వెలువడింది.

22 మే: అమెరికాకు చెందిన ఎవరెస్టు శిఖరారోహణ బృందంలోని యిరువురు సభ్యులు రెండు వేరువేరు మార్గాలగుండా శిఖరాన్ని చేరుకున్నారు.

23 మే: భారత దేశానికి 5.4 బిలియను 'ఎన్'ల వరపతి సౌకర్యాన్ని అందజేసే ఒప్పందంపై భారత, జపాను ప్రభుత్వాలు సంతకాలు చేశాయి.

24 మే: ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి అభివృద్ధి కార్యకలాపాలకై అంతర్జాతీయ అభివృద్ధిసంస్థ 20 మిలియను డాలర్లను సహాయం చేసింది.

25 మే: ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్. ఆఫీసర్ల పదవీ విరమణకాలం 58 ఏళ్లకు పెంచబడింది.

1 జూన్: అమెరికా, బ్రిటన్ దేశాలలో మూడు వారాలపాటు అధికారపర్యటనకై రాష్ట్రపతి బయలుదేరి వెళ్ళారు.

2 జూన్: బ్లేర్ రేవులో ఆకాశవాణి కేంద్రం ప్రారంభించబడింది.

5 జూన్: ఢిల్లీలో దేశవ్యవహారాల మంత్రి అధ్యక్షతన రాష్ట్ర ముఖ్య మంత్రులు సమావేశమయ్యారు.

12 జూన్: రాష్ట్రపతి అధికారపర్యటనపై లండన్ చేరుకున్నారు. రాష్ట్రపతి అధికార హోదాలో ఇంగ్లాండుపర్యటించడం యిదే ప్రథమం.

16 జూన్: శ్రీయుతులు హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం, కె.డి. మాలవీయల రాజీనామాలను అంగీకరించడానికి తాము నిశ్చయించినట్లు ప్రధాన మంత్రి ప్రకటించారు.

## విదేశాలలో

28 మే: భారతదేశానికి అమెరికా మరికొంత సహాయాన్ని అందజేయగలదని అమెరికా అధ్యక్షుడు పత్రికా విలేఖరుల గోష్ఠిలో తెలియజేశారు.

28 మే: జోమో కెన్యట్టా ప్రధాన మంత్రిగాగల మంత్రివర్గాన్ని ఒకదాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కెన్యా గవర్నరు కెన్యట్టాను కోరారు.

1 జూన్: కెన్యా తొలి ప్రధానమంత్రిగా 73 యేళ్ళ కెన్యట్టా ప్రమాణ స్వీకారం చేశారు.

3 జూన్: వెటికన్ నగరంలో పోపుజాన్ మరణించారు.

4 జూన్: పదిదేశాలూ ప్రపంచబ్యాంకూ పారిస్‌లో సమావేశమై, 1000 మిలియనుల మేరకు సహాయాన్ని భారత దేశానికి అందజేయడానికై నిశ్చయించుకున్నాయి.

5 జూన్: అమెరికానుండి ఇండియా అధిక సహాయాన్ని పొందే విషయమై భారత అమెరికా అధ్యక్షులు తిరిగి సంయుక్త ప్రకటన చేశారు.

17 జూన్: రష్యా వాలంటీనా తెరిష్కోవా అనే యువతిని తొలిసారి రోదసిలోకి పంపించింది. ★

# హిందూమత తేజః ప్రభ

## గ్రంథ సమీక్ష

సమీక్ష
**చెలమచెర్ల రంగాచార్యులు**

[గ్రంథకర్త : తిరుక్కోవలూరు పెద్ద స్వాములు శ్రీ కుమార ఆదివరాహాచార్యులు. 1/8 డెమ్మీసైజు. పుటలు 117. వెల రూ॥ 1-50. ప్రాప్తిస్థానము పెద్దస్వాములు శ్రీకుమార ఆదివరాహాచార్యులు c/o. శ్రీ ఊటుకూరి హాయగ్రీవగుప్త, అడ్వకేటు. బాపట్ల (గుంటూరుజిల్లా)]

శ్రీ కుమార ఆదివరాహాచార్యులవారు లోగడ ఏ భాష్యకారుల సిద్ధాంతములను అనుసరింపక భగవద్గీతయొక్క ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము అను పంచ లక్షణములకును, గీతాశ్లోకములయందలి శబ్దార్థములకును ప్రాధాన్యమునిచ్చి భగవద్గీతకు టీక వ్రాసియున్నారు. అందు వారి భావములను, విమర్శలను వివరణమని ప్రత్యేకించినారు. సర్వమత సమన్వయమునకై ఏ భాష్యములను వారు ఇందనుసరింపలేదు. తమ సొంత భావములనే 'భగవద్గీతాదివ్యప్రభ' అను పేర ఒక గ్రంథమును వెలువరించి అందలి దోషములను తెలియజేయుడని పండితులను అభ్యర్థించినను పండితాభిప్రాయము లభింపనందున 'ఈ పీఠికనే గ్రంథరూపమున ప్రకటించుచున్నా' నని విజ్ఞాపనములో ఆచార్యులుగారు వెల్లడించియున్నారు. ఇట్టి కష్టసాధ్యమైన తత్త్వగ్రంథము తదితరుల విషయమెటులున్నను తత్త్వజిజ్ఞాసువులైనను చదివి తమ అభిప్రాయములను తెలుపవలసిన అవసరమున్నది. లేనిచో ఇట్టి రచయితలకు నిరాశ నిస్పృహ లేర్పడి ఈ విధములైన రచనలే లేకుండు దుర్గతి వాఙ్మయమునకు పట్టును.

ఈ "హిందూమత తేజః ప్రభ"లో బ్రహ్మతత్త్వము, ఆత్మతత్త్వము, ప్రకృతితత్త్వము, ప్రాకృతతత్త్వము, మతతత్త్వము అను ఐదు భాగము లున్నవి.

బ్రహ్మతత్త్వమున భగవంతుని సాకారనిరాకార తత్త్వములను విమర్శించి 'ఉపాసకుల యభిరుచివెంట సోహం భావముతోగాని, దాసోహం భావముతోగాని అద్వైతోపాసనముగాని ద్వైతోపాసనముగాని, విశిష్టాద్వైతోపాసనముగాని ఎట్లుపాసించినను భగవంతుడు స్వతః సాకారుడు సగుణుడేకాని నిరాకారుడు నిర్గుణుడు మాత్రము కాదనుట సర్వవేదాంతసమ్మత మగు సిద్ధాంతమని ప్రతిపాదింపబడినది. బ్రహ్మతత్త్వ ప్రకరణమున చతుర్వింశతి వ్యూహములతో కేశవాది చతుర్వింశతి నామములకు గ్రంథకర్త గావించిన సమన్వయము మేలుగా ఉన్నది.

ఆత్మతత్త్వమందు ఆత్మను గురించి విచారింపబడినది. ఈ ఆత్మతత్త్వమును వేదవేదాంతములు జ్ఞానానంద స్వరూపము, తేజోమయము, నిర్గుణమని పలుకుచున్నవి. ఇట్టి ఆత్మలకు ప్రకృతి బద్ధత్వము తటస్థించుట యుపపత్తిసిద్ధమైయున్నదని ఆచార్యులవారు శంకరాచార్యులవారి అధ్యాసవాదమును, భాస్కరాచార్యులవారి ప్రతిబింబవాదమును వేదలోకమునకు విరుద్ధమని త్రోసివైచి యాదవప్రకాశుని పరిణామవాదమును శంకరాచార్యుని అద్వైతములో కలిపివేసిరి. ఇక ఏకాత్మవాదమున స్థాపించినది మొన్నమొన్నటి శివరామదీక్షితులనియు 'ఈ బజారు వేదాంతులు చెప్పెడు వేదాంత రహస్యములకు వారి నడువడులకు సంబంధముపమాత్రముఉండదనియు' వీరు భావించినారు. జీవులు నిత్యులు, ముక్తులు, బద్ధులని మూడు తెగలుగా నిరూపించి పచ్చపురుగు భావనాబలముచే వియద్గమనాది లక్షణములను పొందినట్లే జీవులు ఉపాసన యందలి భావనాబలముచేత భగవంతుని స్వరూప స్వభావములను పొందుటయందు మాత్రము విరోధము లేదనియు వచించినారు.

ఇట్లే జగత్తునకు పాదాన కారణమగు ప్రకృతితత్త్వమును, ప్రకృతి పురుషుల సంయోగముచేత ప్రపంచమునకు కారణమైన పాకృతతత్త్వమును, మతతత్త్వమును విపులముగా చర్చించియున్నారు. ముఖ్యముగా మతతత్త్వమును వివిధమతతత్త్వములను ఆచార్యులవారు ఓపికతో వివరించినారు. వివిధ మతముల స్వరూపమును తెలిసికొనగోరువారికి ఈ ప్రకరణమెంతయు ఉపకరించును.

### గీతాతత్త్వము

**ఆదివరాహాచార్యులవారి సిద్ధాంతము:**

భగవద్గీత సిద్ధాంతములను వెలువరించుచు జ్ఞానమునకు ప్రాధాన్యము స్వీకరించి గీతాశాస్త్రమునంతయు జ్ఞాన

సన్న్యాస పరముగా సమన్వయించుచు శంకరాచార్యులవారు భాష్యమువ్రాసినా రనియు, రామానుజాచార్యులవారు భక్తిని ప్రధానముగా మనస్సునందుంచుకొని గీతను భక్తిపరముగా సమన్వయించుచు భాష్యము వ్రాసినారనియు, నిజమునకు జ్ఞానసన్న్యాసములు భక్తియు గీతాశాస్త్రప్రతిపాద్యములు కావని ఉద్ఘాటించి భగవద్గీతకు కర్మపరముగానే అర్థము చెప్పవలయునని ఈ ఆదివరాహాచార్యులవారు సిద్ధాంతీకరించిరి. శ్రీ శంకరభగవత్పాదులుగాని, శ్రీ భగవద్రామానుజులుగాని కర్మసిద్ధాంతమును త్రోసి రాజనినారని భావించుట యుక్తముగా తోచుటలేదు. 'సాంఖ్యయోగౌ పృథక్ బాలాః ప్రవదన్తిన పండితాః' అని భగవద్గీతయే వాచ్యముగానే జ్ఞానకర్మయోగములు వేరు కావని చెప్పుచుండగా వానిని వేరుచేసి చూప ప్రయత్నించుట సమంజసము కాదు. మత ప్రవర్తకులగు ఆచార్యులును ఏదియో ఒకటియే సాధనమనిగాక కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులు ఆయా సాధకుని అర్హతలను బట్టి ముక్తికి సాధనములే యను తాత్పర్యము కలవారే యనుట తథ్యము. 'నబుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్'. అను వాక్యము 'నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే.' అను వాక్యముతోను, ఇవి రెండును. 'భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః' అను దానితోను-ఇవియన్నియు 'సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకంశరణం వ్రజ' అను వాక్యముతోను సమన్వయము నొందవలసియున్నవి. కావున అధికారి భేదముచే కర్మజ్ఞాన భక్తి ప్రపత్తులు ఉపాదేయములనుటయే గీతాచార్యుని తాత్పర్య మనవలెను. అదియే సంప్రదాయ సిద్ధము. అట్లనుటచే శ్రీ ఆదివరాహాచార్యులవారి కర్మసిద్ధాంతమునకును, ప్రాపులభించును. ఆస్తికులైన సర్వమతాచార్యుల యభిప్రాయములకును సమన్వయమేర్పడును.

శ్రీ ఆదివరాహాచార్యులవారు కావించిన ఈ తత్త్వాన్వేషణకృషి అభినంద్యము. మత భావములు సన్నగిల్లుచున్న ఈ కాలములో ఇట్టి గ్రంథముల యవసర మెంతయో కలదు.

## అమృతాభిషేకము

[గ్రంథకర్త: మధురకవి శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి; ⅛ క్రౌనుసైజు. పుటలు 77. వెల: రూ॥ 1-25 ప్రాప్తిస్థానం: మేనేజింగు ఎడిటరు, కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురం, అనంతపురంజిల్లా.]

ఇది మూడు భాగములు గల ఖండకావ్యము. ఇందు ఆంధ్రాభ్యుదయమను భాగములో పదునైదు శీర్షికలును వెన్నెల తీగలను భాగములో పది గేయ శీర్షికలును ఋతులక్ష్మి యను భాగమున పదునేడు శీర్షికలును గలవు. ఈ శీర్షికల లోని పద్యములు గేయములు కవిగారికి క్రొత్తపాతల మేలి కలయికపై గల అభిమానమును వ్యక్తముచేయుచున్నవి. ఉదయరేఖ యను కావ్యఖండికలో తెల్గువార తెలమిన్ నన్నయ్య తిక్కన్న స్వప్నమ్ముల్ గాంచుచు, పాత క్రొత్తలను సంభావింతు రేకాకృతిన్' అని ఈ కవి పలుకుట పై విషయమునే బలపరచుచున్నవి.

ఈ కవికి పద్యమును గేయమును సమానమైన ప్రతిభతో వ్రాయగల నేర్పు ఉన్నది. కష్టజీవి అను కావ్యఖండికలో

'పసుపు కుంకుమ పంచిపెట్టీ
భూమితల్లికి పూజసేసీ
కన్నబిడ్డల కావనెంచీ
కాళ్ళుగాలే కటికుటెండల
పంటకోతకు వరువులెత్తే
ఇంటియాడుది యెంతపడివా
పొట్టనిండని పాడుబ్రతుకిది
కాలం
కలసివస్తుందా!
కష్టం
ఫలము తెస్తుందా!'

అన్నది వీరి గేయరచనకు చక్కని యుదాహరణ. ఇక 'నెలకన్నె'లో పద్య రచనా రామణీయకతను చూడుడు!

'నీ సౌందర్యములో పరాత్పరుని
సందేశంబులన్ దాచిత
ద్వ్యాసంగంబున ప్రోత్సహించెద
వని ర్వాచ్యంబు నీ ప్రేమ నీ
పై సంధ్యాద్రి కాషాయ దీధితులు
ఖోగ్రివై పార్వతీదివ్య దీ
ఊాసంశోభితవౌదు మా యెడదలన్
సాక్షాత్కృతిన్ జెందుచున్.'

సుకుమార హృదయుడు, ఉదయరేఖలు, హిమగిరీంద్రము, ఉషాదేవి, కర్షకఋతువులు, సంధ్యారవము, నెలకన్నెలు అను కావ్యఖండికలలో ఈ కవి వర్ణన పాటవము సువ్యక్తమగుచున్నది. ఇది ఖండకావ్యమగుటవలన కావ్యఖండికలోని వస్తువు మరింత ఉదాత్తముగా ఉండునట్లు కవిగారు చూచుకొన్నట్లయిన ఇతోధిక సౌందర్యముతో కావ్యము శోభించెడిది. 'ప్రేమతీవెలు' మున్నగు మిశ్రమ సమాసములు ఈ కావ్యములో ఎక్కువగా గోచరించును.

పీఠికలో శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులుగారన్నట్లు లోకములోని మంచిని మాత్రమే చూడగలిగిన శ్రీ బెళ్ళూరివారి స్వార్థరహితమైన రచనలోని చిత్తశుద్ధి, గుండెలోతులు తరిచి చూడగల విజ్ఞులకు, సహృదయులకు ఈ కావ్యము సంభావనీయమే యగును.



(16వ పేజీ తరువాయి)

దాయకుండాను, వారకం తగ్గించడంలోను వారు విశేషంగా తోడ్పడవచ్చు. ప్రజలు విల్వచేసిన ధనాన్ని బంగారుబాండ్లు, బహుమతి బాండ్లలో పెట్టుబడిగా పెట్టించవచ్చు. యూనివర్సిటీలలోను, కళాశాలలలోను పనిచేస్తున్న ప్రణాళికా సంఘాలు ఇప్పటికే ఈ రంగంలో ఎంతో ప్రశంసనీయమైన కృషిచేశాయి. వీటివల్ల లభించిన ప్రోత్సాహంతో దేశంలోని విద్యాసంస్థలన్నింటిలోను ప్రణాళికా — రక్షణ సంఘాలను నెలకొల్పి పై కార్యక్రమాలను విస్తృతం చేయడం అవసరం.

ప్రణాళిక, రక్షణ కార్యక్రమాలపై సరైన సమాచారాన్ని ప్రజలకు అందజేయడంలో విద్యార్థులు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. అందువల్ల ప్రజల సానుభూతిని పొందడమేగాక, ప్రతిదశలోను వారిసహాయసహకారాలు లభిస్తాయి. ఏ దేశంలోనైనా ప్రజల నైతికస్థాయిపై ఆదేశపు శక్తి, సామర్థ్యాలు ఆధారపడివుంటాయి. ప్రజలు వదంతులకు లోనుగాక యదార్థస్థితిని ఎప్పటికప్పుడు తెలుపవలసిన బాధ్యత అందరిపైనా వుంది.

దేశంలో అత్యవసరస్థితి అంతంచెయ్యాలన్న వాదన ఒకటి వుంది. నిజానికి ఈ పరిస్థితి మనం తెచ్చిపెట్టుకున్నది కాదు. దేశ పునర్నిర్మాణంలో నిమగ్నులమై వున్న మనపై చైనా దురాక్రమణవల్ల తప్పనిసరిగా ఏర్పడింది. చైనా ఏకపక్షంగా కొన్ని ప్రాంతాలలో ఉపసంహరించుకొన్నప్పటికీ, కొలంబో ప్రతిపాదనలను తిరస్కరించడంతో అన్నివిధాల జాగ్రత్త వహించాలి. ఎట్టి అవాంతర స్థితికైనా సంసిద్ధులమయ్యేటందుకు, రక్షణ కృషిని పటిష్ఠం చేసుకొనేటందుకు ఈ అత్యవసరస్థితిని మనం వినియోగిస్తున్నాం. చైనా దురాక్రమణకు కోపోద్రేకులై మాతృదేశ రక్షణకు విశేషత్యాగాలు చేసిన మనప్రజలు జాతీయ సంసిద్ధతకు ఆత్యయిక పరిస్థితిని కొనసాగించడంలో సందేహించరు. ప్రజలకు యదార్థ స్థితిని తెలిపేటందుకు సర్వప్రయత్నాలు జరగాలి. విద్యార్థుల విరామసమయాలను ఇందుకు వినియోగించవచ్చు.

జాతీయోద్యమంలోనేగాక, జాతీయ పునర్నిర్మాణంలోకూడా ప్రముఖపాత్ర వహించిన మన విద్యార్థుల రక్షణకృషిలో తగుభాగస్వాములు కాగలరనడంలో సందేహంలేదు. మనపెద్దలు సాధించిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడమేగాక ముందు తరాలవారికి భద్రంగా అందజేయడానికి వారికిదొక సవాలు. ఈ ప్రయత్నంలో వారికి తప్పకవిజయం లభిస్తుంది. ★

---

(9వ పేజీ తరువాయి)

గాను ఎదుటివారు ప్రతీకార చర్యలకు పూనుకునేట్లు చేసి ఉద్రిక్తను పెంపొందించేందుకు ఉద్దేశపూర్వకంగా సాగిస్తున్న పన్నుగడలే.

## మలయేషియా

గత నెలలో టోక్యోలో మలయా, ఇండొనీషియా నాయకులమధ్య జరిగిన సమావేశంలో మలయేషియా స్థాపనసమస్యను శాంతియుతంగా పరిష్కరించే సూచనలు కన్పించాయి. ప్రెసిడెంట్ సుకర్నో ఆహ్వానాన్ని పురస్కరించుకొని మలయా ప్రధాని టుంకూ అబ్దుల్ రహ్మాన్ టోక్యో వెళ్ళారు. ఫిలిప్పైన్ రాజ్యాధినేతతో శిఖరాగ్ర సమావేశం జరపడానికీ, అంతకు పూర్వం విదేశాంగ మంత్రుల సమావేశం ఏర్పాటు చేయడానికీ వారు సమ్మతించారు. మనీలాలో విదేశాంగమంత్రుల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ఫిలిప్పైన్‌తో సహా అన్ని మలయారాజ్యాలతో ఒక సమాఖ్యను స్థాపించడానికి ఫిలిప్పైన్ ఒకక్రొత్త ప్రతిపాదన చేసింది.

దీని పర్యవసానం ఎలావున్నప్పటికీ ఈ రెండు ఆగ్నేయాసియా రాజ్యాల మధ్య వీటి ప్రస్తుతనాయకులు అవలంబిస్తున్న సామరస్య విధానంవల్ల సఖ్యత ఏర్పడే అవకాశం వుంది.

## స్వతంత్ర ఆఫ్రికా రాజ్యాల కృతనిశ్చయం

**అడిస్‌అబాబాలో** ఇటీవల ముగిసిన స్వతంత్ర ఆఫ్రికా రాజ్యాల సమావేశం పోర్చుగీసు, దక్షిణాఫ్రికాలోని వలస ప్రాంతాలలో స్వాతంత్ర్యానికై పోరాడే వారికి సర్వవిధాలా సహాయపడడానికి హామీ ఇచ్చింది,

బూజుపట్టిన తమ వలసవిధానాన్ని కొనసాగించే యత్నంతో స్పెయిన్, పోర్చుగల్ రాజ్యాధినేతలు (ఫ్రాంకో, సాలజార్) ఇటీవల సమావేశమయ్యారు, రొడీషియా (ఫెడరల్) ప్రధాని సర్ రాయ్ వెలెన్‌స్కీ, శ్వేత జాతీయుల ప్రాభవమున్న దక్షిణ రొడీషియా, దక్షిణాఫ్రికాలూ, పోర్చుగీసుల అంగోలా, మొజాంబిక్‌ల మధ్య ఐక్యతను సాధించడానికి ప్రయత్నించే సూచనలున్నాయి. కాని స్వతంత్ర ఆఫ్రికా రాజ్యాలవారు మాత్రం, తమమధ్య వలసపరిపాలనలను కొనసాగించడానికి చేసే ఎట్టి యత్నాన్నయినా వమ్ముచేయడానికి కృతనిశ్చయులైనారు.

ఆఫ్రికా, ఆసియా రాజ్యాలవారందరికీ వీరిపట్ల సానుభూతివుంది.

## తూర్పు పాకిస్తాన్‌లో తుపాను బీభత్సం

గతనెలలో తూర్పు పాకిస్తాను కనీ వినీ ఎరుగనంతటి తీవ్రమైన తుపాను తాకిడికి గురైంది. తత్ఫలితంగా విపరీతమైన ప్రాణనష్టం, ఆస్తినష్టం సంభవించింది. సుమారు 12 వేలమంది ప్రజలు మరణించారు. ముఖ్యంగా చిట్టాగాంగ్ జిల్లా ఎక్కువ నష్టపడింది. ఈ జిల్లాలో సుమారు 90 శాతం ఇండ్లు కూలిపోయాయి. మూడులక్షలకు పైగా ప్రజలు బాధలకు గురి అయ్యారు. భారతదేశం తక్షణమేతగువిధంగాసహాయం అందజేసింది. కొన్ని ఇతర దేశాలుకూడా ఈ ప్రకారం సహాయపడినవి. ★

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

# ప్రభుత్వ నిర్ణయాలు

సహకార సంఘాల రిజిస్ట్రారు విధులను వికేంద్రీకరించడానికీ, హైద్రాబాదులోని జాయింట్ రిజిస్ట్రారు ఉద్యోగాలను రద్దుపరచి కాకినాడ, కర్నూలు, వరంగల్, విజయవాడల్లలో ప్రాంతీయాధికార్లను నియమించడానికీ ప్రభుత్వం నిశ్చయించింది.

వైద్య కళాశాల లన్నింటిలోనూ మొత్తంమీద పది సీట్లను ఈ రాష్ట్ర వాస్తవ్యులు కానివారి కొడుకులు, కూతుళ్ళకొరకు ప్రతిభను పురస్కరించుకొని ప్రత్యేకించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. తెలంగాణా ప్రాంతంలోని వృత్తి కళాశాలలలో, రాష్ట్రాల పునర్విభజన ఫలితంగా తెలంగాణాప్రాంతానికి వచ్చివేసినవారి నిమిత్తం అయిదుశాతం సీట్లను ప్రత్యేకిస్తారు.

తమ వృత్తిపని చేసుకునే స్వర్ణకారుల పిల్లలకు, రాష్ట్ర మంతటా 7వ ఫారం వరకూ పాఠశాల ఫీజును మినహాయించడానికికూడా ప్రభుత్వం నిశ్చయించింది. అయితే అలాంటి పిల్లల తలిదండ్రుల వార్షికాదాయం రూ. 1800/- లకు లోపయి వుండాలి.

*గమనిక* :— రచయితలలో శ్రీ కె. వి. ఎన్. అప్పారావుగారిని "ఆత్మారామ్" గా గమనించవలెను.

